

'మంచిమనసులు' లో నాగేశ్వరరావు

# ఉత్తరాలు

## క థ లు

"ఆనందకృష్ణగారు రచించిన "మురళీ—ప్రిన్సి యల్ ఒకటే" కథ చాలా బాగున్నది

బి వెంకటేశ్వరరావు ( హైదరాబాదు )

శర్మగారు రచించిన 'బామ్మా—బొచ్చుకుక్కా' చాలా బాగుంది చదువుతున్నంతసేపు విపరీతంగా నవ్వు కూడా వచ్చింది కథ నాల్గుసార్లు చదివాను

పి ఇందిర ( బరంపురం )

* * *

"ఇప్పటివరకు నోరి నరసింహశాస్త్రిగారి "కవి సార్వభౌముడు," మరల ఈ వారం శాస్త్రిగారి రచన "రాగమాలిక" చదివేసరికి ఎడారిలో పన్నీరు జల్లినట్లయినది పై రెండు రచనలలోని నిండైన అసలు తెలుగుకి ఈనాటి చౌకబారు సాహిత్యానికి గల తేడా స్పష్టంగా వ్యక్తమౌతున్నది కనుక ప్రతి సంచిక లోను పై చెప్పిన రచయితల స్థాయివారి రచనలను ఒక్కటైనను ప్రతివారం ప్రచురించ ప్రార్థన

బి వి రామారావు ( తెనాలి )

* * *

శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి "రాగమాలిక" చదివి, వారి రచనా శైలికి ముగ్ధుడనయ్యాను

కె రామశర్మ ( సికింద్రాబాద్ )

* * *

ఉగాదిసంచికలో "రాగమాలిక" రచయిత మల్లాదిరామకృష్ణశాస్త్రి, సినిమా రచయిత మల్లాది వీరిద్దరు ఒకరేనా?

దాచేపల్లి ముత్యాలు (మధిర)

**ఒకరే**

## సీరియల్ కథ

23—3—62 సంచికలోని భూగర్భంలోనికి సాహసయాత్ర కథలో 163 డిగ్రీల సెంటిగ్రేడు, వీటి ఉష్ణోగ్రత అని ఉంది ఇది ఎలా సాధ్యం?

భీమలింగం (గొల్లప్రోలు)

**మూలంలో అలా ఉన్నది వాయు పీడనా శక్తి అధికమయితే ఉడికే ఉష్ణోగ్రస్థితి ఎక్కువ అవుతుంది సం॥**

## హమేషా తమాషా

30—3—62 వ తేదీ సంచికలో యన్ బాల గోపాల్, ఆర్ కనకాద్రిగారు నేను వ్రాసిన హమేషా తమాషాలోని "సినీ సంసారాన్ని" గురించి విమర్శించారు ఈ విమర్శకులు కాస్త ఆ పేరులోని అర్థమేమిటో గ్రహిస్తే చాలా బాగుంటుంది కేవలం అది హమేషా తమాషాగా వ్రాశానేగాని వీరిచే విమర్శించ బడాలనే ఉద్దేశ్యంతో వ్రాయలేదే! హమేషా తమాషా అనే పదానికి అర్థంగ్రహించి, తరువాత ఆ విమర్శించే దాన్ని విమర్శించమని మరీ, మరీ ప్రార్థిస్తున్నాను

కె మీనా విజయ్ (బాపట్ల)

* * *

## చదువుల్రావు

ఒక చిన్న సందేహం! ఏప్రిల్‌ఫూల్‌ని చెయ్యవలసినది 1 వ తేదీనగదా ఆ 1 వ తేదీ ఆదివారం మరి మన చదువుల్రావుగారికి ఆదివారం రోజున ఎవరు పరీక్షలు పెట్టారో చెప్పగలరా యిందులో ఎవరి పరాకైనా వున్నదంటారా, లేక ఈ అసందర్భపు కార్టూన్‌తో నవ్వించి, పాఠకులనే ఏప్రిల్‌ఫూల్స్‌గా చెయ్యదల్చుకున్నారా!

వై వి యల్ నరసింహారావు (బందరు)

**ఏమో, ఏమని చెప్పగలం**

* * *

## హెచ్చరిక!

"దూరంగా రంగు రంగుల్లో ఉండేవి సరిగ్గా కనిపించవండి అందికే కళ్ళజోడు వాడుతుంట" మరో విషయం నా కళ్ళజోడు గురించి "స్టంటు హీరో కళ్ళజోడు, తూరీగలా మీసాలు అని అన్నారంటే పరువునష్టం దావా వేయదలచుకున్నానండోయ్

చదువుల్రావు (హైద్రాబాదు)

## సరాగమాల

ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక అందినది ఈ సంచికలో ప్రవేశపెట్టిన 'సరాగమాల' శీర్షిక చాల బాగున్నది శ్రీ వి ఎ కె రంగారావుగారు ఆ శీర్షికను బాగుగా నిర్వహించారు వారికి నా ధన్యవాదములు ఈవిధముగానే నా రీశీర్షికను ప్రతివారము నిర్వహించెదరని ఆశించుచున్నాము

ఎన్ గిరిజాశంకర్ (కాకినాడ)

## ఫిలిం బాలెట్

ఉగాదిసంచికకును పండుగగానే యున్నది కానీ, మద్రాసు తెలుగు (ఆంధ్రనుంచి వచ్చినవారికి) వారికి మాత్రం 'ఫిలిం బాలెట్' కొంచెం విచారం కలిగిస్తుంది ఎందుచేతంటే, సాధారణంగా ఏ తెలుగు సినిమాలు ఇక్కడకు (విడుదలకు మాత్రం) రావు వచ్చినా ఎంతో పాత సినిమాలు వస్తాయ్ అలాంటప్పుడు 'ఫిలిం బాలెట్' కార్డు వ్రాయుట వీరికి కొంచెం కష్టం నేను పుస్తకం పుచ్చుకొన్న వెంటనే ఫిలిం బాలెట్ చూచి, చాలా సంతోషించాను వెంటనే విచారించాను

మంగళంపల్లి రామకృష్ణ (మద్రాసు)

## వ్యాసాలు

ఉగాది సంచికలో ప్రచురించిన "క్యూ" అనే వ్యాసములో నేటి మన ఉద్యోగస్తులు (గుమాస్తాలు, బస్ కన్‌డక్టర్లు) ప్రవర్తకంటికి కనిపించునట్లుగా వ్యాసకర్త రచించిరి వ్యాసధోరణి చూడగా, వ్యాసకర్తగారికి, ఉద్యోగులపై గల చెడు అభిప్రాయమును సూచించినట్లు కనుపించినది ఉద్యోగులట్లు ప్రవర్తించుటకు గల ముఖ్యకారకులైన ప్రజల ప్రవర్తన వారికి బోధపడినట్లులేదు చాలీ చాలని భత్యములతో సంసారమునీదు ఉద్యోగులపై వ్యాసకర్తగారు సానుభూతి చూపకపోగా, దుయ్యబట్టుట వారి నైతిక ప్రవర్తనను సూచించును

గుడిమెళ్ల అప్పల నరసింహం (హైదరాబాదు)

* * *

ఉగాది సంచికలో వెలువడిన 'క్యూ' అనెడి వ్యాసము హాస్యముతోనూ, సహజత్వముతోనూ కూడుకొని యున్నది ప్రతి యొక్కరూ 'క్యూ' పద్ధతిలో చదువదగిన వ్యాసము

జి వి శ్రీధర్ (మద్రాసు)

* * *

శ్రీ కొవ్విడి లక్ష్మన్నగారు వ్రాసిన రెండు పేజీల వ్యాసంలో 4 కాలంలు రైల్వేవవారిపై విమర్శకే వినియోగించి "క్యూ" అనే వ్యాసాని పూర్తి న్యాయం చేకూర్చలేదని నా అభిప్రాయం. అదే సంచికలో 43 పేజీలో వున్న విట్టు ఈ వ్యాసం కంటే మెరుగ్గావుంది ప్రయాణీకులు తమ అదుర్దా కొద్దీ అర్థార్థ రహితప్రశ్నలతో విసిగించటం నగ్న సత్యం అయినప్పటికి ఆ టిక్కట్టు కలక్టరు ప్రవర్తన పూర్తిగా సహించరానిది కాని ఎంక్వయిరీలో మెయిలు రైటుటైముకు వస్తుందనో, లేక లేటుగా వస్తుందనో చెప్తారు కాని, "పాయి గోడకి వున్న బోర్డు చూసుకోండి" అని చెప్పరు అది సత్యదూరం టిక్కట్లు అమ్మగా, మిగిలిన యితర పనులు పూర్తి చేసుకోవాలంటే, టిక్కట్లు అమ్మేందుకు ప్రత్యేకమైన టైము కేటాయించుకోవాలి గదా

అంతేకాని, వారన్నట్లు వచ్చిన ఒక్కొక్కడికి తలొక టిక్కట్టు వారడిగినప్పుడు పారేస్తే ఆ పని భారమే అవుతుంది, కాని సులువుకాదు గుమాస్తాగిరీ వెలగబెట్టాలంటే ఆత్మాభిమానాన్ని చంపుకోవాలి అటువంటప్పుడు వారు కొట్టింది దెబ్బే కాదు గుమాస్తాలకి సరైన దెబ్బ కొట్టాలంటే రామబాణంవంటి కంప్లెయింటు బుక్కు వుండనేవుంది. ఆ విషయాన్ని వారెందుకు విస్మరించారో (వారికి తెలియదని భావించను) తెలియలేదు ఒక్క కంప్లెయింటుతో ఓ పిడుగువంటి పనిష్మెంటు, ఇది న్యాయమా, అన్యాయమా అని ఆలోచించకుండా గుమాస్తా నెత్తిన పడుతుంది ఈ సత్యాన్ని గ్రహిస్తే శ్రీ లక్ష్మన్నగారు గుమాస్తాలను బ్రహ్మరాక్షసులతో పోల్చక, వేరొక్క జాతిగా, మరొక్క అబ్రహాం లింకనుకోసం ఎదురు చూస్తున్న జాతిగా గ్రహించి వుండేవారు

అయినంపూడి కృష్ణమూర్తి (గుడివాడ)

* * *

జీవితం నేర్పిన పాఠాలు వ్యాసం ప్రచురించినందుకు మీకు మా ధన్యవాదాలు అప్పుడప్పుడు ఇటువంటి వ్యాసాలు ప్రచురించెదరని ఆశిస్తున్నాము. ఈ వ్యాసంలో తెలుసుకోవలసినవిషయాలు చాలా వున్నాయి

చిల్లర శేషగిరిరావు (గంగవట్నం)

★

మీకిష్టమైన నూనెల్లోనానబెట్టుడు

**కాష్మీర్-కుసుం**

కేశములను పెరిగించును అకాలనెరసువరాన్నును.

చరుమ ఉపద్రవములకు **సౌంటలక్స్** మలాము చరుమ అపాయములకు

"కోతి" శ్రేష్టమైన ఉదువత్తులు, సువాసనలు & ఫ్లవర్ డస్ట్ సెంట్లకు

నంజనగూడు పండ్లపొడి & అపూర్వ ఔషధములు ..

యునైటెడ్ కెమికల్స్, మదరాసు. [హైదరాబాద్, విజయవాడ]

నంజనగూడు ఔషధములకు ఒక టవునుకు ఒక స్టాకిస్టును ఆహ్వానించెదము.

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటనలు మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి. వివరాలకు ఎడ్వర్‌టయిజ్‌మెంట్ మేనేజర్‌కి వ్రాయండి.



చూడండి, రహస్యము
ఏమిటంటే...
అందరూ టినోపాల్
వాడుతున్నారు!

మీ బట్టల మాటేమిటి? మీ తెల్ల నూలు మరియు రేయాన్ బట్టలకు టినోపాల్ పెడతారా? తెల్ల బట్టలను ఊరికే ఉతికితే సరిపోదు. మీరు వాటిని ఉతికిన తరువాత కొంచెము టినోపాల్ కలిపిన నీళ్లలో ముంచి తీస్తే ఎంత తేడా వస్తుందో చూడండి! మీ చాకలితో కూడ దానిని వాడమని చెప్పండి! టినోపాల్ ఎంతో పొదుపుచేకూరుస్తుంది ఇంట్లో అందరి బట్టలు ఉతుకునపుడు కొంచెము వాడితే చాలును. దానిని నేడే కొనండి!







టినోపాల్ జె. ఆర్. గెయిగీ ఎస్ ఎ బాసెల్ స్విట్జర్లెండ్ వారి రిజిస్టరుచేయబడిన ట్రేడు మార్కు.

కొంచెము

**టినోపాల్**

తెల్లని దుస్తులను అన్నిటికన్న తెల్లగా చేయును

తయారుచేయువారు
సుహృద్ గెయిగి లిమిటెడ్
వాడి వాడి బరోడా

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గెయిగి ట్రేడింగ్ లిమిటెడ్ పో. బా. నెం. 965 బొంబాయి 1

SISTA'S-SG-137-TEL

# ఆంధ్రసచిత్రవారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు


## విషయానుక్రమణిక


శుక్రవారం *20-4-62*

శుభ॥సం॥ చైత్రమా॥ శు॥పూర్ణిమ

సంపుటము · 54 సంచిక . 33

స్థాపితము:

1908

*

ముఖ్యసంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి 25 న పై

సంవత్సర చందా : 13-0-0 రు

*

ఆంధ్రపత్రిక కార్యాలయము

7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

★




ముఖచిత్రం :
శ్రీ వి. వి సత్యమూర్తి.

## లోకంపోకడ



"మహాజనులారా ! కాంగ్రెసు పాలనను విమర్శించే వారికి ఇదే నా సమాధానం ఈ నాడు విద్యావసతులు వృద్ధి అయ్యాయి కనుకనే నిరుద్యోగ సమస్య ఎదురైంది, ప్రజల కొనుగోలు శక్తి పెరిగింది కాబట్టే ధరవరలు పెరిగాయి, వాడకం ఎక్కువైంది కాబట్టే కాటకం ఏర్పడింది, అవినీతి అంటారా దినదినాభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో అది ఉండక తప్పదు మరి "

# పారిశ్రామికాభివృద్ధికి అడ్డుపడుతున్న దెవరు?
# గనులు ఉండికూడా రాష్ట్రానికి బొగ్గుకాటకం!

కౌండిన్య



దేశోద్ధారకుల 24 వ పుణ్యవర్ధంతి ఈ 16 న జరిగింది.

ఇటీవలి రాష్ట్ర శాసనసభలో గవర్నర్ ప్రసంగంపై చర్చకు సమాధానమిస్తూ, ముఖ్యమంత్రి శ్రీ సీలం సంజీవరెడ్డి "మనకు పారిశ్రామిక దృక్పథంలేదు. పంజాబులాగా లఘు కుటీర పరిశ్రమలపై ఆధారపడవలసిందే" అన్నారు. పారిశ్రామిక దృక్పథం అంటే, భారీ మధ్యరకం పరిశ్రమలను పెంపొందించుకోవాలన్న ఆసక్తి, పట్టుదల అని అర్థం. అయితే అటువంటి దృక్పథం 'మనకు లేదని' అంటే ఆ లేకపోవడం ప్రభుత్వానికో లేక ప్రైవేటు పెట్టుబడిదారులకో వారు స్పష్టంగా చెప్పలేదు. కాని ప్రైవేటు పెట్టుబడిదారులకేనని వారి ఉద్దేశ్యమై ఉంటుంది. మనది వ్యవసాయ ప్రధానమైన రాష్ట్రమవడమేగాక, రైతాంగంలో కూడా ఎక్కువ మంది మధ్యతరగతివారే గనుక, ధనవంతులు, పెట్టుబడిదారులు అట్టేమంది లేకపోవడం ఆశ్చర్యం కాదు. కాని ఏ రాష్ట్రంలోనైనా, కేవలం ఆ రాష్ట్ర ప్రజలే పెట్టుబడి పెట్టి, పరిశ్రమలు పెంపొందించాలనిలేదు. అట్లా ఎక్కడా జరగడంలేదు. ఉదాహరణకు మనదేశమే తీసుకోండి. విదేశీ కంపెనీలు ఎన్ని వచ్చి, మనవారితో వాటా కలసి కొత్త పరిశ్రమలు ఇక్కడ పెట్టడంలేదు. అదేవిధంగా మన పొరుగు రాష్ట్రమైన మద్రాసులో, ఇతర రాష్ట్రాలవారు ప్రారంభించి నడుపుతున్న పరిశ్రమలు ఎన్ని లేవు? పరిశ్రమలు నెలకొల్పడానికి కావలసిన హంగులన్నీ చూపి ప్రభుత్వం తగు ప్రోత్సాహ మిచ్చినట్లయితే, ఇతర రాష్ట్రాలవారు మన రాష్ట్రానికి ఎక్కి పరిశ్రమలు పెంపొందించే వీలుంటుంది.

అయితే మన రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న పనులు, ఇతర రాష్ట్రాల వారిని ఆకర్షించేవి గాకుండా, పొడల కొట్టి, తిప్పి పంపేవిగా ఉంటున్నవి. పరిశ్రమాభివృద్ధికి కావలసిన ప్రధానద్రవ్య విద్యుచ్ఛక్తి. కావలసినంత విద్యుచ్ఛక్తి రాయితీ రేట్లకు సప్లై చేస్తామని చెబుతూనే కొత్త పరిశ్రమల సంగతి దేవుడెరుగు, ఉన్న పరిశ్రమలకే కోత పెట్టారు. అది నాలుగో వంతు తగ్గించారు. ఈ తగ్గింపు విషయమై ఆమధ్య ప్రభుత్వం ఒక ప్రకటన చేస్తూ, "ఆంధ్రప్రదేశ్ అనుకోనంత శరవేగంతో అభివృద్ధిలోనికి వస్తున్నదని, అందువల్ల, రెండవ ప్రణాళికలో ఉత్పత్తి చేసుకున్న విద్యుచ్ఛక్తి యావత్తు వినియోగమై పోయిందని" తెల్పింది. శరవేగంతో వచ్చిన ఆ అభివృద్ధి ఏమిటో ప్రభుత్వానికే తెలియాలిగాని, మనబోటి సామాన్యులకు అర్థంగాదు. కేంద్రం పెట్టే చిక్కుల వల్లగాని, విదేశీ ద్రవ్యం కొరతవల్లగాని, మూడవ ప్రణాళికలోని రు. 69.94 కొత్త స్కీములలో రు. 28 కోట్ల విలువగల వాటికి దెబ్బ తగులుతోంది.

ప్రణాళికాబద్ధంగా అభివృద్ధి కృషి సాగుతున్నప్పుడు, అనుకోనంత అభివృద్ధి జరగడమన్నది అసంభవం. అయినా ఇప్పుడు విద్యుచ్ఛక్తి కొరత ప్రస్తుతం ఉన్న పరిశ్రమలకేగదా. ఇదంతా ప్రణాళిక కార్యక్రమాలు సరిగా వేసుకోకపోవడము, వేసుకున్నా సక్రమంగా అమలు జరక్కపోవడం ప్రధాన కారణం. అదిగాక క్రితం రెండు సంవత్సరాలుగా కేంద్రం 80 కొత్త పరిశ్రమలకు లైసెన్సు లిచ్చినప్పుడు, వీటికి విద్యుచ్ఛక్తి లభిస్తుందా అని రాష్ట్ర ప్రభుత్వాన్ని అడగ్గా, ఈ పరిశ్రమ లేర్పడేసరికి పుష్కలంగా లభిస్తుంది మరేం పర్వాలేదని భరోసా ఇచ్చింది. తీరా అవి ఏర్పడేసరికి విద్యుచ్ఛక్తి కరవై పోవడం, కోట్లు పెట్టుబడి పెట్టిన పరిశ్రమలు వృథాగా పడిఉండటం—ఇదంతా ప్రభుత్వ అస్తవ్యస్త ధోరణికి, అలక్ష్యానికి నిదర్శనం. ఈ విద్యుచ్ఛక్తి కోతవల్ల, సింగరేణి బొగ్గు గనుల ఉత్పత్తి ఐదోవంతు తగ్గుతుందన్నారు. సిమెంటు పరిశ్రమలో రోజూ 200 టన్నుల ఉత్పత్తి నష్టమవుతోందన్నారు. ఇంకా చిల్లర మల్లర పరిశ్రమ లనేకం దెబ్బ తింటున్నాయి.

ప్రథమ ప్రణాళికలో అదివరకున్న థర్మల్ పవర్ గాక, నిజాంసాగర్, మాచ్‌ఖండ్, రామగుండం కేంద్రాల విద్యుచ్ఛక్తి 123 వేల కిలోవాట్లు ఉత్పత్తి అయింది. ఇదంతా ఎలా వినియోగమైందో తెలియదు. ఇరిగేషన్ మంత్రి శ్రీ ఎ. సి. మొన్న ఈమధ్య రాజధానిలో పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ, విద్యుచ్ఛక్తి పరిస్థితి క్లిష్టంగా ఉన్నదని, మరో 12 నెలలయ్యేసరికి 1 లక్ష కిలోవాట్లు అదనంగా ఉత్పత్తి అవుతుందని హామీ ఇచ్చారు. బహుశా కొత్తగూడెం థర్మల్ స్కీము, రామగుండం విస్తరణ స్కీము, నెల్లూరు థర్మల్ స్కీము ఇలాంటివి దృష్టిలో పెట్టుకుని ఆ హామీ ఇచ్చిఉంటారు. ఈ స్కీములు—విదేశీ ద్రవ్యం కొరత, తదితర

—62వ పేజీచూడండి

# వడ గాడ్పులు


సమితిలో


చైనాలో
ఆర్థికసమస్యలు


ప్రపంచ పరిస్థితి
అణ్వాయుధ


ఆయూబ్ దురవస్థ
ప్రజల తిరుగుబాటు


నెహ్రూ తపన


హైదరాబాదు అగ్నిగుండం
ముఠా తగాదాలు

# చిరునవ్వు మెరిసింది

శ్రీమతి రత్నాభాస్కరం



రా అక్క తుదికోరికగా నిన్ను చూడాలం'
టోంది వెంటనే బయలుదేరు—బావ
వచ్చిన టెలిగ్రాం చూసి రామం కంపించి
ాడు మనసంతా మమతతో నిండిపోయింది
క్షలా కావేషీలా సృష్టించుకుంటే, అభి
ాన్ని అనుమానాలు జయిస్తే, బ్రతికున్న
నాలుగుదినాల్లో ఒకళ్ల కొకళ్ళు కాకుండా
ం తప్ప మేలు సున్నా పంతాలు వంతలై జీవి
బలిగొన్నాక చేయగలిగేదేమిటి—చెయ్యకాలేక
బు సీమ్యం అవడం తప్పితే—
బావ చాలా గంభీరుడు ఎంతో ప్రమాదం లేక
అలా వ్రాయడు.

ఆఫీసు కాయితాలు కట్టకట్టి, శలవురాసిచ్చి ఇంటి దారిపట్టాడు రామం నిశ్శబ్దంగాపెట్టెలో చేతి కొచ్చిన గుడ్డలు వడేసుకున్నాడు

తెల్లబోయి చూస్తున్న కమలతో "అక్కయ్యని చూసిరావాలి" అని పొడిమాటలు చెప్పాడు జేబులో టెలిగ్రాం టేబిలుమీదపడేసి వాకిట్లోకొచ్చాడు

'పిలయినంత వేగమే వస్తాలే—' అని అడగని ప్రశ్నకి సమాధానం చెప్పాడు

బాబూ సుధా 'ఎక్కడికి నాన్నా—''నేనూ వస్తా' అంటూ కాళ్లకి చుట్టుకున్నారు 'ఇప్పుడే మళ్లీ వొచ్చితీసికెళతాగా ఇందు—బిళ్లలు కొనుక్కోండి.' అని వాళ్లిద్దరి చేతుల్లో చెరోబేడాపెట్టి రోడ్డు మీది కొచ్చాడు

శూన్యమనస్కుడై నడిచి స్టేషన్ చేరుకు న్నాడు మనస్సు పరిపరివిధాల అందోళన చెందు తోంది గుంపులు గుంపులుగా జనం నించున్నారు బండిరాక కోసం వెయ్యికళ్లూ వెయ్యేసి కళ్లతో ఎదురుచూస్తున్నాయి పళ్లు, కిళ్లీలూ, ఫలహారా లమ్మేవాళ్లు అంతకంటే హడావుడిగా సర్దుకుం టున్నారు ఇంతమంది జనం ప్రయాణా లెక్కడికో ఉద్యోగంలో చేరడానికి కొకడు, నవవధువును చూడ డాని కింకొకడు, కొత్తపాపాయిని తీసుకు రావడాని

—58 వ పేజీ చూడండి



## కార్ట్యూనులు 27

సంగీత దర్శకుడు పెండ్యాల
సప్తస్వరాల ఉయ్యాల
ఉర్రూతలూగించి ఆకాశమూ,నేలా
ఒక్క ఊపులో చూపిస్తాడు అలా అలా,,

# ప్రధాని ఆరోగ్యం హరించే ప్రముఖులకు హెచ్చరిక: భారత్ లో అణువిద్యుత్ కేంద్రం ఏర్పాటుకు పోటీలు

శ్రీ కృష్ణ



రాజకీయ రంగంనుంచి నిష్క్రమించ నున్న బాబూ రాజేంద్రప్రసాద్

ప్రధానమంత్రి అస్వస్థత ఇక్కడ కొంత ఆందోళన కలిగించింది. శ్రీ నెహ్రూకు వచ్చింది మామూలుజ్వరమే కాబట్టి త్వరలోనే కోలుకున్నారు కూడాను. ఆయన జబ్బుకు అసలు కారణం అలసట. ఎన్నికల ప్రచారంలో శక్తికిమించి పని చేశారు. రాజకీయవాదులు, ముఖ్యంగా మంత్రులు అప్రధానమూ, అనవసరమూ అయిన తంతులకు ప్రధానిని వేధించటం గమనార్హం. ఢిల్లీ కాంగ్రెసు వాదులు తమ గొప్పతనాన్ని చాటుకునేందుకు ప్రతి అర్థమ్లైన సభకూ శ్రీ నెహ్రూను ఆహ్వానిస్తూ ఉంటారు. అస్వస్థతకు లోనయ్యే ముందు ప్రధాని పింప్రీకి వెళ్ళి అక్కడ ప్రభుత్వరంగంలో కొత్తగా ఏర్పాటైన "హిందూస్తాన్ యాంటిబయాటిక్స్" సంస్థకు ప్రారంభోత్సవం జరిపారు. ఆరోజున ఆయన ఉదయం గం. 8—30 లకు ఢిల్లీ నుంచి బయలు దేరి గం. 11 లకు బొంబాయి చేరారు. అక్కడ నుండి కారులో పూనా వెళ్లి అసంఖ్యాకమైన కార్యక్రమాలలో పాల్గొని సాయంత్రానికి ఢిల్లీకి తిరిగి వచ్చారు. ఒక్క రోజులో ఇన్ని పనులు చేయవలసివస్తే యువకులే తట్టుకోలేరు. మరి శ్రీనెహ్రూ వయస్సు 72 సంవత్సరాలు!

శ్రీ నెహ్రూ కనీసం మరో దశాబ్దంవరకైనా జీవించాలి. దేశానికి ఆయన అవసరం ఎంతైనా ఉంది. దేశ శ్రేయస్సుదృష్ట్యా ఆయనచేత అతిగా పనిచేయించరాదు. వారాని కొకరోజు ఆయన సెలవుతీసుకునేట్లు చూడాలి. లేదా మహాత్ముని మాదిరిగా శ్రీనెహ్రూ కూడా వారాని కొక రోజు మౌనం వహించాలి. ఇప్పుడు ఆయనకు కలిగిన అస్వస్థత హెచ్చరిక వంటిది. దేశప్రజలు ఈ హెచ్చరికను జాగ్రత్తగా గమనించాలి. ప్రధాన మంత్రి తమ జీవితమనే వత్తిని రెండు వైపులా కాల్చివేస్తున్నారు. కాలిపోగా మిగిలిన ఆ వత్తిని కనీసం మరొక పదేళ్లపాటు సంరక్షించుకోటం దేశవాసుల కర్తవ్యం.

*　　　*　　　*



శ్రీ నెహ్రూ



శ్రీ మొరార్జీదేశాయ్



శ్రీ ఎస్. కె. పాటిల్



శ్రీ హుమయూన్ కబీర్



శ్రీ స్వరణ్ సింగ్



డా॥ శ్రీ మాలి

లోక్ సభ అధ్యక్షుడు శ్రీ ఎం. అనంతశయనం అయ్యంగార్ దేశానికి చేసిన సేవకు ఇప్పుడు సముచితమైన పరిగణన లభించింది. వారు బీహార్ గవర్నర్‌గా నియుక్తులయ్యారు. 1935 లో వారు కేంద్ర శాసనసభలో ప్రవేశించి, అనతి కాలంలోనే తమ శక్తి సామర్థ్యాలు నిరూపించుకున్నారు. లోక్‌సభలో మొదట ఉపసభాపతిగా వ్యవహరించి, శ్రీ మౌలంకర్ స్వర్గస్థులైన తరువాత సభాపతి అయ్యారు. వారి నిష్క్రమణం వల్ల ఢిల్లీలోనూ, లోక్ సభలోనూ కూడా ఏదో వెలితిగానే ఉంటుంది. ఇప్పుడు శ్రీ అయ్యంగార్ రాజకీయాలకు దూరమయ్యారనే అనుకోవచ్చు. అయితే ఏనాటికైనా వారు ఉపరాష్ట్రపతిగా మళ్లీ ఢిల్లీ వచ్చే అవకాశం లేకపోలేదు. నూతన పదవిని చేపట్టనున్న శ్రీ అయ్యంగార్‌కు ఢిల్లీవాసులు తమ శుభాకాంక్షలు అందజేస్తున్నారు.

*　　*　　*

ప్రజాళికా సంఘంలో కొత్తగా చేరిన మరొక ప్రముఖుడు శ్రీ విష్ణుసాహే. ఆయన దేశీయాంగ శాఖ ఉపకార్యదర్శిగా ఢిల్లీ వచ్చారు. కేవలం సమర్థతవల్లనే పైకివచ్చి, మంత్రివర్గ కార్యదర్శి పదవిని అలంకరించారు. ఇదివరలో ఆయన అస్సాం గవర్నర్‌గాను, కాశ్మీర్ వ్యవహారాల కార్యదర్శిగాను వ్యవహరించారు. ఈ ఏడు వేసే కొత్త గవర్నర్లలో ఆయన కూడా ఒకరు కావచ్చు.

*　　*　　*

ఐరోపా సమిష్టివిపణిలో బ్రిటన్ ప్రవేశం వల్ల కలిగే సాధకబాధకాలను గూర్చిచర్చించేందుకు సెప్టెంబరు 10 వ తేదీన లండన్‌లో సమావేశం ఏర్పాటుచేయదలచామనీ, అది అనుకూలమైన సమయం అవునో కాదో తెలుపవలసిందనీ కోరుతూ బ్రిటన్ ప్రధాని కామన్వెల్తు ప్రధానులకు లేఖలు వ్రాశారు. ప్రధానమంత్రులు ఆర్థికమంత్రులను వెంటతీసుకొని వస్తే బాగుంటుందని ఆయన సూచించారు. ఐరోపా సమష్టివిపణితో బ్రిటన్ జరిపే సంప్రదింపులసందర్భంలో సలహా వ్యవస్థ విషయమై సూచనలు చేయవలసిందని కూడా కోరారు. ఇటీవల ఆస్ట్రేలియా పంపినట్లు మంత్రులను పంపదలచారో, లేక కెనడామాదిరిగా బ్రిటిష్‌మంత్రి ఒకరు తమను కలుసుకుంటే బాగుండుననుకుంటున్నారో తెల్పవలసిందని కామన్వెల్తు దేశాలకు బ్రిటిష్‌ప్రధాని సూచించారు.

*　　*　　*

గత పన్నెండు మాసాలలో పరిశ్రమల స్థాపనకు లైసెన్సులుపొంది, ఇంతవరకు ఆ పరిశ్రమల ఏర్పాటుకు ఏవిధమైన చర్యలు తీసుకొని వారికి కేంద్రప్రభుత్వం "సంజాయిషీ" తాఖీదులు జారీచేసింది. పరిశ్రమలు నెలకొల్పగల సామర్థ్యముగాని, ఆసక్తిగాని లేనివా రెందరో లైసెన్సులు సంపాదించారని తెలుస్తున్నది. ఈవిధంగా వీరు నిసలైన పారిశ్రామికవేత్తలకు లైసెన్సులు లభించకుండా ఆటంకాలు కలిగించారు. ప్రభుత్వం ఇప్పుడు జారీచేసిన తాఖీదులవల్ల లైసెన్సులు పొందినవారు పరిశ్రమలను స్థాపించాలి. లేదా ఆ లైసెన్సులను వదులుకోవాలి. ఇది తేలితే ప్రభుత్వము ఇతర దరఖాస్తులు పరిశీలించే వీలు ఉంటుంది.



శ్రీ సి. సుబ్రహ్మణ్యం

*　　*　　*

బొంబాయి సమీపంలోని తారాపూర్‌వద్ద అణు విద్యుత్ కేంద్రం నెలకొల్పేందుకు కాంట్రాక్టు సంపాదించడానికాకి ఫ్రాన్సు, అమెరికాలు పోటాపోటీలు పడుతున్నాయి. ఇది 300 ఎం. వి. విద్యుచ్ఛక్తి తయారుచేయగలదనీ, 1966 నాటికి పని ప్రారంభిస్తుందనీ ఆశిస్తున్నారు. ఈ పథకం అమలుకు రు. 51 కోట్లు ఖర్చు చేయవలసి ఉంటుందని అంచనా.

ఇంతవరకూ ఈ విద్యుత్ కేంద్రం నిర్మాణ

67—వ పేజీ చూడండి



శ్రీ బి. గోపాలరెడ్డి



శ్రీ జగ్జీవన్‌రామ్



శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి



శ్రీ కె. సి. రెడ్డి



శ్రీ కె. డి. మాలవియా



శ్రీ వి. కె. కృష్ణమీనన్

# సినీవిహారం

మధుమూర్తి

## ముద్దులకూతురి అగచాట్లు

ఏరి కోరి ఒక అబ్బాయిని, తన కూతురు కూడా ఏరి కోరుకొన్న ఆ అబ్బాయిని ఇచ్చి పెళ్లి చేసింది సరోజకు స్వంత తల్లి గుండమ్మ. తీరా పెళ్లయాక ఆ అబ్బాయి అసలబ్బాయి కాదనీ, దొంగ అనీ త్రాగుబోతు అని తేలిపోయే సరికి గుండమ్మకి రోగం కుదిరింది. ఐనా మూడుముళ్ళూ పడితేనేం, కూతుర్నీ అల్లుణ్ణీ దూరదూరంగా ఉంచేద్దామని నిర్ణయించిన ఆ మహాతల్లి గుండమ్మకే పాఠం కూతురిచేత చెప్పించాలని ఆ అల్లుడు పథకం వేశాడు. విజయుడయాడు.

సరోజ, రాజాలు మూటా ముల్లె వంకన

—49 వ పేజీ చూడండి



• గుండమ్మకథలో కార్య కాంతం, విజయలక్ష్మి, హరనాథ్.

హిందీతార మినుముంతాజ్

# హరివంశము

హారీత శివశర్మ

## సాందీపనిపర్వం - 55

రాజునకు నిజంగా కోపమువచ్చినదా! బ్రాహ్మణులు వచ్చి చెప్పిన మాటలు విని ఆయన గల్లన నవ్వెను. "ఏమనినారు! ఆచార్యమహానందులు కడజాతివానినుండి దానమును పరిగ్రహించిరా! అదియును బంగారమా? బాగున్నది. ఈ ఉదంతమును సుదక్షిణ వినవలయును." అనినాడు.

రాజు యీవైఖరి బ్రాహ్మణులకు నచ్చలేదు. వారి దృష్టి యందు ఇప్పుడు మహానందుని ఈ చెయ్దవలన ధర్మమునకు తీరని అపచారము జరిగినది. రాజు దానిని చాలతేలికచేసి చూచుట వారికి కష్టమనిపించినది. ఆయనకు మహానందుని చేసిన ఈ పనివలన ధర్మవ్యత్యయము కల్గుచున్న దన్నభావమే కల్గినట్లు అనిపించుచున్నట్లులేదు. మరి ఈరాజు క్రొత్తవాడు. పూర్వపురాజువలెకాదు. వారు ఒకరిముఖములు ఒకరు చూచుకొనిరి. చూపులతో మాట్లాడుకొనిరి. అప్పుడు రాజుతో మరల నిట్లు విన్నవించుకొనిరి.

"మహారాజ! మహానందుని ఈ కార్యమువలన వర్ణాశ్రమధర్మమునకు అపచారము జరిగిపోయినది. తాము చూచుచు యూరకున్నచో ఇక ధర్మమెక్కడ నిలుచును. అయినను కాల మట్టులున్నది. ద్వాపరములో కలి ప్రవేశించినది గాక! కానిచో నిట్టి పనులు జరుగుటను చూచినామ! మహారాజ! తమరీ ధర్మవ్యత్యయము నరికట్టవలయును, లేనిచో సర్వము సంకరమై పోవును."

మహారాజు తన కూరుచుండిన ఆసనముపై నుండి లేచినాడు. బ్రాహ్మణులును లేవబోయిరి గాని, ఆయన వారి కూర్చుండ మనినాడు. వారు అట్టులనే కూరుచుండినారు. రాజు అటు, ఇటుగా తిరుగుచు ఆలోచనాధీను డైనట్టు లుండెను. బ్రాహ్మణులు ఆయన ఎటు తిరిగిన అటుగా తమ ముఖములను త్రిప్పుచు, ఆయన ఏమి చెప్పునా అని వేచియుండిరి. రాజు చాలసేపటికి వరకు మాటలాడలేదు. మాటలాడు వేళకు బ్రాహ్మణుల దిక్కై ఇట్లు లనినాడు. "తమకు అన్నియు తెలియును. ఆచార్య మహానందులు మాకు గురువులు. ఆయనను మీరు అకర్మిష్ఠి యని, అధార్మికుడని, వర్ణాశ్రమధర్మములను పాటించని వాడని అనుచున్నారు. అవి పొడుగు మాటలు. మేము వారిని బాగుగా నెరుగుదుము అట్టివారు ఇప్పుడీ పని చేసినారనగా మరియొక్కరు నమ్మరు. మేము నమ్ముచున్నాము. ఆయన అట్టివారు. ఇప్పుడు మీరు మమ్ములను ఏమి చేయమందురు. మహానందులను శిక్షించమందురా? ఒక్క విషయమును మీరు గమనించుట లేదు. ఆచార్య మహానందులు నాకు గురువులు గదా! ఆయనకు గురుదక్షిణము మేము ఈయలేక పోయినాము. ఆయన తిరస్కరించినారు. ఇప్పుడీ బెడదను తెచ్చిపెట్టినారు. మేము ఆలోచించుకొనవలయును. తరువాత నీ విషయమును మాటలాడుదము."

బ్రాహ్మణు లేమియు ననలేదు. పౌండ్రక మహారాజు వారి నచ్చట వదిలి అంతఃపురములకు పోయెను. ఆయనకు ఇదియే విచిత్ర మనిపించినది. తాను బంగార మిత్తునన్న ఆచార్య మహానందులు వద్దనినారు. ఇప్పుడు కడజాతివాని వద్ద దానమును పట్టినారు. ఆయనకీ చిక్కు విడలేదు. ఈ విషయము సుదక్షిణతో మాటాడవలయును. ఆచార్యమహానందుల ఈ వృత్తాంతమును గురించి ఆలోచించిన కొలదియు నాయనకు నవ్వు వచ్చుచుండెను. ఆయన అట్లు తనలో తాను నవ్వుకొనుచునే సుదక్షిణ మందిరములలో ప్రవేశించెను. దాసీజనము లెక్కడివా రక్కడ సర్దుమణిగిరి. సుదక్షిణ కొన్ని భూర్జ పత్రములను ముందు వేసికొని నేమియో పఠించుచుండెను. ఆ మహారాజు రాగా, ఆమె తలఎత్తి చూచి, నిలబడెను.

"నీవు నిలబడుట దేనికి! కూర్చుండుము. కూర్చుండుము. నీతో ఒక్క విషయము మాట్లాడుదమని వచ్చినాను" అనినాడు పౌండ్రకుడు.

"నాతోనా! అట్టి ఆచారమును ఎప్పుడు ప్రారంభించినారు." అన్నది సుదక్షిణ.

పౌండ్రకుడు బిగ్గరగా నవ్వినాడు. ఇట్లు అన్నాడు.

"సుదక్షిణ! ఇప్పు డొక ధర్మసంకట మేర్పడినది. ఆచార్య మహానందు లొకపని చేసినారు. మణికర్ణికవద్ద ఒక్క కడజాతివాని నుండి రాసుల కొలది బంగారమును దానముగా పరిగ్రహించినారు. అవును. నీవు ఆశ్చర్య పోవుచున్నావు. నిజమే. కాని ఆ పని చేయగా చూచి వచ్చిన బ్రాహ్మణులు ఆ విషయమై నాతో విన్నవించుకొనుటయే గాక, ఆచార్యమహానందులపై అభియోగమును గూడ తెచ్చినారు. ఇప్పుడు నేనేమి చేయవలయునో నాకు తోచుటలేదు."

సుదక్షిణ ముందు అప్రతిభురాలైనది. తరువాత నవ్వినది. పౌండ్రకునకు, మహారాజునకు, అది యేమో అర్థము కాలేదు. ఆయన ప్రశ్నార్థకముగా నామెవంక చూచెను. "ఏమని" ప్రశ్నించెను.

"స్వామి! ఆయన సర్వధర్మములను వదలినట్లున్నది.

"ఇది క్రొత్తగా నున్నది."

"ఆచార్య మహానందులు క్రొత్తవారే!"

"మరి ఆ యాదవుడో?"

సుదక్షిణ పౌండ్రకుని వంక చురుక్కున చూచినది. ఇట్లు అన్నది.

"స్వామి! ఆ యాదవుడు భగవంతుడు వాసుదేవుడు. తాము పౌండ్రకులు: పౌండ్రక వాసుదేవులు. ఇంక నాచేత ఏమి అనిపించ వలయునని మీకు ఉన్నది."

ఆమె ఆ మాట లన్నంతలో పౌండ్రకుని ముఖము మారిపోయినది. తాను రాజైనతరువాత గూడ ఈమె తన్ను తన్నుగా గుర్తించుటలేదు. తనయందు భక్తి చేయుటలేదు. యాదవుడైన వాసుదేవుని వాసుదేవు డనుచున్నది. తన్ను పౌండ్రక వాసుదేవు డనుచున్నది తన వాసుదేవత్వము నీమె గుర్తించుటలేదు. తన్ను భర్తగా చూచుచున్నదా! పౌండ్రకునకు ఆ ప్రశ్న తనక అట్టు లుదయించుటయే విచిత్ర మనిపించినది. ఆమె తనయందు యవజ్ఞ చేయుటలేదు. భర్తగా తన గౌరవమునకు భంగము కల్గనీయుటలేదు.. మరి భర్త దైవము కదా స్త్రీలకు. ఈమె తన్ను అట్లు చూచు

—56వ పేజీ చూడండి

# సరాగమాల

వి ఎ కె రంగారావు

హెచ్. ఎమ్. వి. రికార్డింగ్ స్టుడియో సౌండ్ ఎంజినీర్ ఎస్. కె. సెన్ కంపెనీ పనిమీద కలకత్తాకువెళ్ళి, ఇటీవలనే తిరిగివచ్చారు. వారు అక్కడ ఉన్నప్పుడు జరిగివుండవలసిన పాటల రికార్డింగు లన్నీ ఈమధ్యనే ఒక్కుమ్మడిగా చేశారు. అందులో ముఖ్యమైనవి:—

"నాలోని ఆశలన్నీ నీకోసమేనో"యనే వడ్డాది రచనను కె. రాణి, రవిప్రసాద్ యుగళగీతంగా పాడారు. దీనికిరెండవ ప్రక్కకోసం ఉషశ్రీ (ఎ. వేణుగోపాల్) సాహిత్యం "హాయి చల్లని వెన్నెల్లో" పాటను కె. రాణి పాడారు. ఈ రికార్డు మే మొదటి వారంలో విడుదలౌతుంది.

ఇప్పుడే పైకివస్తున్న సంగీతదర్శకుడు బి. గోపాలం (అప్పట్లో నలదమయంతి, ఇప్పట్లో అతకని బ్రతుకులు) కె. రాణి కలిసి వడ్డాది సాహిత్యమైన మరొకపాట "చల్లగాలిలో" అన్నది పాడారు. పిఠాపురం నాగేశ్వరరావు పాడిన ఉషశ్రీ రచన "ఓహో వన్నెల చిన్నారి" అన్నది దీని రెండవ ప్రక్క. ఈ రెండు పాటలు మే నెలాఖరుకంతా సిద్ధమౌతాయి.

పై నాలుగు పాటలకు వాద్యానుసరణ సమకూర్చింది టి. ఎ. కల్యాణం. అంటే శ్రీశైల మహాత్యానికి (మాతృకయైన కన్నడ చిత్రానికి) సంగీత దర్శకులు.

ఎర్రమాకుల ఆదిశేషారెడ్డి (భాగ్యరేఖలో "లోకం గమ్మత్తురా", గాలిమేడలులో "ఈలపాట పాడుకుంటు యేలపదా లేనుకుంటు" పాటల కర్త) రచించిన పొట్టి శ్రీరాముల సంస్మరణ పద్యాలు బి. గోపాలం పాడగా రికార్డు చేశారు. ఇంతకుముందే వీరు పాడిన మరికొన్ని పద్యాలతో వీటిని జతపరచి, త్వరలోనే విడుదలచేస్తారు.

పైవన్నీ హెచ్. ఎమ్. వి. విడుదలలు. రికార్డింగ్ డి. మంగపతి పర్యవేక్షణలో జరిగింది.

ఇంతకు కొద్దిరోజులముందు పి. ఎస్. రామచంద్రరావు, పి. సుశీల పాడిన భక్తి ద్వైతగీతాలు, కొలంబియావారికోసం రికార్డు కాబడినవి. వీటిని వ్రాసింది వీటూరి. సంగీతం పి. నిత్యానంద్ (మగవారి మాయలు, జన్మహక్కు) పర్యవేక్షణ కన్నన్. విడుదల పై నెల. వీటిలో ఒకటైన "జయ జయ సటరాజా" అన్నది శాస్త్రీయధోరణిలో యమన్ కల్యాణి రాగంలో వుంది.

ఇక ఈ వారపు స్వరసమీక్ష:

జి. ఇ. 35261 తెలుగు.

స్వర్ణగౌరి చిత్రంలో మూడు రికార్డులు కొలంబియాలో విడుదలైనవి. ఆ ఆరు పాటలూ చక్కగా వున్నా, పై రెండు పాటలూ మరింత చక్కగా వున్నాయి. "రావే నా చెలియా"లో "రాగ భోగాల మోహినివి, సరస శృంగార వాహిని" వంటూ మనస్సు నలరించే శ్రీనివాస్ కంఠం "సుధా తుషార వర్షా విమలావకుంఠనము జార్చుచుబోవు శరద్విభావరీదేవి లలాటికా మణి" యేమోనను భ్రమకలిగించేంత ఆహ్లాదకరంగా వుంది. వాద్యాను సరణలో మురిసే వేణువులు, మొరిసే సితారులు, మెరిసే తారల్లా, విరిసే పువ్వుల్లా, మనస్సును వశపర్చుకుంటాయి. సుశీల శ్రీనివాస్ పాడిన "రసమయ జీవన"లో వినవచ్చే "రాగవైభవ లీల" పాటకు సంగీతానికేకాక, ముఖ్యంగా సుశీల కంఠానికి వర్తిస్తుంది. రెండు పాటల సాహిత్యం వీటూరిది. వాటిలో కన్నడపు కమ్మదనం, యే కారణంచేతనోగాని, వుంది. వీరి పేరు మొదట నాకు తెలియటం రేఖా అండ్ మురళి ఆర్ట్స్ వారి "శాంతి నివాసం" నాటకానికి వీరు వ్రాసిన ("నీ రాగమే తన ఆలాపన, నీ రాకకే తన ఆవేదన") తేనెల సోనలు స్వరస్వర్గానికి సోపానాలు అయిన పాటల ద్వారా. స్వర్ణగౌరికి సంగీతం ఎమ్. వెంకట్రాజు. ఇంతకు ముందు రాజా సత్యవ్రత, భక్త కనకదాస కన్నడ చిత్రాలకు పని చేశారు. ఈ పై పాటలే,కరీంఖాన్ సాహిత్యం, కన్నడంలో ఉన్నవి. నంబరు జి. ఇ. 36582.

రంగోలి ఎమ్. 53999 హిందీ.

గత రెండు మూడేళ్లలో శంకర్ జైకిషన్లువారి సంగీతంలో లాలిత్యానికన్నా లయకే ప్రాధాన్యతనిచ్చి శబ్దంతోనే విలయతాండవం చేస్తున్నారు. అయినా సినిమా కొకటి రెండూ మంచిపాట లుండటం కద్దు. వాళ్ల సరికొత్త చిత్రం రంగోలిలో వింటానికి కొత్తగా, మెత్తగా వున్న పాట "హమ్ తుమ్ యే ఖోయీ ఖోయీ రాహే" పాడినది ముకేష్ లత. ముకేష్ ముతక ఖద్దరుమీద లత అద్దాల ముగ్గులు. ముడిపట్టుమీద ముత్యాల పోగులు. మాండోలిన్ తంత్రుల మనోహర నృత్యాలు, ట్రంపెట్ సోలో సంపుల సొంపులు కలసిన సంగీతానుసరణ హాయిగా వుంది. రెండవప్రక్కనున్న "రంగోలి సజావోరే" ఎప్పుడూ కిషోర్‌పాడే పాటలలాగా అల్లరి చిల్లరిగా లేదు. సారంగుల తురుగాలమీద తేలికగా పయనించాడు కిషోర్. రెండు పాటల సాహిత్యం యేమంత చెప్పుకోదగ్గదిగా లేదు.

హెచ్. ఎల్. పి. 9466 పాశ్చాత్య సంగీతం.

పాశ్చాత్యసంగీతంలో కోకొల్లలైన రకాలు. అందులో పాటలేక లయకే ప్రాముఖ్యతనిచ్చి చేయబడిన వాద్యగోష్ఠు లివి రెండు. డ్రమ్స్ వాయించే వాళ్ళలో సాండీ నెల్సన్ పేరుపొందినవారు. "క్వైట్ యె బీట్" అన్న దాంట్లో 'బాగ్' డ్రమ్సు, బిట్రాంబోన్ చక్కగా కలిపారు. రెండవప్రక్క "లెట్ దేర్ బి డ్రమ్స్." ఇందులో కూడ "పెర్కుసిన్" సామర్థ్యానికే ప్రాముఖ్యత. ఇవి రెండు వింటుంటే గుండెలు అదొక విధంగా స్పందిస్తాయి. ఆటవిక జాతుల మంత్రతంత్రాలలో ఇటువంటి వాద్యాలకు చోటుండడం, ఈ కారణంచేతనే అనుకుంటాను. ★

ఒక నగలదుకాణంలో మూడు సార్లు దొంగలు పడ్డారు. దుకాణం యజమాని పోలీసులకు ఫిర్యాదు చేసినా లాభం లేకపోయింది. ఈ మారు ఏమైనా సరే, తనే దొంగని పట్టుకోవాలని నిర్ణయించుకున్నాడు. దుకాణంలో ఒకమూల కెమెరా సిద్ధంగా పెట్టించి, దాని దగ్గరగా కొన్ని నకిలీ నగలు ఉంచాడు. నగల కోసం వచ్చి దొంగ ఫొటో దొరికి అతణ్ణి పట్టుకోటం తేలికని అతడి ఊహ. ఆ రాత్రి దొంగ రానే వచ్చాడు. మర్నాడుచూస్తే నకిలీ నగలు అక్కడే ఉన్నాయి. కాని కెమారా మాత్రం మాయమైంది.

బి. వేణునాథం (కారంచేడు)




(గతసంచిక తరువాయి)

లీలా తండ్రి రైల్వేలో పనిచేసి రిటైరయ్యాడు. ఆయనకు ముగ్గురు ఆడపిల్లలు వున్నారు. అతను అనారోగ్యంవల్ల బయటికి ఎక్కడికీ కదలలేడు. రిటైరయినప్పుడు వచ్చిన డబ్బుతో ఒక్కయిల్లు మాత్రం కట్టాడు. ఆ యింట్లో, ముందర గదిని ఎవరైనా మర్యాదస్తులకు అద్దెకిస్తూండేవారు.

రవీంద్రనాథ్‌ను తన తండ్రికి లీల పరిచయం చేసింది. లీల తండ్రి విశ్వనాథంగారు అతనిగురించి వివరాలన్నీ అడిగారు. అతని తండ్రియైన రామకృష్ణగారిగురించి కొందరు మిత్రుల ద్వారా తను విన్నానని చెప్పారు. రాయల్ పెయింట్స్ కంపెనీలో ఉద్యోగము అతనికి దొరికిందని చాలా సంతోషించారు. రూము చూపించి అద్దె, మొదలైన వివరాలు చెప్పి, రవీంద్రనాథ్‌ను మరునాడే వచ్చి రూములో ప్రవేశించమని చెప్పారు, విశ్వనాథంగారు.

ఆయన చెప్పినట్లే రవీంద్రనాథ్ మరునాడే ఆ రూములో ప్రవేశించాడు. విశ్వనాథంగారి కుటుంబమంతా అతన్ని చాలా ఆత్మీయతతో చూస్తూండడంవల్ల, అతని కెంతో ఆనందమైంది.

ఉద్యోగంలో ప్రవేశించిన వారం రోజుల వరకూ ఆఫీసులోనే పనిచేసి, పెయింట్సు ఎలా అమ్మాలో, ఆర్డర్సు ఏవిధంగా 'బుక్' చెయ్యాలో, ఏ యే వ్యాపారస్థుల్ని కలుసుకోవాలో, వారితో ఏవిధంగా మాట్లాడాలో మొదలైన విషయాల్ని నేర్చుకున్నాడు రవీంద్రనాథ్.

లీలకి ఉద్యోగం చేస్తుండడంవల్ల కొంత స్వేచ్ఛా ప్రవర్తన అలవడింది. మగవారితో కలిసి మెలిసి సమానంగా తిరుగగలదు. ఆమె ప్రవర్తనను ఇంట్లో వారెవరూ ప్రశ్నించరు. కాని ఆమే స్వయం శిక్షణతో మెలుగుతుంది. ఆఫీసులోగాని, బయటగాని మగవారితో చనువుగా మాట్లాడుతుంది. మళ్లీ తగినంత దూరంలో వారినుంచుతుంది. సత్యమూర్తి మొదట్లో ఆమె చనువుగా మెసలడాన్ని అపార్థం చేసుకుని ప్రవర్తించబోయాడు. కాని ఆమె స్పష్టంగా తా నటువంటి స్త్రీని కానని, అవసరమైతే వుద్యోగానికి రాజీనామా ఇస్తానని చెప్పింది. అప్పటి నుంచీ ఆమె జోలి కెవరూ పోరు.

నిజానికి స్త్రీ గాని, పురుషుడుగాని చూసిన వారందరివల్లా ఆకర్షింపబడరు. అనేక మందిని చూడగా చూడగా ఏ ఒక్క వ్యక్తిలోనో కొన్ని ప్రత్యేకతలు కన్పించి, వారియందే వ్యక్తికి ఆకర్షణ కలుగుతుంది. అది క్రమేణా అభివృద్ధి చెందుతుంది. మగవారితో చనువుగా తిరుగుతూ, వారి నడుమలో పెట్టగలిగిందంటే, లీలను మగవాళ్లందరిలోనూ ఏ ఒక్కడూ ఆకర్షించలేకపోవడమే కారణం. ఆమె మనస్సును కదల్చగల శక్తి వారిలో లేదు. అది ప్రయత్న పూర్వకంగా అలవడేదికాదు. స్వతఃసిద్ధంగా వ్యక్తిలో వుండాలి. కొందరు పురుషులు ఆమె ననేక విధాల ఆకర్షించాలని ప్రయత్నించారు. ఆమెముందు తమ గొప్పలను అనేక విధాలుగా ప్రదర్శించారు. ఆమె వెళ్లిన చోటికెల్లా ఆమె ననుసరించి ఆమె నెలాగయినా చనువు చేసుకోవాలని చూశారు. డాబైన దుస్తులు వేసుకొని ఆమె ముందు తిరిగారు. ఆమెకు ప్రేమ లేఖలు వ్రాశారు. ఆమెకోసం ఎంత డబ్బైనా ఖర్చు పెడ్తామన్నారు. చివరికి బెదిరించి, అల్లరిచేసి లొంగ దీద్దామని

—45వ పేజీ చూడండి

## శ్రీమతి కప్పగంతుల పద్మావతి శర్మ.

వేము ఈ ఊరువచ్చి దగ్గర దగ్గర రెండు సంవత్సరాలవుతోంది. ఈ ఊరు రాకపూర్వం మావారు గరివిడిలో పనిచేసేవారు. ఆయన జీతం మా కుటుంబానికి (ఆరుగురం) సాధారణంగా సరిపోయేది. ఎప్పుడైనా చుట్టం, పక్కం, వచ్చినప్పుడు మాత్రం అప్పుచేయాల్సి వచ్చేది. ఎలా అయినా మాకు ఆ ఊళ్లో బాగానే గడిచిపోయేది.

రెండువందల యాభై రూపాయల జీతం మీద ఈ ఊళ్లో ఉద్యోగం దొరకడంవల్ల ఈ ఊరికి వచ్చేశాము. ఇక్కడికి వచ్చేముందు రెండు వందల యాభై దొరుకుతాయి. నెలకి ఎలా లేదన్నా ఏభై రూపాయలైనా మిగల్చలేకపోతానా" అనుకున్నాను. మేమువచ్చిన మర్నాడే మావారికి జీతం అందింది. "జాగ్రత్తగా ఖర్చుచెయ్యి. అప్పు చెయ్యకుండా కాలక్షేపం చెయ్యాలి. ఇక్కడ నాకు అప్పిచ్చేంత పరిచయస్తులు కూడా లేరు" అన్నారు. బాగుందండి నూటయాభై తెచ్చినా అప్పే, రెండువందల యాభై తెచ్చినా అప్పే. చూడండి ఈనెల కనీసం ముప్ఫై మిగులుస్తా" అన్నాను. ఓహో—ఈ ఊళ్లో ఈ జీతంమీద నువ్వు పొదుపు కూడా ప్రారంభిస్తావేంటి" అన్నారు నవ్వుతూ.

మేము డిశంబరునెల్లో వెళ్లాము. అంచేత చలి విపరీతంగా ఉండేది. పిల్లలకి ఉలెన్ బట్టలు తీసుకుందామని ఆ సాయంకాలం బజారుకి వెళ్లాను. పర్సులో ఏభై వేసుకొని వెళ్లాను. అయిదుతో తిరిగి వచ్చేను. రెండు ఉలెన్ స్వెట్టర్లు (చిన్నవి) 'కాటను' వే రెండు జతల మేజోళ్ళు, రెండు ప్రింటెడ్ చీరెలు, పిల్లలకు గాజులు, రిబ్బన్లు తీసుకున్నాను. వస్తువులు కనపడలేదు కానీ డబ్బు మాత్రం 40 రూపాయలకు పైగా ఖర్చయిపోయింది. ఏ వస్తువు కొందామని తీసి ధర అడిగినా మా ఊరు ధరకి రెట్టింపు చెప్పేవారు. ఇంక భయంవేసి బజారంతా తిరిగి తిరిగి రాత్రి ఎనిమిదిగంటలకి ఇల్లు చేరుకున్నాను. రాగానే మావారు "ఏం కొన్నా" వని అడిగేరు. చూపించేను. "బాగా బుట్టలో పడ్డావు. కాటను కూడా ఇంత ఖరీదేమిటి ? అనవసరంగా డబ్బు పాడుచేశావుకదా ఈ నెలంతా ఎలా గడుస్తుంది చెప్పు" అన్నారు. ఫరవాలేదండీ ఇంకా మిగిలినది ఉందిగా సరిపోతుంది—" అన్నా

ఆ మర్నాడే మావారు కొంతడబ్బు తీసుకుని నెలసరి సామాన్లు తేవడాన్కి బజారుకి వెళ్లి రిక్షా కిచ్చేందుక్కూడా డబ్బుల్లేకుండా తిరిగి వచ్చేరు. "ఏమండీ అంతడబ్బు పట్టుకెళ్లేరు. రిక్షా కిచ్చేందుక్కూడా మిగల్లేదా ?" అన్నాను. "ఏం చెయ్యమన్నావు, నువ్వు రాసిన సామాన్లలో ఇంకా కొన్ని తేనేలేదు అయినా డబ్బు చాలింది కాదు. మన ఊర్లోలా అనుకున్నావా ? ఇక్కడ అన్నీ ప్రియమే" అన్నారు.

అతను తెచ్చిన బిల్లు తీసుకుని వాటి ఖరీదులు చూసేసరికి కళ్ళు తిరిగేయి. ప్రతి వస్తువు మీదా అక్కడికీ ఇక్కడికి నాలుగైదు అణాల వ్యత్యాసం ఉంటుంది. పప్పులుకూడా మూడు నాలుగు అణాలు ఎక్కువగానే ఉంటాయి. ఇంక సబ్బులు, పౌడర్లు, స్నోలు వీటి సంగతి చెప్పనే అక్కరలేదు. ఆఖరికి పాలసీసా కడుక్కునే 'బ్రష్' కూడా ఆరణాలకి తక్కువకు దొరకదు. ప్రతి వస్తువుమీద ఇలా నాలుగయిదు అణాలు ఎక్కువ చొప్పున చూసుకుంటే నెలసరి సామాన్లలో పాతికరూపాయల వరకూ నష్టం వస్తుంది. పిల్లలుగలవాళ్లకి ఆ డబ్బుంటే మరేఖర్చుకన్నా పనికొస్తుంది. ఇంక తూకం సంగతి, బజార్లో వాళ్ళు తూచినప్పుడు మనకి బాగానే ఉందనిపిస్తుంది. ఇంటికి వచ్చి డబ్బాలో పోసుకుంటే సేరు పప్పుకి కనీసం పిడికెడు పప్పైనా తక్కువ ఉంటుంది. ధరలు కూడా ఒకర్ని మించి మరియొకరు పెంచి చెప్తుంటారు. ధరలు ఒక నియమంలో వుండవు.

పాలు రూపాయికి అయిదుసోవులు చొప్పున అమ్ముతారు. మనవైపు అర్ధసోవు ఇక్కడ సోవన్న మాట. ఏడు ఎనమండుగురు ఉన్న కుటుంబానికి కనీసం రెండు శేర్లన్నా పాలుంటేగానీ చాలవు. నెలకి నలభై అయిపోతుంది. చాలామంది పిండి పాలు కలిపేసి అమ్మేస్తూంటారు. మంచిపాలు దొరకడం కష్టం. ఎంత డబ్బు ఇస్తామన్నా ఇంటికి ఆవునుతెచ్చి పితకరు.

బట్టల ఖరీదులు కూడా ఇలాగే ఉంటాయి. మల్లుమీద ప్రింటున్న చీరలు కూడా ఎనిమిది తొమ్మిది రూపాయిలకు తక్కువ వుండవు. ఒక్కరేవు వేసేసరికి రంగులుపోయి జాడలు పడిపోతాయి. రూర్కేలా స్టేషనుదగ్గర ఒక బజారుంది. అక్కడ ఏవైనా కొంచం తక్కువ ధరకి దొరుకుతాయి. అక్కడనుండి లోపల బజార్లలోకి వచ్చేసరికి ప్రతీ వస్తువుమీద నాలుగయిదు అణాలు వేసేస్తారు. నాసిరకం గామంచా కూడా రూపాయిన్నర ఇస్తేగానీ బజారులో దొరకదు. అదే స్టేషను దగ్గర బజారులో అయితే పధ్నాలుగు అణాలకో రూపాయికో ఇచ్చేస్తారు. పోనీ అక్కడే కొనుక్కుందామంటే వెళ్లి రాడాన్కి బస్సుకి ఓపది అణాలు అయిపోతాయి. పైగా ఓ రెండు గంటలు శ్రమ. ఈ కారణంవల్లే చాలామంది ఊరిలో బజార్లలోనే అన్నీ కొనుక్కుంటారు. మనం బట్ట లూస్‌గా కొనుక్కుంటే నష్టం. దానికి కుట్టుకూలి రెట్టింపు పొయ్యాలి. ఇంత చేసినా టైలర్లు సరిగ్గా మనం యిచ్చిన అది ప్రకారం కుట్టరు. వాళ్లిష్టం వచ్చినట్టు కుట్టేసి పాడు చేస్తారు. ఈ బాధలన్నీ పడేకన్నా 'రెడీమేడ్' వి కొనుక్కోడం మంచిది.

చాకలివాళ్లు కూడా మనవైపులా రేవులెక్కన ఉతకరు. పెద్ద బట్టలకి రెండు అణాల చొప్పున, చిన్నవాటికి ఒక అణా చొప్పున ఉతుకుతారు. ప్రతీ ఇంట్లోను సాధారణంగా పిల్లలు చాలాబట్టలు మార్పుతారు రోజు మనం ఉతికినా, చాకలివాడు వచ్చేనాటికి మళ్లా పాతిక బట్టలు తయారవుతాయి. అందుచేత చాకలివాడికి ఎలా లేదన్నా పది లేక పదిహేను అయిపోతుంది.

ఇంక అన్నింటికన్నా ముఖ్యం కూరలు. మనకి తెల్లారి లేస్తే కూరలేకపోతే వంటే జరగదు. మనవైపు కూరలబజారుకి వెళ్తే చూడముచ్చటగా ఉంటుంది. ఆరు అణాలు పట్టుకువెళ్తే ఆపూట కూర, ఇంకా పచ్చిమిరపకాయలు, అల్లం, కరివేపాకు కూడా తెచ్చుకోవచ్చు. ఇక్కడ రోజుకి అతి స్వల్పంతో చూసుకుంటే రూపాయి లేక పధ్నాలుగణాలు అవుతుంది. వాడిపోయినవి, కుళ్లిపోయినవి అన్నీ కలిపేసి దాగర్లలో పోసి పెడ్తారు. ఖరీదు మాత్రం ఎలాటిదైనా ఎనిమిఅణాలకు తక్కువ వుండదు. ఆనపకాయలు, (బొప్పాసకాయలు), గుమ్మడి చెగుళ్ళు, ఆనప చిగుళ్ళు కూడా అమ్ముతారు. అవి కూడా ఆరు అణాలకి తక్కువ ఉండవు. అప్పుడప్పుడు బంగ్లీవాళ్ళు వీధుల్లోకి కూరలు అవీ తెచ్చి అమ్ముతుంటారు. వీళ్లదగ్గర కొంత చవగ్గా దొరుకుతాయి. వేసవికాలంలో కూరలు మరీ ప్రియంగా వుంటాయి. కుటుంబం పెద్దదైనప్పుడు కూరలకే రోజుకి రూపాయిన్నర అయిపోతుంది. ఇక్కడ వాళ్లకి (ముఖ్యంగా ఒరియావాళ్ళు, బెంగాలీవాళ్ళు) మనలాగ కూరలు అంతగా అక్కరలేదు. మనం కూరలు అన్నంలో కలుపుకుని తింటాం. వాళ్ళు అన్నం తింటూ, కూర నంజుకుంటారు. అంచేత వాళ్ళకి ఎంతపెద్ద కుటుంబమైనా కొంచెం కూర వుంటే చాలు. మనలాగ పచ్చళ్ళు పులుసులు అంతగా తినరు. అందువల్లే తక్కువజీతం అయినా ఒక కుటుంబం సునాయసంగా బతికేస్తారు. కష్టపడి పెరళ్లలో కూరగాయలు పండించుకుంటారు.

ఈ ఊరు వచ్చాక మధ్యతరగతి కుటుంబాలు సరదా అన్నీ మరచిపోవాలి. ఎప్పుడైనా చికాకుగావుండి, సినీమాకు వెళ్దామంటే పదిరూపాయలు పట్టుకుంటేగానీ, ఒక కుటుంబం వెళ్ళిరావడం కాదు. రిక్షాలకే చాలా అయిపోతుంది. మనవైపు ఆరు, ఎనిమిది అణాలకే రిక్షాలు కట్టేస్తారు. ఇక్కడ పన్నెండు అణాలకి తక్కువ కట్టరు. అసలు వాళ్లతో మాట్లాడలేము. వాళ్ళు ఎంతంటే అంతే! కాని తగ్గరు. ముఖ్యంగా ఈ ఇబ్బందు లన్నిటికీ కారణం ఇక్కడ జర్మన్లు ఎక్కువగా వుండడం. వాళ్లకి స్వల్పంగా చూసుకుంటే కళాసీకి రోజుకి నలభై ఇస్తారట. వాళ్ళు ఆ డబ్బు కూడబెట్టుకుని, వాళ్ల దేశం పట్టుకెళ్ళకూడదు నూటికి మూడు మాత్రమే వాళ్ళు ఇక్కడనుండీ పట్టుకెళ్ళవచ్చు. అందువల్ల వాళ్లు చాలా తేలికగా ఖర్చు చేసేస్తారు. ఏ వస్తువులూ బేరంచెయ్యరు. ఎంతంటే అంతా ఇచ్చేస్తారు. వీళ్ళనిచూసి మనవాళ్ళుకూడా బేరంచెయ్యడం పరువుతక్కువగా భావిస్తారు. ఏ వస్తువైనా మనం బేరం చేస్తున్నప్పుడు అంతకు మరో అణాపో బేడో ఎక్కువచేసి మనం చూస్తుండగానే కొనేస్తారు. బేరం చేస్తున్నవాళ్ళు పీనాసివాళ్లయినట్టు తాము అణా బేడకి కక్కుర్తి పడనట్టు భావిస్తారు. ఇది చూసి వ్యాపారస్తులు ధరలు మరీ పెంచేస్తారు.









# వనితావాణి,
ఆంధ్రసచిత్రవారపత్రిక,
7, తంబుచెట్టివీధి,
మద్రాసు-1

## వి శ్రాంతి

విశ్రాంతి తీసుకోవటానికి ఎవరికి కుదురుతుంది? ఉమ్మడి కుటుంబాలలో ఇటువంటివి కష్టం అది గాక స్త్రీలకు గృహకృత్యాలలోనే ఒకవిధమైన ఆనందం విశ్రాంతి ఉంది ఒకరోజు పనిలేక కూర్చుంటే అదోలా ఉన్నట్టుంటుంది

ముఖ్యంగా పల్లెటూళ్లవైపువాళ్లకు విశ్రాంతి అంటే ఏమిటో తెలియనట్లే పనులు చేస్తారు మా బంధువుల ఇంటికి వెళ్ళినప్పుడు పని ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది సినిమాకు వెళదామంటే మా పిన్ని "మా మొహాలకు సినిమాలు కూడానా? ఈ ఇంటి పనులతో సతమతమవుతుంటే?" అంది నిరాశగా నిజంగా ఆలోచిస్తే స్త్రీలకు విశ్రాంతి అవసరమేకానీ, విశ్రాంతి అనేది పిల్లలులేనివారికిగానీ, పిల్లలు ఉన్నవారికి ఆ పిల్లలతోనే విశ్రాంతి

కుమారి అంబటి దేవకి, కుమారి రుద్రి రామామణి (అలహాబాదు)

* * *

ఆడవారికి కూడా "విశ్రాంతి" కావాలని అను కోరు కొందరు మగవారు భార్య పిల్లల్ని, ఏ సినిమాకో, షికారుకో తీసుకవెళ్తే "నామోషి" అనుకునే మగవారు ఉన్నారు డబ్బా సిగరెట్లయినా కర్చు పెడతారుగాని, భార్య సినిమాకు డబ్బు లడిగితే "ఎందుకు ఖర్చు" అనే మగవారూ ఉన్నారు అయితే ఈ రోజుల్లో షికార్లకూ, సినిమాలకూ వెళ్ళని దంపతులు లేరనుకోకండి! ఎటొచ్చి ఎప్పుడూ విశ్రాంతి లేక, వీధి ముఖమయినా చూడని స్త్రీల గురించి బాధ కలుగుతుంది

దోర్నాదుల రాజేశ్వరి (నెల్లూరు)

* * *

మావారిని ఎప్పుడైనా "ఏమీ తోచటములేదు సినిమాకేనా వెళ్దామురండి అంటే "రేపు" తప్పక వెళ్దాముతే అంటూ ఎప్పుడ తీసుకుపోయిన అవకాశము కలుగలేదు "విశాఖ"గారు వ్రాసిన హాస్యమును వారి చేత బలవంతముచేసి చదివించగా, వారు చదివిన తదుపరి కనీసము స్త్రీలకు కూడ "విశ్రాంతి" అవసరమేనంటూ, సినిమాకు వెంటనే బయలుదేరి వెళ్లాము ఇటువంటి వ్యాసమును వ్రాసి, నాకు ప్రతివారము 'విశ్రాంతి"ని కల్పించిన "విశాఖ" గారికి నా హృదయ పూర్వక అభినందనములు తెలియజేయుచున్నాను

శ్రీమతి పరాశరం విజయ రఘునాద్, (గుంటూరు)

* * *

డబ్బు ఖర్చుపెట్టి సినిమాలు నాటికి తీసుకు వెళ్ళలేకపోయినా, వారానికి ఒకసారిఅయినా షికారు తీసుకుని వెళ్లితే యిల్లాలు కష్టం మరచిపోయి ఎంతో ఆనందిస్తుంది

మంగు వెంకట వర్ప (బర్మ్మా)

* * *

కొందరు పురుషులు తమ భార్యలను వెనకేను కొని తీసుకెళ్ళరు సరేగదా ఎవరితోనైనా ఆమె ఎక్కడికైనా బయలుదేరినా వెళ్ళనీయరు మాకు తెలిసిన భార్యా, భర్త ఉన్నారు ఎల్లా పిచికాలేదు ఆవిడ ఈవూరికి యిది రెండో సారి రావడము ఐదు సంవత్సరములు పూర్తి అయిపోయినవి కాని, "కండ్ల" పోర్టు ఎలాంటిదో ఆమె యింకా చూడలేదంటే ఆమె భర్తను మెచ్చుకోవాలి ఆమెను వెంటతీసుకెళ్ళడానికి ఆయనకు సిగ్గట 'సరే ఎవరితోనన్నా బయలుదేరుతానంటే ఒకరితో వెళ్ళనీయడు కూడాను ఎందుకంటే త్రోవలో ఎవరైనా తోటి ఉద్యోగస్తులు చూస్తే, హేళన చేస్తారట తాను నెలకు నాలుగు సినిమాలు చూస్తాడుగాని, ఆమెను ఒకరోజు సినిమాకు తీసుకెళ్ళలేదుట ఆమెను చూస్తుంటే, హీనం జాలి వేస్తోంది నేను ఆమెకంటె చిన్నదానిని అయినా నాతో అన్నీ చెపుతూ ఉంటుంది

కుమారి కె. లక్ష్మీబాయ్ (కండ్ల)

* * *

ఆడవారికి విశ్రాంతి ఏమిటి అని అనేవారు చాలమంది వున్నారు మాకుతెలిసిన ఆయన ఒకరున్నారు ఆయన తన ఆయుస్సు తన ఆరోగ్యమేకాని, ఇతరుల సంగతి అక్కరలేదు భార్యను బయటికి రానివ్వరు సినిమా, షికారులంటే ఆడవారికివన్నీ ఎందుకు అంటారు తల్లి గుడిలోనికి పోవలెనన్నను, కొడుకుని అడగనిదే పోదు ఆ పసిపిల్లలను బయటికివెళ్ళి ఆడుకో నివ్వరు కాని తనుమటుకు వారానికి 3 సార్లు సినిమా, రాత్రి పదింటిదాకా షికార్లు కొట్టవచ్చు అదేమని ఎవ్వరడిగేందుకులేదు ఆయన మగ మహారాజు! ఆయనకేమి మా శ్రీవారు వున్నారు వారు సినిమాలు షికార్లు ఎందుకు హాయిగ కబుర్లు చెప్పుకుంటూ, మన యింట్లోనే వుందాము ఇల్లు విడిచి బయటికిపోతే లేనిపోని శ్రమ ఎందు కివన్నీ అంటారు. వారికి విశాఖగారు వ్రాసిన విశ్రాంతి చూపించి చదవమన్నాను వారు చదివి, ఆడవారికి ఏమి తోచక ఇలా వ్రాస్తూంటారు అని అన్నారు

వారణాశి అన్నపూర్ణ (ఒంగోలు)

## పెళ్లి అయితే

ఈకాలంలో అమ్మాయిలు కొంతమంది చదువుకున్నంతమాత్రాన వారికి ఇంటి పనులు అవసరం అనుకొంటారు ఇది చాల పొరబాటు అని "నావి" గారు రాసారు.

కుమారి టి శకుంతల (కొత్తకోట పి)

* * *

నావిగారు చెప్పిన లక్షణాలున్నవారు (చాలామందిని చూశాను లెండి) ఇకముందైనా సంసార బాధ్యతలను తీర్చిదిద్దుకుంటారని ఆశిస్తున్నాను

కుమారి కంకంటి (రాయపూరు)

---

## చౌచౌ పర్బత్

అనానపండు ముక్కలు - ½కప్పుకు సరిపోయేవి

నారింజపండు - 1

నిమ్మకాయ - 1

అనానపండు సన్నగా తరిగి తక్కినపళ్ళ రసంతో కలపాలి. కావలసినంత చక్కెర - సుమారు 10 చెంచాలు - కలిపి వడపోయాలి మొత్తం రెండు కప్పుల నీరు వాడవచ్చు ఎండాకాలం కనుక అయిస్ వేసుకుంటే బాగుంటుంది

మాకు తెలుసున్న ఒక కుటుంబమందిలాంటి వారి అమ్మాయికి చదువు చెప్పిస్తున్నారు తిన్న కంచమే కడగనివ్వరు అనుభవజ్ఞులు, వివేకవంతులూ ఎవరైనా చూసి, కంచమైనా కడగలేదా పాపా అంటే తల్లి అంటుంది "చదువుకునే పిల్ల ఏం కడుగుతుంది" ఇంకెందుకు జడే వేసుకోనివ్వదు పెళ్ళయితే మొగుడు వేస్తాడనేమో! ఏమైతేనేం ఇటువంటి మహా తల్లులు కనే పిల్లలను చేసుకునే అబ్బాయిలు దురదృష్టవంతులు

ఎం సుభాకృష్ణప్రియ (బెర్హంపూర్)

*  *  *

కాలేజి చదువులు చదివి, కాఫీ తయారు చేయుట యెలాగో తెలియని కాంతలు నేడు అనేక సంసారాలలో కనబడుతున్నారు ఇంటిపనులు కూడ చూసి నేర్చుకోకపోవడము శోచనీయం

దూడి నారాయణలక్ష్మి (రామచంద్రపురం)

*  *  *

## అద్దెకొంపలు

అంతమంది అద్దెకొంపల్లో అగచాట్లు పడుతూంటే మేము అద్దెకిచ్చుకునే అగచాట్లు పడుతున్నాం మేము అద్దెకిచ్చినవాళ్ళు శుభ్రంగా తలుపులు, గోళ్ళాలకి గోళ్ళాలు ఊడపీకేసేరు కొంతమంది అద్దె ఇళ్ళుకదా అని ఇల్లు ఎలాపోతే మనకేం అని ఒక పిసరైనా శుభ్రంగా ఉంచుకోరు పైగా నెల నెలా అద్దె ఇచ్చేటప్పుడు ఒక తంటా ఎన్నిసార్లు ఇల్లు బాగు చేయించినా ఒకలాగే తయారు చేస్తారు అద్దెకిచ్చినవాళ్ళు ఇలాగ బాధపడతారు నిష్కర్షగా చెప్పేవాళ్ళుంటే ఫరవాలేదు నేను ఇలా వ్రాశానని సోదరీమణులు అద్దె ఇచ్చినవారికి కూడా బాధ ఉంటాయా అని ప్రశ్నించవచ్చుగాని, ఇవి మాత్రం బాధలే భారతిగారిని హేళన చేయటానికి రాయలేదు అని గమనించ ప్రార్థన

వి జానకి (జయపురం,)

## ఆడపడుచులు

అనేక సంసారాలలో ఆడపడుచులవలన వదినగార్లకు బాధలు కలుగుచున్నవి వారు గూడా ఒక యింటి వదినగారలని తలంచిన బాగుండును

వి. కె. రమ (హైదరాబాదు)

*  *  *

ఆడపడుచులు, కోడళ్ళను బాధపెట్టే అత్తగార్లను గురించే వ్రాస్తున్నారుకాని, అత్తగార్లను బాధ పెట్టూ, భర్తలను కూడా వేపుకుతింటూ, ఉమ్మడి సంసారాలను విచ్ఛిన్నం చేసే కోడళ్ళు ఎంతమంది లేరు!

కె. సత్యవతీ రాధాకృష్ణ (అనంతపురం)

*  *  *

వదినలే ఆడపడుచుల్ని సాధించటము, నే నొక కుటుంబములో చూశాను ఆడపడుచు పెండ్లికాని పిల్ల తల్లి తను, అన్నగారింట్లోనే ఉంటారు అలా ఉండటము వదినగారికి ఇష్టములేదు ఆడపడుచుచేత ఇంటి చాకిరి అంతా చేయించి, పైగా మాటలంటుంది ఆ అమ్మాయి హృదయ మెంత బాధ పడుతుంది!

జి రమాదేవి (సంతమాగులూరు) ★

## రచయిత్రులకు విజ్ఞప్తి

మద్రాసు ఆంధ్రమహిళాసభ వారు వచ్చేనెలలో జరుపుకునే రజతోత్సవాలలో మహిళల సాహిత్య సేవ ప్రదర్శనకు ఏర్పాట్లు చేస్తున్నారు ఈ ఉత్సవాలలో శ్రీయుతులు సౌదామిని, రాధాకృష్ణన్‌లు పాల్గొంటారు

రచయిత్రులు తమ పుస్తకాలను ఆంధ్రమహిళాసభ రజతోత్సవ సంఘం, 12-ఎ బారెన్స్ రోడ్, మద్రాసు-4 కు పంపవచ్చు

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి సాధారణంగా 4"×2", 4"×4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి






# డాక్టర్ రాజు

బొమ్మల కథ

దేవిక

21















గృహిణులు

# ఝలక్ ను మెచ్చుకుంటున్నారు

ఓహో, బట్టలు ఎంత మెరిసే తెలుపో ! నిజంగా, నీవు శ్రమపడుతున్నావు.

అహ, శ్రమకాదు నాఅదృష్టం అనాలి, ప్రత్యేక విధానమున తయారైన ఒక కొత్త సబ్బును వాడుచున్నాను

అంటే ఏమిటి ?

ఏమిటనగా, ఈ సబ్బు త్వరలో, సమృద్ధిగా నురుగునిస్తుంది,
అవి చాలా బట్టలను ... ఎంతో మెరిసే తెల్లగా...
ఎంతో సులభంగా వుతుకుతుంది.

నిజం, ఈ కొత్త సబ్బు చాల బాగుగా శుభ్రపరుస్తుంది.
ఇలాగా నేను కనిపెట్టేను.

అది సరిగా సామాన్య బారు సబ్బులకంటె ఎక్కువగా
చాలా కాలము నిలవుంటుంది. అంతేకాదు.
ఇంకేమి కావాలి !

నేడేనేను ఈ సబ్బును కొనాలి, దాని పేరు ఏమిటి ?

జ్ఞాపకముంచుకో, అది ఝలక్, నీకుమరీ ఎక్కువ [illegible]
ఏమిటనగా, దానిని బజార్లలో అమ్మకము చేయు
చున్నవారు మార్గదర్శక సంస్థ, గోద్రెజ్ ;
సబ్బులలో ఉత్తమ నామము.







ఉత్పత్తి

**ఝలక్** బట్టలను మెరిసే తెల్లగా అధిక కాంతిగా వుతుకుతుంది




## దరఖాస్తుదారు

నీ హృదయంలో—
ఓ వేకన్సీ వుందని
ఎప్లై చేస్తున్నా విని!
ఎప్లై ఎప్లై నో రిప్లై
చెయ్యబోకు పూబోణీ
ఇక నా క్వాలిఫికేషన్సా?
"చెకచెక వీధులన్నీ లోకల్
రోమియోలా గాలించెయ్య
డమంటే ఖాతరు చెయ్యం
వికవిక వయ్యారిమిఠారుల
వంకర చెణుకులు విసరగల్ను
చూపులతూపులు వెయ్యడంలో
నా పేరుకి "కవ్వడి" ఉరఫ్
నైలాన్ శ్లాకూ ఉలెన్ ప్యాంటూ
గోల్డుఫ్లేకూ నా పేటెంటు
ఇంగ్లీషు పిక్చర్ల నవ్వులూ
వెరశి ముద్దులూ నా లేటెంటు
దేవానంద్ ఉరఫ్ గ్రెగరీపెక్కు—
దిగదుడుపులే నాముందు
నీ హృదయంలో
ఓ వేకన్సీ ఉందని
ఎప్లై చేస్తున్నా విని
రిప్లై ఇస్తావుగా హాసీ

వి. వి. ప్రసాద్ (గుంటూరు)

* * *

## నీతి కథ!

ఒకానొక కాకికి చాల దాహము వేసెను. దగ్గరలో నొకకుండలో కొంత నీరు కనిపించెను. కాని కుండమూతి చిన్నదిగానుండి నీరు అడుగున కొద్దిగా నుండుటవలన కాకి కందకుండెను. అది ఉపాయమాలోచించి చిన్న చిన్న కంకరరాళ్లను నోట గరచుకొనివచ్చి నిమ్మదిగా కుండలోనికి జారవిడచెను. కొంతసేపటికి నీరు పైకిరాగా కాకి దాహము దీర్చుకొనెను.

ఇట్లే దాహముగొన్న మరియొక కాకి గూడ అడుగున కొద్దిగా నీరున్న చిన్న మూతికుండ కన్పించగా, అది ఒకసారి నోట గరచుకొన గలిగినంత పెద్దరాతిని దెచ్చి దభీమని కుండమూతిపై బడవేసెను. పైభాగము పగిలిపోగా మిగిలినకుండ అడుగు భాగములోనున్న నీటిని త్రాగి కాకి దాహము దీర్చుకొనెను.

నీతి: తెలివితేట లుపయోగించి 'టయిము' 'సేవు' చేసుకొనవచ్చును!

వి. రామకృష్ణ (ఢిల్లీ)

* * *

## మీరు చదువరానిది

ఈవిషయం మీరు చదువరాదు. అంటే మీ రీ విషయాన్ని చదువరాదని. అరెరే మీరు చదవరాదని అంటే అర్థంకాలేదా? చదువకండి. ఏమిటండీ ఇది చదువరాదని చెప్పలేదా? చదువకండి. మీకేనండి చెప్పడం, చదువవద్దని. నేను మిమ్మల్ని ప్రార్థిస్తానండి. చదువవద్దని చెప్పితే చదువుతారేమండి.దయవుంచిచదువకండి.

చదువవద్దని ప్రార్థించినా చదువుతున్నారేమండి. ఏవిధంగా అడగాలని. అలాగయితే మీరు చదువననేవరకు నేను వ్రాయను. చదివేస్తున్నారుకదూ? అలాగయితే ఎలాగండి. నేను వ్రాయను. ఆ అంతే! మీరు చదువుచున్నారుగా?

పి. బాబూరావ్ (కాన్పూర్) ★



"ఇది నా మూడవ ఆత్మహత్యా ప్రయత్నం...అందుకనే ఉరిశిక్ష విధించండి."
చిత్రకారుడు: క. సీతారామ్ (బందరు)

జూల్స్ వెర్న్

# భూగర్భంలోనికి సాహసయాత్ర

## జరిగిన కథ

తమ్ముడు కొడుకు ఆక్సెల్ తో ప్రొ|లిడెన్ బ్రోక్ ప్రయాణం కడతాడు. వారు హాన్స్ అనే గైడ్ ను కుదుర్చుకుంటారు. స్కార్టారిస్ శిఖరం దిగువన వారికి మూడు రంధ్రాలు కనిపిస్తాయి. మధ్య రంధ్రంగుండా లోనికి దిగుతారు. ప్రయాణం కొనసాగిస్తారు. కొంత దూరం వెళ్లినతరువాత వారికి సముద్రం కనిపిస్తుంది. హాన్స్ తయారుచేసిన చిన్న తెప్పలో ఆ సముద్రం అవతలి ఒడ్డుకు బయలుదేరుతారు. ఇంతలో పెద్ద తుపాను చెలరేగుతుంది. తెప్పతీరానికి కొట్టుకుని వచ్చి, గాళ్ళను ఢీకొని ముక్కలవుతుంది. లిడెన్ బ్రోక్ మళ్లీ ప్రయాణానికి ఏర్పాట్లు చేయిస్తాడు. ఆక్సెల్ కు తుప్పుపట్టిన కాకు ఒకటి కనిపిస్తుంది. లిడెన్ బ్రోక్ దాన్ని పరిశీలించి అది అర్నె సాక్నుస్సెమ్ దని నిర్ణయిస్తాడు. అటు తరువాత హాన్స్ ను వెంట పెట్టుకుని సాక్నుస్సెమ్ అంతరీపానికి నడతారు. అక్కడ ఒక పెద్ద రాతి గోడకు ద్వారం కనిపిస్తుంది. దానిలో ప్రవేశించి కొద్ది దూరం వెళ్ళగానే పెద్ద రాతిబండ అడ్డువస్తుంది. దానిని తొలగించడానికి తుపాకిమందు పేలుస్తారు. కాని ప్రేలుడు వల్ల సముద్రంలో దూరంగా లేచి ఉన్న వీరు తెప్పతోపాటు ఒక సొరంలోకి కొట్టుకు పోతారు.

వచ్చేవారం ముగింపు !

## 42

సాయంత్రం పదిగంటలు అయి ఉంటుంది అనుకుంటాను. ఈ చివరిదెబ్బ తర్వాత నేను కోలుకున్నది శ్రవణేంద్రియం. వెనువెంటనే నేను విన్నది — ఇది నిజంగా శ్రవణేంద్రియానికి సంబంధించినదే — నిశ్శబ్దం ఆ ప్రదేశాన్ని ఆవరించటం. గంటల తరబడి నా చెవులు గర్జనతో నిండి ఇప్పుడు శబ్దంలేక పోవటం విన్నాను. మా పెదనాన్న ఈ నిశ్శబ్దాన్ని ఛేదించాడు :

"పైకి లేస్తున్నాం !" అన్నాడు.

"ఏమిటి ?" అని అరిచాను.

"అవును, పైకి లేస్తున్నాం ! పైకి పోతున్నాం !"

చెయ్యి జాపి గోడ ముట్టుకున్నాను. వెంటనే రక్తసిక్తమయిపోయినది. అతివేగంగా పైకి దూసుకు పోతున్నాము.

42-వ పేజీ చూడండి




(గత సంచిక తరువాయి)

"జీవితంలో భగవంతుడు మా కుటుంబానికి చాలా అన్యాయం చేశాడు సుందర్! పాకిస్తానులో మా నాన్నగారు డాక్టరుగా చాలా బాగా సంపాయిస్తుండేవారు. కాని దమ్మిడీ వెంట తీసుకు రాకుండా ఖరలవచ్చాం. అప్పటికే మా నాన్న గారు పెద్దవారు. అయినా నిరాశపడకుండా సరి హద్దుకి దగ్గరలో ఒక కొత్త ప్రాక్టీసు పెట్టారు. కొంచెం స్థిరపడుతున్నామని ధైర్యం వస్తుండగా గవర్నమెంటు మేమున్న ఊరును పాకిస్తానుకు వదలాయించింది. మళ్లీ మేము కొండ కులమంత కలకత్తా చేరుకున్నాము. కాని నాన్న గారు జీవితంలో తగిలిన ఈ రెండు దెబ్బలతో పూర్తిగా మారిపోయారు.

అలా మమ్మల్ని నాశనంచేసిన విధితో పోట్లా డటమే నా ధ్యేయం. అందుకనే మీతో చనువుగా తిరిగి నా లక్ష్యం నెరవేర్చుకున్నాను. అంతకన్న నాకు మరేటువంటి ఉద్దేశం లేదు. ఎప్పటికయినా నా స్వశక్తితో మా కుటుంబం కోల్పోయిన సిరి సంపదల్ని సంపాయించగలిగితే మా నాన్నగారు మామూలు మనిషి అవుతారని నా ఆశ—నా కుటుంబంలోని ప్రతిఒక్కరి కోరికా!"

తనకి ఒళ్ళు మండిపోయింది. క్షణిక మోహం చేసింది—సుకుమారమయిన ఈమెలో ఇంతటి గూఢాలోచన ఉందా అని ఆశ్చర్యపోయాను.

"నువ్వు నన్ను ఇంత అన్యాయం చేస్తావనుకో లేదు. అరవిందా—నువ్వే నా సర్వస్వమని నమ్మిన నన్ను ఇలా మోసం చేస్తావా?" అన్నాడు కోపంగా.

కాని ఆమెమాత్రం చలించలేదు.

"ఈ మాటలు వస్తాయనే ముందుగా మిమ్మల్ని ఏమీ ప్రశ్నించుకోండి. ఒకసారి మీ రూములో ఉత్తరం ఒకటి చదివాను. తరువాత కొద్దిగా మిమ్మల్ని గూర్చి విన్నాను. మీరు తన సర్వస్వం అని నమ్మిన అమ్మాయిని అన్యాయం చేసినప్పుడు ఆ అమ్మాయి ఎంత బాధపడిందో ఊహించారా? .... ఇందులో మోసం లేదని గ్రహించండి. ప్రతివారు అంత కన్న ఉన్నతమయిన లక్ష్యం కోసం, అవకాశం కోసం ఆశపడుతూంటారు. అంతే. మరి సెలవు. ఇవాళే బెంగుళూరు వెళ్లిపోతున్నాను."

ఒక్కక్షణంపాటు ప్రొఫెసర్‌కి చెప్పి ఆ అర వింద్‌కి సర్టిఫికెట్ రికమెండేషను రాయకుండా ఆపుదా మనుకున్నాడు. కాని, ఎందుకంటే ఏమనిచెప్పగలడు?

తనకి ప్రపంచం తల్లక్రిందులుగా కనబడింది. తను నమ్ముకున్న భూమి తన కాళ్ళక్రిందే బీటలు వారి పగిలిపోయింది. దేముడు తనకి భగవాన్ లేకాడు. అయినా అందరినీ కాదని, మనసిచ్చిన మీనాక్షిని తిరస్కరించి .... అంతలోనే చిన్ననాటి మీనాక్షి జ్ఞాపకం వచ్చింది. ఆమె రూపం, మాటలు .... "పాదాల దగ్గర చోటిస్తానని ఇన్నాళ్ళ కలలు గన్నాను" అని అంటుంటే దీనంగా ఆమె ముఖం—కళ్ళకి కట్టినట్లు గుర్తుకు వచ్చాయి.

"అరవింద నాకు కళ్ళు తెరిపించింది. గుడ్డి వాడినయి మీనాక్షిలాంటి రత్నాన్ని కాదన్నాను. ఏమయినా సరే మీనాక్షిని పెళ్ళి చేసుకోవాలి. "నా తప్పు క్షమించు మీనా" అంటే తప్ప కుండా నా గుండెలమీదికి వాలిపోతుంది. మీనా మనస్సు నాది. అది ఏ క్షణంలో అడిగినా నా కిస్తుంది. ఆమె హృదయంలో నాకు శాశ్వత మయిన స్థానం ఉంది." పిచ్చిగా గొణుక్కుంటూ రూముకి వెళ్లాడు.

ఇంటికి వెడదామని బట్టలు సర్దుతుంటే వారంక్రితం వచ్చి తనదృష్టిని ఆకర్షించలేక పోయిన శుభలేఖ టేబుల్‌మీద కనబడింది. తీసి చూశాడు.

ఛెళ్ళుమని కొట్టినట్లయింది—

"చి. సౌ. మీనాక్షిని చి. భాస్కరంకి ఇచ్చి .... వివాహం" అక్కడ యింకా చాలక ముహూర్తం చూశాడు.

అయిపోయింది. మీనాక్షి మరొకరి అర్ధాంగి అయిపోయింది!

ఈమాట అనుకున్నకొద్దీ తను పోగొట్టుకున్న వస్తువు ఎంతవిలువైనదీ తెలియరాసాగింది. జుట్టు పీక్కున్నాడు. ఏడిచాడు. ....

ఇంటికి వెడదామని సర్దుకున్న పెట్టె పట్టుకుని స్టేషనుకి బయలుదేరాడు .... ఆర్నెల్లు తిరిగాడుగాని దేనికోసమయితే తిరిగాడో ఆ మన శ్శాంతి మాత్రం మృగ్యమయిపోయింది. ఎక్కడ కంటికి అందమయిన ఆడపిల్ల కనబడినా మీనాక్షి గుర్తుకువచ్చేది. జంటలుగా పోతున్న దంపతులలో తన్ని, మీనాక్షిని ఊహించుకునేవాడు. ఈ క్షోభ భరించలేక ఇక్కడికే వచ్చేశాడు.

ఇలా రావడంతో తన ఉద్దేశ్యం ఏమిటో క్షుణ్ణంగా తనకే తెలియదు. కాని ఒకటి మాత్రం నిజం—మీనాక్షిని చూడనిదే తను బ్రతకలేడు.

గదిలో దీపం వెలగడంతో గబుక్కున లేచి కూర్చుని టవలుతో ముఖం తుడుచుకున్నాడు.

"మేలుకునే ఉన్నావా బావా ? నిద్రపోతున్నావనుకున్నాను. బయట వర్షం కూడా పడుతోంది. ఈయనింకా రాలేదు." అంది మీనాక్షి.

సుందరానికి ఒళ్లు మండిపోయింది—

"ఏం మీ ఆయన పసిపిల్లాడనుకున్నావా ? వస్తాడులే" అన్నాడు హేళనగా.

ఆమె మాత్రం అలా నిలబడి వీధివంక చూస్తూనే ఉంది.

తీసిఉన్న గుమ్మంలోంచి ఆమెమీదుగా, చల్లటి గాలి లోపలికి వస్తోంది. అలలు అలలుగా పమిట చెరగు బావుటాలాగా ఎగిరిపడుతోంది. ముంగురులని వెనక్కి తోసుకుంటూ నిలబడిఉన్న మీనాక్షి మోహనరూపం సుందరాన్ని ముగ్ధుడ్ని చేసి మనస్సులోని బాధని ద్విగుణీకృతం చేసింది.

"ఇలా నాకోసం ఎదురుచూస్తుండేది !" అనుకున్నాడు.

వర్షంలో తాపీగా తడుస్తూ లోపలికి వచ్చిన భాస్కరాన్ని చూసి ఖంగారుపడిపోయింది మీనాక్షి.

"నేను అనుకుంటూనే ఉన్నాను—ఇలా తడిసి వస్తారని ! అయినా ఏమంత కొంపలంటుకుపోయాయని, వర్షం తగ్గాక రాకూడదా ! లేకపోతే రిక్షామీద రాకూడదా? ఏంమనిషమ్మ బాబూ !" అంటూ అతన్ని కుర్చీలో కూర్చోపెట్టి పమిటచెరుగుతో అతని తల తుడవసాగింది.

సుందరం తల తిప్పేసుకున్నాడు.

"మా బావ అన్నాడు—మీ ఆయన ఏమయినా పసిపిల్లాడా అని. చూశావుగా బావా, నువ్వు ఉంటే యింత నిర్లక్ష్యంగా తడుస్తావా ?"

"ఇంటిదగ్గర పమిటచెరుగులుపెట్టి తుడిచే ఆడవాళ్ళుంటే ఏ మగాడయినా తడుస్తూ రావటానికి జంకడు !" అన్నాడు.

భాస్కరం నవ్వి "వెల్ సెడ్ — విన్నారా రాణిగారు, అడది గారాబం చేసినంతకాలం మగాడు బిడ్డకాన్నే వరిస్తాడు."

భాస్కరాన్ని చూస్తుంటే ఎక్కడలేని అసూయా కలగసాగింది సుందరానికి. ఏమిటి ఇతగాడి ఆధిక్యత తనకన్నా? అందమయినవాడా ? తనకన్నా ఎక్కువ ఆస్తి ఉందా? చదువు, ఉద్యోగం—ఎందులోనూ తన కన్నా అధికుడు కాడే. మరి ఇతన్ని అదృష్టం ఎలా వరించింది ? తను కలలుకనే జీవితం ఇతని సొంతం అయింది !

"మీకు జీతం ఎంతిస్తారండి ?" అన్నాడు ఉండుండి సుందరం—ఎందుకో మీనాక్షి ముందు తన ఆధిక్యతని ప్రదర్శించుకోవాలని అనాలోచితంగానే అడిగేశాడు ఈ ప్రశ్న.

భాస్కరం కూడా ఆశ్చర్యపోయాడు—ఆడదాన్ని వయస్సు, మగాడ్ని జీతం అడగకూడదని తెలిసుండిన సభ్యత కలిగిన మనిషి ఇటువంటి ప్రశ్న వేశాడేమా అని.

అయినా నవ్వుతూ "మీది ?" అనడిగాడు.

చెప్పాడు సుందరం చాలా యాదృచ్ఛికంగా చెప్పినట్టు !

"అందులో మూడవవంతు నాది" అన్నాడు భాస్కరం. నవ్వుతూ అన్న ఆ మాటల్లో బాధ ధ్వనించింది.

మీనాక్షి తల వంచుకుంది.

కాసేపు నిశ్శబ్దం ఆవరించుకుంది.

తనడిగినదానికి సుందరం సిగ్గుపడ్డాడు !

---

ఇద్దరు స్త్రీలు హఠాత్తుగా స్నేహితులయ్యారంటే, మరొకఆమె ఎవరో ఇద్దరు మిత్రుల్ని కోల్పోయిందన్నమాట !

ఆర్. చక్రధరరావు (ఖర్గపూర్)

---

మర్నాడు ముగ్గురూ సినిమాకి వెళ్లారు. సినిమా చూస్తున్నాడన్నమాటేగాని సుందరం మనస్సు గతం నెమరువేసుకుంటోంది—

ఆనర్స్ మొదటి ఏడు చదువుతూ శలవలకి తను ఇంటికి వచ్చాడు. బెజవాడలో బంధువుల ఇంట్లో పెళ్లని చెప్పి అందరూ అక్కడికి వెళ్లారు. జనాభా అంతా పెళ్లిసందడిలో మునిగి ఉంటే తనుమాత్రం మీనాక్షిని వెదికి పట్టుకుని పనున్నాడిలా వీధిలోకి తీసుకొచ్చి బలవంతాన రిక్షాలోకి ఎక్కించి సినిమాకి తీసుకెళ్లాడు. బయటికి "ఒద్దు బావా, బావుండదు" అని అంటున్నా మీనాక్షికికూడా అది ఇష్టమేనని ఆమె ముఖమే చెప్పింది. దానికితోడు తెలిసినా ఎవ్వరూ ఏమీ అనరన్న ధైర్యం తనకి మొదటినుంచీనూ.

ఆనాక సినిమాని జన్మలో మరిచిపోలేదు తను. బొమ్మ చూసిన పాపాన పోలేదు—ఒక్క ముక్క వినలేదు. మీనాక్షితో మాట్లాడటమే సరిపోయింది. ఏరి కోరి పాతసినిమాకి తీసుకురావడాన తమ విషయం పట్టించుకున్నవారూ లేకపోయారు.

గతంలోంచి బయటపడి పక్కకి చూశాడు. మీనాక్షి భర్తవైపుకి ఒరిగి అతనితో ఊసులాడుతూ మాట్లాడేస్తోంది !

సుందరానికి ఎవరో వెన్నులో పొడిచినట్లయింది!

అంతలోనే భాస్కరం "కాస్సేపు ఉండు మీనాక్షి, ఈ పాట చాలా బావుంటుంది విందాం" అన్నాడు.

అదే సమయమనుకుని "ఏడిసిందిలే మీనాక్షి — మీ ఆయనకి రూపాయిన్నరపెట్టి కొన్నాం కదా పూర్తిగా అనుభవిద్దామని లే యాత ! వెధవ పాటలు ! సినిమా నాకు పిచ్చి బోరుగా ఉంది" అంటూ ఆమెతో కబుర్లలోకి దిగాడు.

ఇద్దరూ చిన్ననాటి ముచ్చట్లలో మునిగిపోయారు. భాస్కరం మాత్రం ఇవన్నీ పట్టించుకోనట్టు సిగరెట్టు కాల్చుకుంటూ సినిమా చూస్తున్నాడు.

సినిమా అయిపోయాక "ఇదేం మనిషోగాని బావా, ఈయనతో సినిమాకి వచ్చామంటే ఇంతే ! ఉండుండి బిగుసుకుపోతారు—ఏమన్నా అంటే పాటలట ! అకాడికి కలిసిరావడం దేనికో ?" అంది చిరుకోపంతో మీనాక్షి.

"కొందరికి సోషల్‌గా మాట్లాడటం చేత కాదు మీనూ—అది వాళ్ల తప్పుకాదు పాపం ! మనం వాళ్లని చూసి జాలిపడాలి అంతే ! .... నీకు జ్ఞాపకం ఉందీ మనిద్దరం ఈ ఊళ్లోనే ఒక సారి పెళ్లిసందిట్లో నుంచి దొంగతనంగా పారిపోయి సినిమాకి వెళ్లాం—అవాళ ఒక్క ముక్క చూస్తే ఒట్టు మిస్టర్ భాస్కర్ ! ఒకటే కబుర్లు" నవ్వాడు సుందరం.

మీనాక్షికి గుర్తొచ్చింది కాని భర్తవంక చూసి తల వంచుకుంది.

భాస్కరం మాట్లాడకుండా నడవసాగాడు.

మర్నాడు భాస్కరం ఆఫీసుకని బయలుదేరుతుంటే "బావ ఉండే ఈ రెండురోజులూ శలవుపెట్టరాదుటండీ — సరదాగా గడపచ్చు" అంది మీనాక్షి.

బూట్లు వేసుకుంటూ "లేదు మీనాక్షీ, సరిగ్గా దురదృష్టవశాత్తు ఇనస్పెక్షన్ ఒకటి రాబోతోంది ! అందుకని గంట పర్మిషన్ ఇచ్చేందుకూడా ఒప్పుకోవడంలేదు నేను నాకింది 'ఎల్. డి. సి' లకి. ఇక నేను వెళ్లకపోతే ఏం బావుంటుంది చెప్పు ?" అన్నాడు భాస్కరం.

సుందరం నవ్వేశాడు. అతనికి భాస్కరాన్ని చూస్తుంటే నవ్వులాటగా ఉంటుంది. అది ఎందువల్లనో అతనికే తెలియదుగాని భాస్కరాన్ని సాధ్యమయినంతవరకు అవమానపరుద్దామని, హేళన చేద్దామని అతని కోరిక. అందుకనే—

"అవును మీనా, మా లాట్‌లో ఆకోంట్సు చూసేందుకు కొంతమంది గుమాస్తాలున్నారు. పాపం వాళ్లని చూస్తే జాలివేస్తుంటుంది నాకు. జేబులనిండా సిరామరకలు, చేతులకి సిరా మరకలు. మా డైరెక్టర్ వాళ్ళు శలవడిగితే మీద మేషాలు లెక్కెడతాడు. ఇక మాలాంటివారుఎక్కొ ట్మేసి ఫోనులో చెబుతేచాలు ఇవాళరాలేనని !"

"అవునండి వెధవ గుమాస్తాజీవితం ఇంతే !" అన్నాడు భాస్కరం తన్ని తనే అసహ్యించుకుంటున్నట్టు.

"అంతటి ఉద్యోగం చేయకపోతే ఏమో ?" అంది విరాగ్గా మీనాక్షి.

—30 వ పేజీ చూడండి

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

# వారఫలాలు

దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**20-4-1962 శుక్రవారము మొదలు**
**26-4-1962 గురువారము వరకు**

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

మీ వృత్తి ఉద్యోగాలలో ప్రత్యక్షంగా ఇబ్బంది లేకపోయినా సందేహాలు కలుగుతూ ఉంటవి. ఆదాయం క్రమంగా పెరుగుతుంది. మీరు స్వయంగా నిర్వహించవలసిన పనులకు అభ్యంతరాలు చెప్పేవారు ఉంటారు. అయితే మీరు కొంచెం కటువుగా ప్రవర్తించి కార్యసిద్ధి పొందగలుగుతారు. మీ వాక్చాతుర్యంతో అధికారులను అనుకూల మార్గానికి త్రిప్పుకోగలుగుతారు. కుటుంబంలోనివారికి అనారోగ్యం చేయుగల అవకాశా లున్నవి. తోటివారు మిమ్ములను సలహా కోరగల సమయం. ముందుముందు బాధ్యతలు మీ నెత్తికి రాకుండా చూచుకొనండి. విశేషంగా ఖర్చుచేయువలసిన భారిపనులను వాయిదా వేయవలసి వస్తుంది. 20, 21 తేదులలో సంతోష కార్యాలు, వ్యవహార విజయం.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

బాహ్యవిషయాలలో గౌరవప్రదమైనకాలం, తరచు శుభసంతోష కార్యాలలో పాల్గొంటారు. తూర్పు, ఉత్తర దిక్కులనుంచి లాభవార్తలు

> ### గ్రహస్థితి
>
> మేషంలో సూర్య బుధులు, మేష వృషభాలలో శుక్రుడు, కర్కాటకంలో రాహువు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురువు, మీనంలో అంగారకుడు, తులా వృశ్చిక ధనుర్మకరాలలో చంద్రుడు.

తెలుస్తవి. రావలసిన ధనం రాకముందే ఖర్చులు పెరగటంవల్ల చికాకు కలుగుతుంది. ఒకసారి అనుకొన్న పని పూర్తి అయ్యేలోపల అభిప్రాయాలు మారిపోతూ ఉంటవి. మీరు ఎవరిమీద ఆధారపడతారో వారే ప్రస్తుతం భయపెట్టటానికి చూస్తారు. సులభంగా తీరిపోతవని అనుకున్న రాజకీయాలు మళ్లీ మొదటికి వస్తవి. అజీర్ణ దోషం వల్ల బాధపడవలసి వస్తుంది. వారం రెండవ భాగంలో క్రొత్తవారి స్నేహం లభిస్తుంది. ప్రయత్నించే పనులు జరుగకుండా ఇతర కార్యాలలో అనుకూలత పొందగలుగుతారు. 22, 23 తేదులలో శుభకార్యాల మూలంగా ఖర్చులు, క్రొత్త వ్యాపార వ్యవహారాలను గురించిన ఆలోచనలు.

* * *

## మిధునం :

(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

వృత్తివ్యాపారాలలో శ్రమపడి జయము, లాభము పొందతగిన సమయం. గొప్పవారితో స్నేహ సంబంధాలు ఏర్పడగలవు. అయితే మాటలలో నేర్పు, నిదానము అవసరం. ప్రస్తుతం ఆదాయం పెరుగుతుందని అనుకోవద్దు. స్నేహితులు మీ మాటను ముందు కాదన్నా సమయంలో చక్కగా సహాయం చేస్తారు. నౌకరులమీద ఆధారపడిన పనులు మధ్యలో ఆగిపోయే అవకాశాలున్నవి. మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా శత్రువులయొక్క దుష్టభావాలయొక్క ఫలితం మీ మీద కొంతవరకు ప్రసరిస్తుంది. పిల్లలవలన ఆనందం లభిస్తుంది. వారం చివర అభిప్రాయ భేదాలుగల మనుష్యులతో కలసి పనిచేయువలసి వస్తుంది. 24, 25 లలో గౌరవప్రదం, దైవ కార్యాలు—

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)

ప్రస్తుతం మీ మేలుకోరి మీ కష్టసుఖాలలో పాల్గొనేవారు లభిస్తారు. సంఘంలో గౌరవలాభం, మాట చలామణీ బాగుంటవి. ధనవ్యయం విశేషంగా ఉంటుంది. ఈ సమయంలో ఎక్కువ భాగం దైవిక కార్యాలు, ఆధ్యాత్మిక చింతనము—వీటియందు గడుస్తుంది. ప్రయాణ కార్యక్రమాలు మానుకొనవలసి రావచ్చు. వృత్తిలో క్రొత్తమార్గాలలో ధన సంపాదన ప్రయత్నాలు అనుకూలిస్తవి నరముల బలహీనత, మానసిక అశాంతివల్ల ముందు యోచన తోచక పోవటము, ప్రతి చిన్న విషయంలోనూ ఆదుర్దా—వీటివల్ల కార్యరంగంలో మీరు అనుకున్నంత అభివృద్ధిని సాధించలేకపోతారు 25, 26 తేదులలో కుటుంబంలో అశాంతి, తూర్పుదిక్కునుంచి అసంతృప్తికర వార్తలు.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

గ్రహబలం మీయొక్క ఉన్నత స్థితిని తెలుపుతున్నది. అధికారం చలాయించగలుగుతారు. ముందు కొంచెం చికాకు తోచినా సకాలంలో చక్కని యోచన చేయగలుగుతారు. కుటుంబ విషయాలలో కూడా మనశ్శాంతి, సుఖము పొందగలుగుతారు దేహశ్రమ అధికం కాకుండా చూచుకొనటం అవసరం. అప్పులు ఇచ్చిపుచ్చుకొనే సందర్భాలలో నిష్కర్షగా ఉండవలసిన సమయం.

ఇంతకుముందు మీకు అపకారం చేసినవారికే ఈ సమయంలో సహాయం చేయవలసి వస్తుంది. ధన సంబంధమైన ప్రయోజనం పెద్దగా ఉండదు కాని, వార్తలు మాత్రం సకాలంలో తెలుస్తవి. ఉద్రేకాన్ని తగ్గించుకొనటం మంచిది. నౌకరులతో తగాదాలు రాగల అవకాశా లున్నవి. 23, 24 తేదులలో బంధువులవల్ల అనుకూలత, ఆదాయ వృద్ధి.

* * *

## కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

సాధ్యమైనంత వరకు ఇతరుల వ్యవహార విషయాలలో జోక్యం లేకుండా చూచుకొనటం మంచిది. అకస్మాత్తుగా దేహబాధలు కనుపిస్తవి. ధన సంబంధమైన లావాదేవీలలో తగాదాలు పడవలసి వస్తుంది. మీ స్వంత వ్యవహార వ్యాపారాలలో ఒక ప్రక్క చిక్కులను ఎదుర్కొంటూ ముందుకు పోగలుగుతారు. కుటుంబంలోనివారి ఆరోగ్యం బాగుండదు. స్నేహితులకు వ్రాసే ఉత్తరాలలో పొరపాట్లు రాకుండా చూచుకొనండి. వృత్తిలో అభివృద్ధి ప్రయత్నాల నిమిత్తం ముందుగా ధనం వినియోగించవలసివస్తుంది. అయితే అందువల్ల విశేష ఫలితం పొందలేక పోతారు. సాహస కార్యాలలో ప్రవేశించతగిన సమయం కాదు. 21, 22 తేదులలో ధన లాభం, అధికారులతో స్నేహం.

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

మీరు ఎంత ఉదారంగా ప్రవర్తించినా ఇతరుల వల్ల మోసం కలిగే అవకాశా లున్నవి. ధన సంపాదన బాగుంటుంది. లాటరీ మొదలయిన వాటిలో ఉత్సాహదాయకంగా ఉంటుంది. ఓర్పులేని మనుష్యులతో చేరవలసి రావటంవల్ల వ్యవహార రంగంలో బాధలు కనుపిస్తవి. దుబారా ఖర్చులను అదుపులోకి తీసుకొని రాగలుగుతారు అప్పుల బెడద క్రమక్రమంగా తొలగిపోతుంది. రాజకీయాలలో అనవసరమైన శ్రమ పెరుగుతుంది. మిమ్మలను పొగడుతూ అక్కర తీర్చుకొనేవారు ఉంటారు. జాగ్రత్త. సాహిత్య కృషికి అనుకూలమైన కాలం. డబ్బు ఇచ్చి తగాదాలు తెచ్చుకోవలసిన సూచన లున్నవి. దైవ కార్యాలకు అనుకూలమైన కాలం. 20, 21 తేదులలో దేహ శ్రమ, విసుగుదలతో కార్యానుకూలత.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

మీరు ఆరంభించే ప్రతి పనికీ అభ్యంతరాలు, కట్టుబాట్లు అధిక మవుతవి. బుద్ధిబలంతో రహస్యంగా మీ కార్యక్రమాలను సాగించ గలుగుతారు. లోగడ ఎప్పుడో జరిగిన పొరపాట్లు ఈ సమయంలో శ్రమలకు దారితీస్తవి. పెద్ద పెద్ద వ్యాపారాలు మొదలయిన రంగాలలో డబ్బును వినియోగించి గౌరవ లాభాలను పొందగలుగుతారు. ఆరోగ్యం విషయంలో జాగ్రత్తగా ఉండండి. మీ క్రింద పనిచేయు మనుష్యులతో అభిప్రాయ భేదాలు వచ్చి చల్లగా తగ్గిపోతవి. శుభ కార్య ప్రయత్నాలలో ఇంతకుముందు ఉన్నంత ప్రోత్సాహం కనుపించదు. ప్రయాణాలు ఉత్సాహకరంగా కొనసాగవు. 22, 23 తేదులలో ఆశాభంగము, క్రొత్తవారితో పరిచయం.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

మీ మనస్సులోని కోర్కెలు క్రమంగా అనుకూలిస్తవి. సంఘంలో మీ బుద్ధిబలమును వినియోగించి పదిమందికి మేలును చేకూర్చ గలుగుతారు. విలాస వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. "దూరపు కొండలు—నునువు" అన్నట్లు మిమ్మలను ప్రోత్సాహ పరిచేవారు ఉంటారు. తొందర పడతగిన సమయం కాదు. పిల్లల ఆరోగ్యం సరిగా లేకపోవటంవల్ల మనశ్శాంతి తగ్గుతుంది. వ్యాపార వ్యవహార రంగాలలో మీమాట జయిస్తుంది. బంధువులతో విరోధం రాగల సూచన లున్నవి. మీకు ఇష్టం లేకపోయినా యుక్తివాదంతో ఎదటివారిని మెప్పించవలసిన అవసరం కలుగుతుంది. మీరు విశ్రాంతి తీసుకుందా మనుకునే సమయంలో మీ మిత్రులు క్రొత్త ఆలోచనలను రేకెత్తిస్తారు. వాటివల్ల ప్రయోజనం కనుపించదు. 24, 25 తేదులలో వృధా శ్రమ, అపవాదులు, ఎదురుచూచిన ఆదాయానికి భంగము.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఇంతకుముందుకన్నా మేలు అని చెప్పవచ్చు మీ అనుభవాన్ని వినియోగించుకొని కార్యసిద్ధి పొందగలుగుతారు. ఏ వ్యక్తితో ఏవిధంగా మసలుకొనవలయునో తెలుసుకొనటం కష్టం. దైవానుగ్రహంవల్ల వ్యవహారసమస్యలు ఒక దారికి వస్తవి. అయితే ఒక పని పూర్తి కాకముందే మరియొక ఆందోళన బయలుదేరుతుంది. ఆదాయం రావటానికి, ఖర్చు కావటానికి సరిపోతుంది. పడమర దిక్కునుంచి ప్రయోజనకరమైన వార్తలు తెలుస్తవి. ఇతరులకు సహాయం చేయటం, సలహా చెప్పటం వంటి పనులు ఎదురు తిరిగి మీకే మాట రాగల సూచనలున్నవి. బంధువులు మీ మాటను బలపరుస్తారు. మీ సందేహాలు తీరకపోవటంవల్ల లభించిన మంచి అవకాశాన్ని జారవిడచుకుంటారు. 25, 26 తేదులలో సంచారము, ఉపయోగం లేని పనులు, అధికవ్యయం.

* * *

## ఈ వారము ధరలు

బంగారు ధర వారం చివరలో పెరుగుతుంది, వెండి ధర 24 వరకు తేజీలో ఉండి అనంతరం క్రమంగా తగ్గే అవకాశా లున్నవి. చింతపండుకు గిరాకీ వస్తుంది. ప్రత్తి ధర మామూలుగానే నిలుస్తుంది. నూలు ధర కొద్దిగా పెరుగుతుంది. గోధుమల ధర మందీ అవుతుంది. మిర్చి ధరలో తరచు హెచ్చు తగ్గులు రాగల సూచన లున్నవి. నూవుల ధర వారం రెండవభాగంలో తగ్గుతుంది. వేరుశనగపప్పు ధర క్రమంగా మందీ అవుతుంది.

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

మీ మనోధైర్యమే మిమ్మలను కాపాడుతుంది. శక్తికి తగినట్లు మీ ధర్మాన్ని నిర్వర్తించ గలుగుతారు. వ్యవహారరంగంలో మంచి పేరు లభిస్తుంది. ప్రయాణం చేస్తారు. ఒకరి సలహా సంప్రదింపులతో నిమిత్తం లేకుండా ముందుకు పోగలుగుతారు. దేహశ్రమ అధికంగా ఉంటుంది. కాని ప్రత్యేకంగా అనారోగ్యం ఏమీ ఉండదు. వారం రెండవభాగంలో మొహమాటానికి లోబడి లేనిపోని శ్రమలను పైనవేసుకొంటారు. కుటుంబంలో తరచు ఏదో ఒక అసంతృప్తితోన్నా ఉంటుంది. సంఘకార్యాలలో పాల్గొంటారు కాని, ఇతరుల ప్రోత్సాహం తక్కువ. బంధువుల వద్దనుంచి సంతోషవార్తలు తెలుస్తవి. 23, 24 లలో శత్రుబాధ, వృత్తిలో పోటీలు, స్వల్ప ఫలితం.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

మీ ఆలోచనలకు ఒక మార్గం కనుపిస్తుంది. పెద్ద మనుష్యుల స్నేహం లభిస్తుంది. వృత్తిలో మీస్థానం బలపడగల సమయం. అపవాదులు రాగల సూచన లున్నవి. అయితే దైవానుగ్రహంవల్ల చిక్కు ఏమీ ఉండదు. తలవనితలంపుగా ప్రయాణాలు చేయవలసిరావచ్చు. విలువగల వస్తువులు కొంటారు. లోగడ చాలా కాలంగా మీరు చేస్తున్న కృషి ఈ సమయంలో ఫలిస్తుంది. కుటుంబంలో శుభసంతోషకార్యాలు జరుగుతవి. ఎప్పటికప్పుడు చేదామని అనుకుంటూ అశ్రద్ధగా వదలిన పనులు ప్రస్తుతం మీ అభివృద్ధికి అభ్యంతరంగా తయారుకాగల అవకాశా లున్నవి. విదానంగా బుద్ధిబలంతో తప్పించుకొగలుగుతారు. 21, 22 తేదులలో కార్యభారం, కష్టవార్తలు. ★

డా॥ గాలి బాలసుందరరావు

# జీవకణములలో భాగములు

చిత్రంలో జీవకణంలో ఉండే వివిధభాగములు —ఈనాటి వరకూ తెలిసినవి—చూపబడినవి.

జీవకణమును చుట్టి పైపొర ఉన్నది. మామూలు మైక్రోస్కోపులో యిది ఒకే పొరలాగా కనుపించినా, ఎలెక్ట్రాన్ మైక్రోస్కోప్‌లో రెండుపొరలుగా కనుపిస్తుంది. ఆ పొరలమధ్య ఒక ఖాళీ ప్రదేశం ఉన్నట్లు తెలుస్తుంది. అయితే అన్ని జీవకణముల పైపొరల్లోనూ, రెండు భాగములు కనుపించవు.

2 వ చిత్రంలో పైపొరలో ఉండే సూక్ష్మ భాగములు చూపించబడినవి. జీవకణంలో కనపడే ముఖ్యభాగములలో పైపొర ఒకటి. సగ్గుబియ్యం పరమాన్నంలో, సగ్గుగింజలలాగా, టిష్యూ ఫ్లూయిడ్ (Tissue Fluid) అనే ద్రవపదార్థంలో, జీవకణములు ఊరుతూ ఉంటవి. ఆ ద్రవపదార్థములో ఉన్న ఆహార పదార్థములూ, లవణములూ, ప్రాణవాయువూ జీవకణంలోనికీ, జీవకణంలో జరిగే కార్యక్రమానికీ ఫలితంగా తయారయ్యే వస్తువులు, టిష్యూ ఫ్లూయిడ్‌లోకీ పోవడానికి జీవకణము పొరలో ఉండే రంధ్రములు ఉపయోగిస్తవి. ఈ రంధ్రములలో కొన్ని చిన్నవీ, కొన్ని పెద్దవీగా ఉంటవి. జీవకణంలోకి వస్తూ పోతూ ఉండే వస్తుకణముల పరిమాణమునుబట్టి ఆయా రంధ్రములద్వారా పోతూ వస్తూ ఉంటవి. ఇంతే కాదు. ఏ వస్తువులను పోనివ్వాలో, వేటిని రానివ్వవలెనో ఈ పైపొరయే నిర్ణయిస్తుంది. దానికా విచక్షణ శక్తి ఉన్నది.

ఎండి చివికిన ఆకులో ఈనెలు వలగా ఉండడం చాలామంది చూచివుంటారు. ఇటువంటిదే ప్రొటీను పైపోగులతో తయారైన వల ఒకటి జీవకణం పొరలో ఉంటుంది. ఆ వలలో ఉన్న ఖాళీ ప్రదేశములను నింపుతూ, ఒక గుజ్జువంటి పదార్థము ఉంటుంది. అది ఫాస్ఫొలైపిడ్లూ, కొలెస్టరాల్, ఒక రకమయిన కొవ్వు విశేషమూ కలిసి ఏర్పడ్డది. ఏ కారణంచేతనైనా పైపొరకు అపాయంకలిగి అది ఛిద్రమయినప్పుడు, జీవకణం గుజ్జు ఆ పొరను మళ్లీ సృష్టిస్తుంది.

మనశరీరంమీద, చర్మంలోనూ అసంఖ్యాకము అయిన రంధ్రములుంటవి. వాటినుండి స్వేదజలము (చెమట) వస్తూ ఉంటుంది. కొన్ని పదార్థములు వాటినుండి శరీరంలోకి ప్రవేశిస్తవి. ఇందువల్లనే అనేక తైలములనూ, అంజనములనూ చర్మంమీద రుద్దినప్పుడు అందులో ఉన్న ఔషధ పదార్థములు, శరీరంలోకి ప్రవేశించడం జరుగుతున్నది.

జీవకణంలో గుజ్జును (Cytoplasm) జొన్నగడ్డితో చేసిన హల్వాతో పోల్చవచ్చును. ఇందులో పైభాగము (Cortex) లోపలిభాగము (Medulla) అని రెండు భాగము లుంటవి. పైభాగము గాజులాగా నిర్మలంగా ఉంటుంది. జీవకణమును చుట్టి ఉండే ద్రవములో, కేల్షియము అధికంగా ఉన్నప్పుడు ఈ భాగము చాలా మందంగా ఉంటుంది. సోడియము పొటాసియము అధికంగా ఉంటే ఈ పొర పలచబడిపోతుంది.

ఈ భాగంలోనే టిష్యూ ఫ్లూయిడ్‌లో ఉన్న వస్తువులను తనలోకి గుంజుకునే శక్తి, వాటిని జీర్ణించి, జీవకణ జీవితానికీ, ధర్మాలకూ అవసరమైన పదార్థములనూ నిర్మించే శక్తి కలిగిన కొన్ని ఎంజయిములూ ఉంటవి. ఈ ఎంజయిములన్నీ ప్రొటీను విశేషములే.

గుజ్జు పైభాగానికీ, న్యూక్లియస్‌కూ మధ్య ఉన్న గుజ్జుభాగం, దాని పైభాగం ఉన్నంత నిర్మలంగా ఉండదు. అందులో అనేక సూక్ష్మ

—37వ పేజీ చూడండి

1. జీవకణము




2. జీవకణముపైపొర



# నచ్చిన భాగం

పవితంటి కృష్ణారెడ్డి

'ఆశీర్వదించు మావయ్యా !' అని సతీసమేతుడై క్రొరకంకులా వంగి తన పాదాలమీద మోక రింపబోయిన మోహనరంగాన్ని చూచి మూడడుగులు వెనక్కు వేశాడు ముకుందయ్య !

దుష్టుడైనా, శిష్టుడైనా, వచ్చినా నచ్చకున్నా, నమస్కారాన్ని స్వీకరించి, ఉలక్కుండా పలక్కుండా కూర్చోవడానికి ముకుందయ్య గుళ్లో దేవుడు కాదు — ఓ సామాన్య మానవుడు.

అందులో స్వప్రయోజనం ఎంత స్వల్పమోతాదులో కనిపించినా, పిలిచి నమస్కారంబెట్టి, కంటబడ్డ హోటలుకు వెంటబెట్టుకపోయి చిరు దరహాసాన్ని పెదవుల చిందిస్తూంటే ఓ అర కప్పు కాఫీ ఎదుటవ్యక్తి పెదవులకు అందించే వ్యక్తిత్వం కోసం త్రోవచూపే బుద్ధిశాలి ! పని లేకపోతే చూచీచూడనట్లు సందుత్రోవలు వెదికే ప్రజ్ఞాశాలి !!

"—అలాంటి ముకుందయ్యను అటూ, ఇటూ— అంటే అటు ఆహ్వానించడమో, ఇటు పలకరించకుండా ప్రక్కకు తప్పుకోవడమో కాకుండా 'ఇరకాటం'లో పడవేసి నిలబెట్టింది అతనికి మోహన రంగానికి మధ్యగల బాంధవ్యం ! ....

పంటివండని పోయగాల కనుబొగలు వంపులు తిరిగాయి. చుట్టస్నేహంతో కాటుక దిద్దుకొన్న పెదవులు వణకుతూ మరీ వికృతంగా కనిపిస్తున్నాయి. హద్దుమీరిన ఉచ్ఛ్వాస నిశ్వాసలతో బొద్దుగా ఉన్న శరీరము పైకి లేస్తూ పడుతూ ఉంది ! ....

మూడడుగులు వెనక్కువేసి నిలబడిన ముకుందయ్య ఆకృతిని ఆవరించుకొన్న వికృతరూపం అతనిని ఇరకాటంలో పడవేసినదనడానికి నిదర్శనం !

"ఇదేమి విడ్డూరమే ! అయినవాడు కడప తొక్కకొనివస్తే ! ...." చూడడానికి వచ్చి చుట్టూ గుమిగూడిన అమ్మలక్కలలో గుసగుసలు !

సాధారణంగా పల్లెటూళ్లల్లో ఓ క్రొత్త మొగం కంటబడిందంటే, వెంటబడి ప్రశ్న పరంపరలతో ముంచెత్తి ఆ వచ్చినవారి పేరూరు కాస్త పరీక్షించేవరకు వదలిపెట్టరు. భార్య అనుసరిస్తూంటే ఊళ్లో అడుగుపెట్టిన మోహనరంగాన్ని చూచి పంజవేళ ఇంటిముందర వెత్త ఊడుస్తూ ఉండిన అమ్మలక్కలు చేతిలో చీపుర్లు ఎక్కడివక్కడ పారవేసి, దుమ్ము నిండిన మొగాలపై దోసెడు నీళ్లు ప్రోక్షించి, పైట చెంగుతో తడి ఒత్తుకుంటూ ఏదో మునిగిపోయినట్లు వెంబడించారు. ఆ ఇంటి వరండా నిండుగ గుమిగూడారు.

వంకాయకు క్రింది భాగాన రెండు, పై భాగాన రెండు వేలెడంతంత పొరకపుల్లలు గుచ్చి 'మనిషి బొమ్మ' అని ఆడుకొంటూంటారు పిల్లకాండ్లు. అచ్చం ఆ రూపానికి ప్రతిస్వరూప



తున్నట్లుగ ఉంటూ, పదేండ్ల క్రిందట పశువుల వెంబడి తిరుగుతూండిన మోహనరంగం నేడు ఎర్రనేలలో గనుసుగడ్డ ఆయకట్టు ఊరి, తన పేరు సార్థకపరచుకొనేసరికి అందరూ ఆశ్చర్యములో మునిగితేలుతూ, పరామర్శమాట అటుంచి కేవలం ఊపిరి సలుపుకోలేక ఒకరి మొగం ఒకరు చూసుకొంటూ నిలబడ్డారు. పెరట్లో పొయ్యి రాజేసి, ఇంట్లో సంజదీపం వెలిగించడానికి పోతూఉండిన ఇంటి యజమానురాలు రామలక్ష్మమ్మ మాత్రం 'ఏమిటీ గుంపు!' అని రెప్పపాటు నిలిచి, మోహనరంగాన్ని చూచి నివ్వెరపడి, అంతలోనే తేరుకొని 'ఓ మోహనరంగమా! ... రా నాయనా! రా!! ....ఎప్పుడు రావడం? అయ్యో రాతా! అలా వాకిట్లో నిలబడ్డావేం? నువ్వేం కొత్తవాడివా ఈ ఇంటికి?' అని ఆ నిశ్శబ్దతకు నీరాజనమెత్తింది. ఆ ఆహ్వానములో ఆప్యాయత లేదు. ఆదరణ లేదు. లేదంటే ఇంట్లో అడుగుబెట్టిన బంధువును పలుకరించకపోతే బాగుండదన్న సంస్కారం మాత్రం లీలగా గోచరిస్తోంది. ఇంటి యజమానురాలు ఆ సత్కారబాధ్యతను వహించేసరికి ఇంటి యజమాని బాధ్యతా 'ప్రోనోటు' లో చెల్లు వ్రాశాడు. సగం కాలీ కాలని చుట్టను విసరి నేలకుకొట్టి విసవిస వెళ్లిపోయాడు!

మామగారి ఈ ప్రవర్తన నైతే తాను ఇంతకు ముందే ఊహించుకొన్నాడు కాబట్టి మోహనరంగం ఆశ్చర్యపడలేదు. కానీ ఊళ్లో అమ్మలక్కలు తన్ను, తన భార్యను ఇలా, వెర్రి చూపులతో చూస్తూ నిలబడేసరికి, తనకే ఎబ్బెట్టనిపించి, ఆ వాతావరణంనుండి తొందరగ విముక్తుడైపోవాలనుకున్నాడు.

"ఇప్పుడే బస్సు దిగి వస్తున్నా నత్తయ్యా! మామగారు కనుపించితే ఆశీర్వాదం పొందాను. ఇంతలో మీరు కనుపించారు!" అంటూ లేని నవ్వుతో లోని కేగాడు. అర్ధాంగి అతని అడుగుజాడల్లో నడిచింది. రామలక్ష్మమ్మ వారి ననుసరించింది.

వరండాలో గుమిగూడిన అమ్మలక్కలకు కొండంత నిరాశ మొగాన మొత్తిన ట్లయింది. వాళ్ల హృదయాల్లో పుట్టిన కోరికలు నాలుక కొసవరకు వచ్చి కొసలోనే పూసిపోయాయి. దాంతో వాళ్లు రెచ్చిపోయారు. 'ఓ యబ్బ! నిన్న మొన్నటిదాక ఎద్దుగొడ్లు, ఆవుగొడ్లు మేపుతూ ణ్ణింది మరచిపొయ్యినట్లుందిలే!' అని తల కొక్క తీరుగా దెప్పిపొడుస్తూ ఆ సభారంగం నుండి ఒక్కరొక్కరుగ జారుకొన్నారు. అంతకు ముందు వారం పదిహేను రోజులుగ జరిగిన ఎన్నికలలో ఏకగ్రీవంగా ఎన్నుకోబడి, సభాస్థలిమీద నిలబడి అప్పుడే కృతజ్ఞత తెలుపుకొంటూ ఉండిన 'అష్టగ్రహకూటమి సమస్య' ఆగ్రాత్రి తన ఓటమిని అంగీకరించి తనస్థానంలో మోహనరంగాన్ని నిలబెట్టిందంటే అది సత్యదూరం కాదు!

సంజవేళ! ఆ పల్లెనవాంతరసీమలో ఓ ఘూరుహములా తయారయింది. ఒకప్రక్క అడవికి మేతకేగిన ఆలమందలు, గొర్రెలగుంపులు,

# వచ్చిన భాగం

మరోప్రక్క పొలాలలో పని ముగించిన రైతు బిడ్డలు, నెత్తిమీద వచ్చగడ్డిమోపులతో పడుచు పిల్లలూ, అందరూ ఇంటిముఖం పట్టారు. "ప్రొద్దు పోతుందేమో!" అన్న ఆతురత వాళ్ల మొగాలలో బాగా ద్యోతకమవుతూంది. ప్రకృతి పిల్లవాడు విసరివేసిన బంతిలా సూర్యుడు కొండల కావల పడబోతున్నాడు. నట్టింట ముట్టించిన సంధ్యదీపం నిశ్చలంగా వెలుగుతూంటే ఆ నిశ్చలతకు నాలుగు కాలాలపాటు భంగం వాటిల్లనీయ వద్దని సంధ్యలక్ష్మి మ్రోల మోకరిల్లింది రామలక్ష్మమ్మ. మోహనరంగం భార్య—రేఖను ఇంటిలో వదలి తానలా పొలాల వైపు బయలుదేరాడు. ఆమెకు ఆ ఊరు, ఆ ఇల్లేగాదు, ఆ యింటి ప్రతివ్యక్తీ క్రొత్త! అప్పుడే ఇంటిలో

"నన్ను మీరు నిజంగా ప్రేమిస్తున్నారా?"

"ఇంకా అనుమానమే!"

"మరి నా కోసం మీరు చావడానికి కూడా సిద్ధమేగా"

"క్షమించు ప్రేయసీ! నాది అమరప్రేమ."

జి. ఆర్. రావు (మద్రాసు)

అడుగుబెట్టిన 'కొత్తకోడలు' తీరుగా ఉంది ఆమె పరిస్థితి. ఆ పరిస్థితిని జీర్ణించుకోవడానికి ప్రయత్నిస్తూ ఉంది ఆమె! ....

* * *

మోహనరంగం ముకుందయ్యకు వేలువిడిచిన అప్పచెల్లెలి కొడుకు. అంటే ఆ యింటికి అల్లుడు కాదగ్గ మేనరికం పట్టభద్రుడన్నమాట! మోహనరంగం తండ్రి నరసయ్య. తల్లి నాగరత్నమ్మ. నరసయ్య ఆ చుట్టు ప్రక్కల పది పదిహేను పల్లెలకు మకుటంలేని మహరాజు. వంజ పుంజ గలిసి ఓ ఇరవై ఎకరాల పొలం సేద్యగాళ్ల చేతుల్లో ఆవకతవకలుగ సాగవుతూంటే, పది వేల రూపాయల రొఖ్ఖం నరసయ్య చేతుల్లో దివ్యంగా సాగుబడి అయ్యేది. నరసయ్య చేస్తున్న ఈ సాగుబడికి అర్రులు చాచి ఆకాశంవైపు చూడవలసిన అవసరం కానీ, స్వేదజలంతో భూమాతను అభిషేకం చేయవలసిన ఆవశ్యకతగానీ ఉండేదిగాదు. కాగా సేద్యగాళ్ల వ్యవసాయం ఆరు నెలల కొకసారి, లేదు ఏడాది కొకసారి ఫలితాన్ని అందచేస్తూంటే, నరసయ్య వ్యవసాయం ప్రతి నెలా 'మణియార్డరు'లాగ ఓ వంద రూపాయల ఫలితాన్ని అందజేసేది. అంటే — ఆయన చేస్తున్నది వడ్డీవ్యాపారం! ఆ వ్యాపారంలో ఆయనకు ఊపిరి సలుపుకొనే అవకాశం గూడ దొరికేది గాదు. ఇచ్చిపుచ్చుకోవడం, వ్రాతకోతలు వ్రాసుకోవడం, రాని డబ్బుకు కోర్టులచుట్టూ తిరగడం .... క్షణం తీరిక ఉండేది కాదు. పైగా కోర్టులచుట్టూ తిరిగిన అనుభవంతో ఆ ప్రాంతంలో ఆయన బోర్డు తగిలించుకొని నాటు వకీలు! గ్రామాల్లో చిల్లర జగడాలు మొదలు ఆస్తి పంపకాల వరకు నరసయ్య ఆవశ్యకత ఎంతయినా ఉండేది. అలాంటి సదవకాశాలను సద్వినియోగం చేసుకోవడములో నరసయ్య బహుముఖ ప్రజ్ఞాశాలియై ప్రవర్తిస్తూంటాడు. 'నాయనా! మీకు నామీద ఉన్న గౌరవం కొద్దీ నన్ను పిలిపించారు. మీమాట కాదనలేక నేనూ వచ్చాను. సంతోషం! కాని ఒక తల్లిగర్భంలో జన్మించిన మీకు మీకే పడకపోతే నామాట వింటారని నమ్మక మేముంది?' అని అన్నదమ్ముల ఆస్తిపంపకాన్ని ఆరంభించి, తన మాటప్రకారం నడచుకోవడానికి షరతుగా ఇరుపక్షాలనుండి ఓ వెయ్యిరూపాయలకు బాండ్లు పుట్టించి దేవునిమీద భారం మోపి భాగవిమర్శ అయిందనిపిస్తాడు. తరువాత ఆ రెండు 'ప్రోనోటు' లను జేబులో పెట్టుకొని ఇల్లు చేరుతాడు. తీరా, ఆ ప్రోనోట్లను నానను ఇమ్మని అడిగినప్పుడు, వెయ్యి రూపాయల బాండును ఊరకే ఇమ్మనడం భావ్యం కాదనీ, ఇంకనూ కాస్త మొండిఘటాలుగ ఉంటే కోర్టుకెక్కుతానని బెదరించి చాకచక్యంగా నరసయ్య తన ఫీజు గుంజుకుంటాడు—

అయితే నమ్మకం పెట్టుబడిగా యిలాంటి వ్యాపారం ఎన్నాళ్లు సాగుతుందన్న సందేహం కలగడం అసమంజసము గాదు. అనవసరము గాదు—ఆ గ్రామాల్లో సాధారణంగా జరుగుతూండే కీచులాటల తీర్పులో 'తప్పు' అని నిర్ణయించబడ్డ పక్షంనుండి తప్పురూపంతో వసూలుచేయబడ్డ 'పైకంతో' నరసయ్య 'కోటకోటమ్మ' తిరుణాలు వైభవోపేతంగా జరిపి తనకు మించిన దైవభక్తిపరుడుగానీ, దానకర్ణుడుగానీ లేడనిపించుకుంటాడు. అంతకూ ఎవరైనా ఎదురుతిరిగితే ఆ మరుసటిరోజు నుండి నరసయ్య ఇంటిలో ఇనప్పెట్టె తలుపు వేసింది వేసినట్లుగానే ఉంటుంది! ఏదో 'నోటికి చేతికి' గా బ్రతుకుతున్న ఆ పల్లెల్లో ప్రజలు తమ అవసరాల పోరు పడలేక కిక్కురుమనకుండా అన్నీ భరిస్తూంటారు. ఇలా 'సాంఘిక సేవ'లో మునిగి తేలుతున్న నరసయ్యను పొలంపనుల్లో ఆదుకోవడానికిగాను, నాగరత్నమ్మ ముకుందయ్యకు తన యింటిలో ఆశ్రయమిచ్చింది.

ముకుందయ్యకు కండబలం, తండ్రి సజీవుడై ఉన్నప్పుడు చదివించిన 'అరా కొరా' చదువు మినహా ఎలాంటి బలమూ, బంధమూ లేదు. అందువల్ల ఆ అసహాయుణ్ణి ఆదరించి అతని కండబలాన్ని సద్వినియోగపరచుకొందామన్న సదుద్దేశముతోనే నాగరత్నమ్మ తమ్ముణ్ణి ఆహ్వానించింది. ముకుందయ్యకూడ దారీ తెన్నూ లేని తన ఓటి జీవితానికి దారి చూపిస్తున్న అప్పచెల్లెమాట కాదనలేకుండా ఆమెయిల్లు చేరాడు. 'బావమరిది బ్రతుకగోరుతాడు' అన్న నానుడి అడుగుజాడల్లో నడుస్తూ తనవని

తాను చేసుకపోతున్నాడు. ఇప్పుడు పొలం పనులు కాస్త చురుగ్గా సాగుతున్నాయి. ఆదాయం కూడ అంతకంత వృద్ధి అవుతూంది. ఈ పరిణామంతో నరసయ్యకు పనుల ఒత్తిడి పరిమాణం కాస్త తగ్గినట్లనిపించి, కాసేపు నిలబడి కారణాన్ని ఆలోచించవలసి వచ్చింది. ఎప్పుడు తింటాడో ఎప్పుడు నిద్రపోతాడో తెలియకుండా తన పని తాను చేసుకపోయే ముకుందయ్య కనులముందు మెదిలాడు. ఆతన్ని చూస్తూనే నరసయ్య మనస్సులో ఒక ఆలోచన పుట్టింది. వెంటనే 'ఒసేవ్ నాగులూ !'' అంటూ ఒక గావుకేక పెట్టాడు

చెమట తుడుచుకోబోతే అంటుకున్న మసి, చెమటతో కలిసిన నుదుటి కుంకుమ మొగాని కొక వికృతాకృతి నిస్తే, తలమీద నిండిన రాగి పిండితో వెంట్రుకలు నెరసినట్లనిపించి ముసలి తనాన్ని ముందుబెట్టుతూంటే, పైట చెరగు తీసి నడుముకు చెక్కి, సంకటి ముద్దలు చేస్తూం డిన నాగరత్నమ్మ 'ఎందుకండి ? అలా అరుస్తున్నారు !' అంటూ ఉన్న పళంగా వచ్చి ఎదుట నిలబడింది.

''నాగరత్నం యిలా మసిమసిలో పొర్లాడడం నాకేమీ ఇష్టంలేదే ? .... అందుకే ఒక చక్కటి ఆలోచన ......''

''ఓయబ్బ ! ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు ? .... ఇంతకూ ఏమిటో ఆ ఆలోచన !''

నరసయ్య నోటమాట నోట్లో ఉండగానే ఎదురు ప్రశ్నను సరసంగా సాగదీసింది నాగ రత్నమ్మ.

''చూడు నాగులూ ! ముకుందయ్య రావ డంతో నాకేదో కాస్త తెలుపి చిక్కినట్లని పిస్తూంది. వాడికిగూడ ముప్పైఏండ్లు నెత్తి కెక్కాయి. వాణ్ణి ఒక యింటివాణ్ణి చేస్తే ....''

''సవతిపోరులాంటిది ఒకటి నా కుంటుం దంటారు !''

''ఛ ! ఏమిటే ! నువ్వా నీ మాటలూ ! .... నీ అడుగులకు మడుగులొత్తే అమ్మాయిని చూసే ఉంచాను. నువ్వు ఊఁ ! అంటే చాలు ! ఆమీదట నీకు 'సూపర్వైజరు' ప్రమోషను ఖాయం !''

ఓ చిరునవ్వుతో కనుబొమ ఎగురవేశాడు నరసయ్య !

''అదేదో మీ యిష్టప్రకారం కానీయండి. వలక మీద సంకటి ఆరిపోయిందంటే కూలీలు మొత్తు కుంటారు.'' అంటూ నాగరత్నమ్మ వెళ్ళిపోయింది. ఆమీదట ఒక శుభముహూర్తాన నరసయ్య ఇంటి కూటమి వివాహవేదికగా అలంకరింపబడితే ముకుం దయ్య రామలక్ష్మమ్మ ఆలూ మగలుగా అయి పోయారు.

కాలప్రవాహం సాఫీగా సాగిపోతే వక్రగతుల ఆరోపణకు భగవత్స్వరూపాన్ని గురించి ఆలో చించే అవసరము ఉండేదే గాదేమో ! ఒకనాడు మిట్టమధ్యాహ్నం. నిప్పులు చెరిగినట్లుంది ఎండ ధాటి. మధ్యవర్తిత్వం నిర్వహించిన ప్రక్కన పల్లె నుండి ఒంటరిగా వస్తున్నాడు నరసయ్య. తని గట్టుమీక వచ్చినట్లు ఎక్కడనుండి వచ్చిందో 'సుడిగాలి' 'రివ్వు' మని వచ్చి అతనిని చుట్టి వేసింది. ఊపిరి సలుపుకోలేక, ఆ వడగాలి దెబ్బకు హడలి తలతిరిగి పడిపోయాడు.

స్పృహవచ్చి చూసేసరికి నరసయ్య తన ఇంటిలో మంచంమీద పడుకొని ఉన్నాడు. పెల్లు బికివస్తున్న దుఃఖాన్ని దిగమింగుకొంటూ నాగ రత్నమ్మ విసనకర్రతో మెల్లగా విసరుతూంది. అయిదేండ్ల పసివాడు మోహనరంగం తల్లి ప్రక్కన నిలబడి వెర్రిచూపులు చూస్తున్నాడు. భూతవైద్యుడు 'శిపాటి వెంకటరెడ్డి' చేతిలో వేప మండ గాలిలో ఎడతెరపిలేకుండా గిరికీలు కొట్టు తూంది. ముకుందయ్య కాలుగాలిన పిల్లిలా తిరుగుతూ గ్రామాంతరం వెళ్ళిన నాటువైద్యుని కోసం తపన పడుతున్నాడు. తలుపు చాటుగా నిల బడిన రామలక్ష్మమ్మ పైటచెరగులో కంటి తడి ఒత్తుకొంటూ వచ్చి 'ఎర్రనీళ్ళు' తీసి మూడు త్రోవలు కలిసేచోట పార జల్లడానికిగాను వెళ్ళి పోయింది ఏదో 'గాలి'సోకిందిలే అని కొంద రంటే 'పాపం పండిందని' గుండెధైర్యంలేని కొందరు గోడచాటుగా గుసగుసలాడారు. ఎలా గయితే నేం , నరసయ్య మామూలుమనిషి కావడానికి పది రోజులు పట్టింది. మామూలు మనిషి అయితే అయ్యాడు కానీ, అతనిలో ఈ 'చిన్నె'మాత్రం మామూలు అయిపోయింది. ఉన్నట్లుండి, పడిపోవడం, నోరు బిగుసుకుపోయి నురుగులు గ్రక్కడం, కాళ్ళు చేతులు విలవిలా కొట్టుకోవడం, ఓ అరగంటకాలం ఇలా గుంజా కొని తన్నుకొని మరలా మామూలు స్థితికి రావడం తరచు జరుగుతూండేది. రకరకాల నాటు మందులు, ఇంగ్లీషుమందులు ఆపజయాన్ని అంగీకరించేసరికి కారణాన్ని కర్మమీదికి త్రోసి 'మూర్ఛ' అని నామకరణం చేశారు వైద్యులు !

ఈ దెబ్బతో నరసయ్య బాగా దిగులుపడి పోయాడు. తనజీవితాని కిక నిష్కృతి లేదని బాధపడ్డాడు. తెలివితేటలన్నీ ఖర్చయిపోయినట్లు తలంచి మానసికంగా ముసలివాడై పోయాడు. అందువల్ల అతని జీవితవిధానమే మారిపోయింది. ఇంటిలో ఒక మూల కూర్చుని ''ఆధ్యాత్మిక' చింత లోనే అలసిపోతాడు. కాలు కదిపి బయటరాడు. ఆశావాదం నశించి, నిరాశావాదం తలకెక్కి, ఏక్షణం ఎటుంటుందో అన్నభ్రాంతిలో పడి పోయాడు. అందుకే బాగా ఆలోచించి గ్రామ కరణాన్ని పిలిపించి తన ఆస్తిపాస్తుల విషయం తగిన కట్టుదిట్టంచేసి ఉంచాడు. ఈ విషయం తనకూ కరణానికీ మినహా ఎవ్వరికీ తెలియనీయ లేదు.

తరువాత దొర్లిపోయిన ఆరుసంవత్సరాలలో చెప్పుకోదగ్గ విశేషాలకు చోటులేదు. అది వైశాఖమాసం. రైతులు పనులు ఒడిసి వసంత లక్ష్మి శీతలచ్ఛాయల్లో కథాశ్రవణం చేసుకొనే కాలం. ఆవీడు కూడ 'నల్ల వెంగనపల్లెలో' మహా భారత ఉత్సవం జరుగుతూంది. మిట్టమధ్యాహ్నం చల్లని పందిరిక్రింద 'పగటి కథ' వింటూ రాత్రి 'వీథి భాగవతంతో' ఆ చుట్టుప్రక్కల పల్లెల్లో ప్రజలు ఓ పదిహేను రోజులు పండుగలా గడుపుకొంటారు. ఆనాటి రాత్రి బకా సురవధ ! బకాసురుడివేషం కట్టే వటుడు

# నచ్చిన భాగం

కాలికి గజ్జె కడితే దుమ్ము జ్ఞానెడెత్తు తేస్తాం దని విని ముకుందయ్య రాగిపైరుకు, మిరప తోటకు పెందలాడే నీళ్ళు తోడి సేద్యగాళ్ళతో కలిసి నాటకాని కెళ్ళాడు. ఆట ముగిసేసరికి చుక్క నడిమిట్ట కెక్కింది. తిరిగి ఇళ్ళు చేరేసరికి తొలి కోడి కూసింది. ఒక్క నిద్ర తీసి ఆపైన కపిల కట్టడా మనుకొన్నాడు. పగలంతా కష్టపడటం, రాత్రి నిద్రగాయడం, అలా పడుకొన్నాడో లేదో నిద్ర ముంచుకొచ్చింది.

"అయ్యో! ఇక నా గతేవి కానురా! తండ్రీ!" అన్న పిడుగులాంటి ఆర్తనాదం తట్టి లేపినట్లని పించి ఎగిరిపడి లేచాడు ముకుందయ్య. నాగరత్నమ్మ 'అబోదిబో' అని మొత్తుకొంటూ పరుగెత్తుతూంది. తూరుపున పటమొగిరింది. అప్పు డప్పుడే నిద్రలేచి కన్నులు నులుపుకొంటున్న కొంతమంది 'ఏమి జరిగిందంటే ? .... ఏమి జరిగిం దంటూ' నాగరత్నమ్మ వెంటబడ్డారు. ముకుందయ్యకూడా పిచ్చివాడిలా వారి ననుస రించాడు. ఊరి గెవిన్లో ఎదురుపడ్డ దృశ్యాన్ని చూచి నిర్ఘాంతపోవడమేమిటి ? .... నిలువునా కూలిపోయాడు !

నీళ్లోడుతున్న నరసయ్య శవాన్ని మోను కొస్తున్నారు కొంతమంది !

ఆవేళ మరికోడి కూయడంతో భగవద్గీతా పారాయణార్థం నరసయ్య నిద్ర లేచేసరికి మొట్ట మొదట ఆహ్వానం పలికింది ముకుందయ్య, సేద్ర గాళ్ల ఒళ్లతెలియకుండా నిద్రపోతూ పెడు తున్న గురక. అది వినేసరికి అతనికి చిర్రెత్తు కొచ్చింది. కాలికొద్దీ తిరుగుతున్న మనిషి ఈమధ్య కదలకుండా కూర్చునేసరికి ఈ గుణం కూడ కాస్త బయటపడింది.

"కూలిసేద్యపు ఎదవలు .... లేకుంటే తెల్లారి పొయ్యేదాకా ఒళ్ళు తెలియకుండా ఇలా నిద్ర పోతారా ?' అని ననుక్కుంటూ ఎద్దుల విప్పాడు. వాళ్ల కొక గుణపాఠం నేర్పుదామని పోయి 'కపిల' కట్టాడు. కానీ పరిస్థితులు అతనికే "వల్లమాలిన పని చేయవద్దు !" అన్న గుణపాఠాన్ని నేర్పాయి. వాడుకలేని పని ! తప్పుమోకు పడడం, ఎద్దులు వెనక్కు రావడం, మోట విరిగి కుప్పగ బావిలో కూలిపోవడం క్షణాల్లో జరిగిపోయింది. చుట్టు ప్రక్కల కపిలతోలుకుంటూండినవాళ్లు వచ్చే సరికి నరసయ్య ప్రాణాలు గంగలో కలిసి పొయ్యాయి !

ఆ తరువాత నరసయ్య కుటుంబ పరిస్థితులు వసంతఋతువునుంచి ఒక్కసారిగా గ్రీష్మంలో అడుగు పెట్టాయి. నాగరత్నమ్మ ఏమీ పట్టించు కొనేది గాదు. ఆ యింటిలో ఓ మూల కూర్చుని 'కుమిలి కుమిలి' ఏడుస్తూండేది. ఆ సంవత్సరమే మోహనరంగం ఆ ఊళ్ళోని హయ్యరు ఎలి మెంటరీ స్కూల్లో ఎనిమిదవతరగతి పాస య్యాడు. బాకీలవసూళ్లు కూడ ఎక్కడి వక్కడ నిలిచిపొయ్యాయి.

"చూడు చెల్లెమ్మా! బావ మనలని నడి సముద్రములో విడిచిపోయాడు. నన్నొక మని షిగా నిలబెట్టిన ఆయనకోసం నేనెంత పరిత పిస్తున్నానో ...."

**ఒక్క దీర్ఘనిశ్వాసతో అర్ధనిమీలిత నేత్రుడయ్యాడు** ముకుందయ్య. నాగరత్నమ్మ కనుకొలకుల్లో కన్నీళ్లు సుడులు తిరిగాయి.

"....అయినా మనమిలా దిగజారిపోతే ఎలాగమ్మా ?.... గుండె దిటవుచేసుకుని ఈ సంసార నౌకను గట్టెక్కిస్తే స్వర్గంలో ఉన్న బావ మనస్సు కుదటపడుతుంది."

ఒకనాడు నాగరత్నమ్మ ఎదుట తన మనోభావాన్ని వ్యక్తం చేశాడు ముకుందయ్య.

"అయితే నన్నేం చేయమంటా వన్నయ్యా ?"

"చూడమ్మా ! పిల్లవాణ్ణి పై చదువులకు పంపాలి. ఇనప్పెట్టెలోని డబ్బుతో సహా 'బాండ్లు' గూడ చిలుం పట్టిపోతున్నాయి. అప్పుకోసం లెక్కలేనంతమంది ఇంటిచుట్టూ తిరుగుతున్నారు. పెట్టె పెట్టి పూజచేస్తూంటే ఏమొస్తుంది ?.... నీ ఆసరాతో ఈ సంసారాన్ని కాస్త ముందుకు లాగుదామనుకొంటే నువ్విలా మూల కూర్చుంటే ఎలాగమ్మా ?"

"అన్నయ్యా ! నా మనస్సేమీ బాగుండడం లేదు. అందులో లెక్కలుతెలిసిన శక్తిలాంటి దానిని. ఇక నాకుమాత్రం ఎవరున్నారు ? .... ఆ చేసేదేదో నువ్వే చేయరాదూ !" అంటూ తాళాలగుత్తిని ముకుందయ్య చేతిలోపెట్టింది నాగరత్నమ్మ. 'అంతా ఆ ఏడుకొండలవాడి దయ'! అంటూ తాళాలగుత్తితోపాటు ఆ యింటి పెద్దరికాన్ని కూడ స్వీకరించిన ముకుందయ్య శక్తి వంచనలేకుండా తన బావకుటుంబానికి సేవ చేయాలనుకున్నాడు. కానీ .... ఆశ చెడ్డది ! ఓ యబ్బో ! దాని గాలి సోకకుండా ఉండాలేగాని, సోకిందంటే అది 'కోతిపుండు' లా ప్రాకిపోతుంది. అటో, ఇటో తేలేవరకు మనిషిని ఒక్కరాగాన వదలిపెట్టదు. ఆ రాత్రి ముకుందయ్య ఇనప్పెట్టెముందర కూర్చుని అందులోని 'ప్రోనోట్ల' ను ఒక్కొక్కటిగ తీసి 'ఎవరెవరి దగ్గరనుండి ఎంతెంత రావాలి ? ఏ బాండుకు వాయిదా పోతుంది ? ఎందులో చెల్లు వ్రాయించాలి ?—అని చూసుకొంటూండి, ఉన్నట్లుండి విభ్రాంతుడై పోయాడు. కలా ? నిజమా ?—అని కలవరపడ్డాడు. ఒక్కసారి ఏనుగు లెక్కినంత సంతోషముతోపాటు పాతాళానికి క్రుంగినంతటి అనుమానము కలిగాయి. సంతోష సంభ్రమాలతోనేమో శరీరము 'గడగడ' లాడుతూంటే, అతనిచేత పడ్డాననేమో చేతిలోని కాగితము 'రెపరెప' లాడుతూంది. కొడిగట్టిన కిరసనాయిలు దీపం మనగ్గా వెలుగుతూంటే వత్తిని కాస్త పెద్దదిచేసి మరలా మరలా చదివాడు ముకుందయ్య. తాను పొరపాటుపడలేదు. అది తన బావ స్వహస్తాలతో వ్రాసి ఉంచిన వీలునామా ! దాన్ని ఒక్కసారి నోరార చదువుకొందామని మనస్సయితే ఉబలాటపడిందికాని, గోడలకు కూడ చెవులుంటాయని, అంతరాత్మ హెచ్చరించింది. అంతటితో ముకుందయ్య ఆ వీలునామాను ఇనప్పెట్టెలో భద్రపరచి పోయి పడుకొన్నాడు. మెత్తని పరుపుమీద తీయటి కలలతో భవితవ్యం ఓ సుందరనందనోద్యానంలా ప్రత్యక్షమైతే ముకుందయ్య అందులో తనివిదీర విహరించి అలసి సొలసి అలాపే నిదురపోయాడు.

(సశేషం)

---

# మనము-మనదేహస్థితి

31వ పేజీ తరువాయి

రేణువు ఉన్నందున అది గాజులాగా ఉండక మసకగా ఉంటుంది.

జీవకణం గుజ్జులో, న్యూక్లియస్ అనే విశిష్టమైన భాగము ఉన్నది. జీవకణముకు పైపొర ఉన్నట్లే ఈ న్యూక్లియస్‌నూ కమ్మి ఒక పొర ఉంటుంది. ఈ పొరలోనూ రెండు మడతలు ఉంటవి. న్యూక్లియస్, జీవకణం మధ్యలో ఉండాలని లేదు. సాధారణంగా జీవకణ మధ్యలోనే యిది ఉంటుంది. కొన్ని జీవకణములలో ఒక మూలగా ఉంటుంది. న్యూక్లియస్‌లోనూ ఒక గుజ్జు వంటి పదార్థము ( Neucleoplasm ) ఉన్నది. అందులోనూ నిర్మలమైన పై భాగము రేణుసహితమైన లోపలి భాగమూ ఉంటవి.

న్యూక్లియస్‌మీది పొర నిర్వహించే ధర్మములూ, జీవకణం పైపొర నిర్వహించే ధర్మములూ ఒకటే. దీనిలోనూ రంధ్రములు ఉంటవి. అయితే వీటి సైజు కొంచెం పెద్దదిగా ఉంటుంది.

జీవకణం గుజ్జులో న్యూక్లియస్‌ను అంటి సెంట్రోజోమ్, ( Centrosome ) అనే భాగం ఉన్నది. 'సెంట్రో' అంటే మధ్యగా ఉన్న "సోమా" అంటే శరీరం. జీవకణం మధ్యలో ఉన్నందున దీని కాపేరు వచ్చింది. ఇది అన్ని రకములయిన జీవకణములలోనూ కనుపించదు. కాని యిది లేని జీవకణములు చాలా అరుదు. ఈ సెంట్రోజోమ్ గుజ్జులో, బిందువులవంటి రెండు నిర్మితులు ఉన్నవి. వీటిని సెంట్రియోలులు ( Centrioles ) అంటారు. ఇవి జీవకణము రెండుగా విడిపోతున్నప్పుడు ప్రధానపాత్ర నిర్వహిస్తవి.

సెంట్రోజోమునూ న్యూక్లియస్‌నూ అనుసరించి ఒక వలవంటి నిర్మితి ఉన్నది. దానిని గాల్గి అనే శాస్త్రజ్ఞుడు కనిపెట్టేడు. ఈ నిర్మితి ధర్మములను గురించి శాస్త్రజ్ఞులలోనే భేదాభిప్రాయం ఉన్నది. కాని జీవకణములో నరముల శాఖలు కనుపించవు. అయినా జీవకణము కార్యక్రమం అంతా మెదడునుంచి వచ్చే ఆదేశములవల్లనే జరుగుతుంది. ఈ గాల్గి నిర్మితి ఒక నిస్తంత్రీ కేంద్రంవంటిది కావచ్చును.

జీవకణం గుజ్జులో నలుసులలాగా, తీగె ముక్కలలాగా, దూదిపింజెలలాగా, కొన్ని నిర్మితులు కనుపిస్తవి. ఇందులో పెద్దవి బుడగలలాగా ఉంటవి. ఈ నిర్మితులను మైటోకాండ్రియా అంటారు. జీవకణంలో వస్తువులు ఆక్సిజన్ సంపర్కంతో దహనమై శక్తి పుడుతుంది. ఆహారం రూపుమారి, కొత్త జీవవస్తువు తయారవుతుంది. కొన్ని భాగములు, జీవకణ విభజనకు సంబంధించిన యితర నిర్మితులను తయారుచేస్తవి. ఇల్లా జీవకణంలో సృష్టి, స్థితీ, లయమూ అనే మూడూ దాని జీవితకాలంలో కనుపిస్తూనే ఉంటవి. పైన వర్ణించిన గాల్గి నిర్మితినుండే, మెదడు ఆదేశంవలన జీవకణ కార్యక్రమానికి అవసరమైన సూక్ష్మాకృతి సూక్ష్మ భాగములు తయారవుతవని కొందరు శాస్త్రజ్ఞుల విశ్వాసం. మైటోకాండ్రియా సృష్టికీ, గాల్గి నిర్మితే కారణం కావచ్చును ఈ మైటోకాండ్రియాలోనే, జీవకణంలో జరిగే పనుల నన్నింటినీ జరిపించగల ఎంజయిములు ఉత్పత్తి అవుతవి. మైటోకాండ్రియా, జీవకణం గుజ్జులో అధికంగా కనుపిస్తవి. మైటోకాండ్రియా న్యూక్లియో ప్రోటీనులతోనూ ఫాస్ఫొలైపిడ్లతోనూ ఏర్పడతవి. ప్రాణధారణకు కొన్ని ప్రొటీను విశేషములు అవసరమైనట్లే, ప్రాణసంచలనానికి భాస్వరముతోకలిసిన కొవ్వు వస్తువులు (ఫాస్ఫొలైపిడ్లు) అవసరమని తోస్తుంది. భాస్వరం నీటిలో ఉన్నప్పుడే నెమ్మదిగా ఉంటుంది. దానికి ఆక్సిజన్ తగంగానే అది దహనమై అగ్ని పుడుతుంది. ఎంత ధాతు దహనం జరగాలో, అందుకు ఎంత ఆక్సిజన్ జీవకణంలోకి పోవాలో, ఎంత అగ్ని పుట్టాలో, అందువల్ల ఉత్పత్తి అయిన శక్తిలో ఎంతభాగము ధాతు పునర్నిర్మాణానికి వినియోగించాలో నిర్ణయించేది జీవకణంలో ఉండే ప్రాణశక్తి.

జీవకణం గుజ్జులో న్యూక్లియస్ ఉంటుందని, ఇదివరకే తెలుసుకున్నాము. జీవకణం ఒక సపోటాపండుతో పోలిస్తే న్యూక్లియస్‌ను దాని గింజతో పోల్చవచ్చును. అయితే న్యూక్లియస్ ఆ గింజ అంత కఠినంగా ఉండదు

న్యూక్లియస్ గుజ్జులో క్రొమేటిడ్ అనే వస్తువుతో తయారయిన పీచుకగూడువంటి నిర్మితి ఉన్నది. 'క్రోమా' అన్న గ్రీకుమాటకు 'రంగు' అని అర్థము. రంగు ఉన్నది గనుక దాని కాపేరు వచ్చింది. ఈ క్రోమేటిన్ కూడా ఒక రకమయిన న్యూక్లియో ప్రొటీనే. జీవకణం రెండుగా విభజనపొందుతున్నప్పుడు ఈ క్రొమేటిన్ వల, ముక్కలు ముక్కలుగా విడిపోయి, తీగె ముక్కలవంటి నిర్మితులుగా మారిపోతుంది. ఆ క్రొమేటిన్ ముక్కలను "క్రోమోజోము" లు (Chromosomes) అంటారు. 'క్రోమా' అంటే రంగు, 'సోమా' అంటే శరీరం. వర్ణంతో కూడుకున్న శరీరం కలవి గనక వాటి కాపేరు వచ్చింది. జీవకణం పునరుత్పత్తి కార్యక్రమంలో (Reproductory function) ఈ క్రోమోజోములు ప్రధానపాత్ర నిర్వహిస్తవి. ఈ క్రోమోజోములలో 'జెనీలు' అనే సూక్ష్మనిర్మితులు ఉంటవి. జీవకణంలో ఉండే సూక్ష్మనిర్మితు లన్నింటిలోకీ యివి అత్యంత సూక్ష్మములైనవి. ఇవి క్రోమోజోములలో నిలువు క్రమంలో అమరి ఉంటవి. ఆ క్రమంలో వాటి స్థానాన్ని అనుసరించి ఆజెనీవిధి ఏర్పడి ఉంటుంది. స్త్రీశరీరంలో జీవకణం విభజన పొందుతున్నప్పుడు, ఆ విభజనలో ఒకదశలో, ఒకరకమయిన క్రొమేటిన్ ఖండం ప్రత్యేకంగా కనుపిస్తుంది. దానిని సెక్సు క్రొమేటిన్ అంటారు. సెక్సు అన్నమాట 'సెక్సె' (Sexe) అన్న ఫ్రెంచిమాటనుంచి వచ్చింది. 'రెండు కావడం' అని ఆమాటకు అర్థం. ఇటువంటి

ప్రత్యేక క్రోమోజోన్ పురుషునిలో జీవకణములు విడివడుతున్నప్పుడూ కనిపిస్తుంది. కాని స్త్రీ సెక్సు క్రోమోజోన్‌కంటె ఇది చాలా రెట్లు చిన్నదిగా ఉంటుంది. ఈ వ్యత్యాసమే శుక్ల శోణిత కణముల మధ్య ఉంటుంది. లింగభేదం ఏర్పడ్డతరువాత ఆ భేద చిహ్నములు ప్రతి జీవాణువులోనూ ఏర్పడతవన్నమాట!

క్రోమోజోములలో జెనీలు (Genes) అనే సూక్ష్మాతిసూక్ష్మ నిర్మితు లుంటవని చెప్పేను. పైతృక లక్షణములన్నీ ఈ జెనీలవల్లనే ఏర్పడత వని శాస్త్రజ్ఞులు నిర్ణయించేరు. ఈ జెనీ శరీరం అంతా ఒక న్యూక్లియో ప్రోటీన్ ప్రభేదం కణములతో ఏర్పడుతుంది. (Desoxy Pentose Newcleo protein). క్రోమోజోములు సాధారణంగా 24 జతలుగా ఏర్పడతవి. అందులో జెనీ స్థానమును బట్టీ, దాని శరీరంలో ఉన్న ప్రోటీన్ రసాయనిక స్వభావమునుబట్టీ దాని విధులు ఆధారపడతవి. అంటే అన్ని జెనీల శరీరంలోనూ ఒకే ప్రోటీను విభేదం ఉన్నా ఆ కణం నిర్మితి ఒకేలాగా ఉండదు. అందులో ఇతర వస్తుకణము లుండవచ్చును. జీవకణంలో ప్రాణశక్తి కేంద్రస్థానములుగా ఈ జెనీలను భావించ వచ్చును. జీవకణంలో జరిగే కార్యక్రమము నంత టినీ శాసించేవి, నిర్ణయించేవీ యీ జెనీలే. ఇవి అనేకములుగా ఉండడం గమనించదగ్గది.

న్యూక్లియస్‌లో న్యూక్లియోలస్ (Newcleolus) అనే నిర్మితి వున్నది. కొన్ని జీవకణములలో రెండు న్యూక్లియోలసులు వుంటవి. జీవకణమునూ, న్యూక్లియస్‌నూ, వాటిపొరలు చుట్టి ఉన్నట్లే న్యూక్లియోలస్‌ను కూడా ఒకపొర చుట్టి ఉంటుంది. దాంట్లోనూ రెండు మడతలున్నవేమో ప్రస్తుతం ఉన్న దుర్భిణీలవల్ల తేలలేదు. ఈ న్యూక్లియోలస్‌లో, ఫాస్ఫో ప్రోటీన్, రిబోన్యూక్లియస్ ఏసిడ్ అనే పదార్థములున్నవి. వీటి కలయికతో రిబోజ్ న్యూక్లియో ప్రోటీన్ అనే ప్రోటీను విశేషము తయారవుతుంది. జెనీలలోవుండే న్యూక్లియో ప్రోటీనుకూ, ఈ న్యూక్లియోలస్‌లో వుండే ప్రోటీన్ ప్రభేదానికి, క్రోమేటన్‌లో వుండే ప్రోటీన్ ప్రభేదానికి రసాయనికంగా భేదములున్నవి. ఈ ప్రోటీన్ ప్రభేదములన్నీ న్యూక్లియస్‌లో కేంద్రీకరించివున్నా, ఇవి తయారవుతూన్నవి గావో తయారయినవిగానో జీవకణం గుజ్జులో కనుపి స్తూనేవుంటవి. వీటినిర్మాణమును జెనీలు శాసి స్తావి. కాని జెనీలు వీటినుండే తయారవుతవి. జీవ కణంలోనుంచి న్యూక్లియస్‌ను తీసివేస్తే జీవకణం గుజ్జులో ఈ (రిబోజ్ న్యూక్లియో ప్రోటీన్) ప్రోటీన్ ప్రభేదం శీఘ్రంగా అంతరించి పోతుంది. ఆహారపదార్థముల నుంచి, జీవకణంగుజ్జులో, ఈ ప్రోటీను ప్రభేదములు యేర్పడడానికి అవసర మయిన ఎంజయిములను, జెనీలు తయారుచేసి, జీవకణం గుజ్జులోకి వదులుతవి. కాని ఈజెనీలు ఎల్లా తయారయినవి? జెనీ యేర్పడ్డ తరవాత దాని చుట్టూ ఇతర పదార్థములు చేరి జీవకణం తయారయినదా? జీవకణంనుండి, జెనీ అనే విశిష్ట పదార్థం తయారయిందా? అన్నవిషయం ప్రకృతి ముందా? పురుషుడు ముందా? అన్న వేదాంత సమస్య లాగే నిర్ణయించడానికి వీలులేదు. కాని జెనీ

# మనము-మన దేహస్థితి

వైరస్‌లాంటిదనీ, దానినుండే, జీవకణం ఉత్పత్తి అయిందనీ ఊహిస్తే, ఆక్షేపణ యేమీకనుపించదు. ఒకమాటు జెనీ అన్నది ఏర్పడితే, దానినుండి, ఇతర జీవకణభాగములన్నీ ఆయా రసాయనిక స్వరూప ములతో వాటికి తగిన విధులతో ఏర్పడడం సాధ్యం. ఇది కేవలం జీవశాస్త్రానికి సంబంధించిన విషయంమాత్రమే కాదు. ఇక్కడ గమనించవలసిన ముఖ్యవిషయములు రెండు. జీవశక్తిధారణకూ ప్రసరణకూ పునరుత్పత్తికీ, కారణభూతమయిన ప్రాణశక్తి, నైట్రోజన్, హైడ్రోజన్, ఆక్సిజన్, కార్బన్, మరికొన్ని వస్తువులతో కలిసి, ఏర్పడిన ఒక విశిష్టమైన రసాయనికద్రవ్యం అవసరం. అదే ప్రోటీను. దానిని ఆశ్రయించిగాని ప్రాణశక్తి నిలవలేదు. నైట్రోజనును శాస్త్రవాచక రచయితలు 'నత్రజని' అన్నారు. శబ్దసామ్యమును బట్టి వారల్లా అన్నా దాన్ని న + త్ర + జని నాత్ర జని అంటే మరొకదానివల్ల పుట్టనిది అనే సంస్కృత భాషపరమైన అర్థం వస్తుంది. ప్రాణి కవసరము లయినవన్నీ పైనాలుగు ముఖ్య మూలవస్తువుల కలయికతో ఏర్పడేవే. ప్రకృతిలో వుండే స్థూల రూపంలో బొగ్గు (కార్బను) ఆక్సిజను సంపర్కంతో దహనముకాదు. కాని కార్బనుతో ఏర్పడిన సంయుక్త ద్రవ్యములు, శరీరంలో ప్రాణవాయుసంపర్కంతో దహనమౌతవి. ఎందువల్ల? అక్కడ వాటి స్వరూపం వేరు. ఆక్సిజన్ సంపర్కం జరగగానే, భాస్వరము (Phosphorus) తానుగానే విస్ఫోటుకుం టుంది. ఈభాస్వరము, ప్రోటీనుతోనూ, కొవ్వు తోనూ చేరి యేర్పడిన వస్తువులు జీవకణంలో విరివిగా వుండడం గమనించ దగ్గ విషయం. ఇంతకీ చెప్పవచ్చిం దేమిటంటే, ఒకరకమయిన రసాయినిక స్వరూపంగల వస్తువును ఆశ్రయించిగాని ప్రాణ శక్తి ఉండలేదు. అటువంటి రసాయనిక స్వభావము గల వస్తువును నిర్మించినా అందులో ప్రాణశక్తి ఆవహిస్తుందా? ఆహారపదార్థములు మారి జీవ కణంలోకిపోయి అక్కడ అవి మళ్లీ మారి, జెనీలో వుండే ప్రోటీను విశేషము యేర్పడుతున్నది. ఈ మార్పులు చేయించేది జెనీలు. విశిష్టవస్తువు యొక్క ఆవరణ, ఆశ్రయము లేకుండా ప్రాణశక్తి వేరుగా వుండగలదా? ఉంటే అదీ ఒక "స్థితిలో" వుండేవస్తువేనా? మరేదయినావా? ఈ విషయాన్ని గురించి తీవ్రంగా ఆలోచించినవారిలో కపిల మహర్షి అగ్రగణ్యుడు. అతను ప్రకృతీ పురుషుడు అనే రెండు మూలశక్తులున్నవన్నీ, ఆదిలో ప్రకృతి మూల ప్రకృతి అనిపించుకుంటుందనీ, అది స్థావరములూ, విభేదములులేనివి అయిన "తన్మాత్రలు" అనే సుకుమారతరములయిన సూక్ష్మకణముల సమూహమనీ ఊహించాడు. అయితే తన్మాత్ర 'వైరస్'లాగా ప్రాణశక్తి ఆవ హించిన వస్తువుఅందమా? ప్రాణశక్తి తన్మాత్ర లోపల ఉంటుందా? లేక తన్మాత్రల మధ్యఉండే పదార్థంలో ఉంటుందా? తన్మాత్ర మధ్యప్రదేశం శూన్యమా? పదార్థసహితమా? విభేదములు లేని తన్మాత్రలలో ఆదివిభేదం ఎల్లా ఏర్పడింది. ఏశక్తి ప్రేరేపణవల్ల అది ఏర్పడుతున్నది? మూలం ప్రకృతియొక్క స్థావర స్థితి? ఆ భేద స్థితి నెటి

లియో, న్యూటన్‌వంటి శాస్త్రజ్ఞులు ఊహించిన 'ఇనెర్షియా' (తనుగా కదలలేని, తనుగా మారలేని స్వభావం) అనే వస్తు లక్షణానికి ఏమిటి భేదం? ఋషులు ఊహించిన జడత్వానికి ఇనెర్షియాకు పోలిక ఏమిటి?

పరిణతిపొందిన జీవులు కొన్ని ప్రోటీన్‌విశేష ములకు ఇతర జీవులమీద ఆధారపడ్డట్లే వైరస్‌లూ ఆధారపడతవా? లేక ప్రకృతిలో విడివిడిగా ఉన్న మూల వస్తువులనుండి తమ శరీరములను అవి ఏర్పరుచు కుంటవా? ఈ సంగతి ఇంకా తేలలేదు.

సూర్యరశ్మిలో ఎన్నిరకాల కిరణములున్నవో ఎవరికీ తెలియదు. కొన్నిరకాల కిరణములున్నవని మాత్రం తెలుసు. సూర్యుడు వైరస్‌లాగా ప్రాణియా లేక, వేడీ వెల్తురూ విరివిగావున్న ఒక అనూహ్య మయిన రసాయన వస్తుసమూహమా?

అణువిచ్ఛేదం వల్ల అనేక నూతన వాయువులు నూతన కిరణములు ఉద్భవిస్తున్నవి. అందులో ఎక్సురేవంటి కొన్ని రకాల కిరణములకు బేక్టీరియా వంటి క్రిములను సంహరించేశక్తి వున్నది. ఈ కిర ణముల క్రిమిసంహారకశక్తి వైరస్‌లనుకూడా సంహరించగలదా? ఏటంబాంబులు పరీక్షార్థం ప్రేల్చడం ఆరంభించిన తరువాత వైరస్‌వల్ల యేర్పడే వ్యాధులు ఖండాంతరవ్యాప్తిపొంది, అధిక సంఖ్యాకులను ఏకకాలంలో బాధించడం తరచు జరుగుతున్నది. ఇందుకు కారణం ఏమిటి? ఆ కిరణ ములు వైరస్‌లను ఏమీ చేయలేవని తేలిపోయింది.

అణువిచ్ఛేదనానంతరం, ప్రాచీన విజ్ఞానంమీద ఆధునికవిజ్ఞాన సంఘాతం అనేకరహస్యాలను బయటికి తెచ్చింది. నిష్పాక్షికమూ సత్యాన్వేషణ తత్ప రమూ అయిన వైజ్ఞానిక దృష్టితో, ఆధునిక విజ్ఞా నమునూ, ప్రాచీన మహర్షుల అభిప్రాయములనూ వాటి ననుసరించి అధిమానవ సృష్టికై, వారేర్పర చిన యోగసాధనలనూ పరిశీలించినవారికి వైజ్ఞా నిక పరిశోధనలద్వారా ప్రాచీన మహర్షుల అభిప్రాయ ములలోవున్న సత్యాసత్యనిర్ణయం చేయడం యెం తయినా అవసరమనే భావం కలుగుతుంది. పురాణ గాథలనుబట్టి మహర్షుల భావములను విమర్శించ డం తెలివి తక్కువ.

శరీరవిజ్ఞానానికి పునాది, శరీరాంతర్గతమైన జీవకణ విజ్ఞానం. అందులో సూక్ష్మాతిసూక్ష్మ మైన జెనీలోవుండే ప్రాణశక్తి స్వరూప స్వభా వములను తెలుసుకుని, ఎందుకది కొందరి జీవకణ ములలో కొన్నాళ్లే ఉంటుందో, ఎందుకు ఇత రులలో చాలాకాలం ఉంటుందో, ఎందుకు కొందరి జెనీలు పునరుత్పత్తి చేయగలవో ఎందుకు కొందరిలో చేయలేవో ఆలోచిస్తే, భౌతికవిజ్ఞానమనీ ఆధ్యా త్మికవిజ్ఞానమనీ వేరే లేవనీ ఒకటి పారంగతమయిన నాడు, అదీ ఇదీ ఒకటేనని తేలిపోతుంది. ఆ రహస్యం తెలుసుకునేంతవరకూ, ఎన్నిపెన్సిలిన్లు కనిపెట్టినా, ఎన్ని వైసిన్లు కనిపెట్టినా, రోగరహితమయిన, దుఃఖరహితమయిన, శాంతి సుందరమైన జీవి తాన్ని సాధించలేము. మరణాన్ని జయించడానికీ, మరణానంతరజీవితమును పరిశీలించడానికీ, మానవుడు చేసిన కృషి అపారము. అనంతము. అసంపూ ర్ణము. దానికి సంపూర్ణత అంటూ వుంటుందా? కాలమే నిర్ణయించాలి. 

# తెల్లవారింది

27-వ పేజీ తరువాయి

మాట్లాడకుండా బయటికి వెళ్ళిపోయాడు భాస్కరం.

మీనాక్షి, సుందరం చీట్లపేకతో కూర్చున్నారు. ఆటతోపాటుగా, విదేశాలను గురించి అక్కడి వారి అలవాట్లని గురించి, వాళ్ళ వివాహవ్యవస్థని గురించి, ఆ తరువాత తను చూసిన సిటీలలోని నాగరికతని గురించి అనర్గళంగా చెప్పుకుపోయాడు సుందరం.

"అవన్నీ చూడాలంటే అదృష్టం ఉండాలి. బావా" అంది మీనాక్షి.

సాయంత్రం ముగ్గురూ కలిసి కృష్ణానది ఒడ్డుకి వెళ్ళారు. ఇసుకలో నడవలేక నేను ఇక ఒక్క అడుగు వేయలేను బాబూ" అని కూర్చుండిపోయింది మీనాక్షి.

సరిగ్గా అప్పుడు ఒకసారి మంగినపూడి సముద్రానికి తామెళ్ళిన దృశ్యం గుర్తుకొచ్చింది. సుందరానికి—

"గుర్తుందా మీనాక్షీ—మనందరం మంగినపూడి సముద్రస్నానానికి పోయి మధ్యాహ్నం అలా పోయొస్తామని ఇసకలోపడి సముద్రం ఒడ్డు వెంబడే నడిచిపోయాం. కబుర్లలోపడి అలా ఎంత దూరం వెళ్ళామో తెలియలేదు. కాని, తిరిగి వస్తుంటే నువ్విలాగే "నడవలేను బావా" అంటూ చతికిలపడిపోయావు. అప్పుడు నిన్ను మేకపిల్లని ఎత్తుకున్నట్లు ఎత్తుకుని తీసుకువచ్చాను. అంతసేపు అలా ఉండి చివరికి అమ్మావాళ్ల దగ్గరకు రాగానే "ఇక దింపెయ్ బాబూ, నాకు సిగ్గేస్తోంది" అన్నావు."

"కాని ఇప్పుడు బరువు పెరిగాను తెలుసా ?" అంది మీనాక్షి నవ్వుతూ లేచి నిలబడి.

ఆ జవాబు సుందరానికి ఆశ్చర్యం కలిగించింది. ఏదో విజయం సాధించినట్లు ఆనందపడిపోయిందతని మనస్సు !

ఎవరో ఫ్రెండు కనబడితే మాట్లాడుతూ నిలబడిపోయిన భాస్కరం వచ్చి వాళ్ళని కలుసుకున్నాడు. ముగ్గురూ కలిసి నడక సాగించారు.

రాత్రి భోజనాలయ్యాక "నేను ఆఫీసుకు వెడుతున్నాను మీనాక్షి. మళ్ళీ రేపుదయమే రావడం. రేపటినుంచి ఇన్‌స్పెక్షన్ అని చెప్పాముగా" అన్నాడు భాస్కరం.

"రాత్రిపూటకూడ వదలరటండీ మీ ఆఫీసులో—బాగానే ఉంది. ఆల్‌రైట్, గుడ్‌నైట్ !" నవ్వేశాడు సుందరం.

అతను వెళ్ళిపోయాక ఇద్దరూ కలిసి కారమ్సు బోర్డు వేసుక్కూర్చున్నారు.

"అసలు మీనా, డాక్టర్లని పెళ్లిచేసుకునేందుకు చాలామంది జంకుతారట ! ఎప్పుడుపడితే అప్పుడు అర్ధరాత్రి అని తుఫాను అని లెక్క చేయకుండా పేషంట్లకోసం పోతుంటారని ! కాని ఆదాయం వాళ్లంత లేకపోయినా ఈ గుమాస్తాల జీవితాలుగూడా ఇంతే ! ఆఫీసర్ వీళ్లకి తాళిగట్టిన భర్త. వీళ్ళు తాళికట్టిన భార్య ఎలా పోయినా, ఏమయిపోయినా పట్టించుకోరు. ఆ ఆఫీసరు గుడ్‌లుక్స్‌లో పడితే చాలనుకుంటారు,



● మోడలు ఎ-730

# ఎంచుకొందుకు వీలుగా సొగసైన వివిధ మోడలుల

## నేషనల్ ఎక్కో రేడియోలు

నేషనల్-ఎక్కో రేడియోల వివిధ మోడలులలో ఒకటి మీకు తప్పకుండా నచ్చుతుంది! నేషనల్-ఎక్కో రేడియో ఏదైనా శ్రేష్టమైనది. అద్భుతముగా పనిచేస్తుంది. అది గంటలతరబడి వినోద కార్యక్రమములను అందచేస్తుంది. దానిని ఏళ్లతరబడి విని ఆనందించగలరు.

నేషనల్-ఎక్కో రేడియోలు 10 అద్భుతమైన మోడలులలో కలవు. వాటి ధర రు. 125.00 అంతే తక్కువనుండి రు. 725.00 వరకు ఉంది.



మోడలు యు-784: ఎసి/డిసి సెట్. 5 వాల్వులు. 3 బ్యాండులు. అందమైన క్యాబినెట్. మోడలు బి-784: డ్రై బ్యాటరీ సెట్. 4 వాల్వులు. 3 బ్యాండులు. రు. 280.75



మోడలు యు-755: ఎసి/డిసి సెట్. 6 "నోవల్" వాల్వులు. 3 బ్యాండులు. కట్టె క్యాబినెట్. మోడలు బి-755: డ్రై బ్యాటరీ సెట్. 5 "నోవల్" వాల్వులు. 3 బ్యాండులు. కట్టె క్యాబినెట్. రు 351.00



మోడలు యు-756 (జనతా) రు. 125

ఎసి/డిసి సెట్. 3 వాల్వులు మరియు రెక్టిఫైయర్, 2 బ్యాండులు: మీడియమ్ మరియు షార్ట్‌వేవ్. సొగసైన క్యాబినెట్.

మోడలు ఎ-744: ఎసి సెట్. 9 విరములుగా పనిచేసే 6 "నోవల్" వాల్వులు. 4 బ్యాండులు. అందమైన క్యాబినెట్.
మోడలు బి-751: డ్రై బ్యాటరీ సెట్. మొత్తము 9 విరములుగా పనిచేసే 3 ట్రాన్సిస్టర్లు మరియు 5 వాల్వులు. 4 బ్యాండులు. అందమైన క్యాబినెట్. రు. 430.00



● మోడలు ఎ-730: ఎసి సెట్. 9 విరములుగా పనిచేసే 6 "నోవల్" వాల్వులు. 8 బ్యాండులు. కట్టె క్యాబినెట్. మోడలు యు-730: ఎసి/డిసి సెట్. రు. 674.25



నేషనల్-ఎక్కో రేడియోలు శ్రేష్టమైనవి... అవి "మాన్సూనైజ్" చేయబడినవి

అన్ని ధరలూ ఎక్సైజ్ డ్యూటీతో సహా; పన్నులు అదనము



జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్

బొంబాయి . కలకత్తా . మద్రాసు . ఢిల్లీ . పాట్నా . బెంగుళూరు . సికిందరాబాదు

JWT-GRA.3470

కాని తద్వారా భార్యల మనస్సులో అశాంతి కలుగ జేస్తున్నామని అనుకోరు. ఉట్టి నిరర్థకపు బతుకులు వీళ్లవి.

"మా లాకర్లో అయిదు డాటాల విస్కరూ ఉండరు. లేకపోతే ఇంటికొచ్చి చేసే మహా కార్యం నాకేమీలేదు కాబట్టి అలా రోడ్డమ్మట తిరిగి భోజనం ఏదైనా వీలుంటే సినిమా ఆఘోరించి ఏ అర్ధరాత్రికో ఇంటికి చేరుకుంటాను ...."

అతనలా మాట్లాడుకుపోతున్నా మీనాక్షి మాత్రం మౌనంగానే ఉండిపోయింది. రెండు గేము లయాక టైము చూసుకుంది.—

"అప్పుడే పదకొండయింది బావా, ఇక నాపేద్దాం!" అని తను లేచి బోర్డు సర్ది గదిలోకి వెళ్లిపోయి పడుకుంది.

పడుకుందన్నమాటేగాని ఒకపట్టాన నిద్ర రాలేదు. రేపటిగల్లా ఆలోచనలు ముసురుకుంటున్నాయి .... తన గతజీవితం, అప్పుడు తను కలలుకన్న భవిష్యత్తుతో ఇప్పటి జీవితం పోల్చుకుంటే ఏదో పోగొట్టుకున్నట్టు అనిపించింది. బుగ్గలు తడిసిపోయాయి .... ఆలోచనలతో తల, ఒళ్లుకూడా వేడెక్కిపోయాయి. అలాగే కళ్లు మూతపడ్డాయి. కలలోకి జారిపోయింది—

తను భాస్కరంచేయి పట్టుకుని నేలమీద నిలబడుంది. చుట్టూ ఏవో ముళ్ళు, పొదలు—దుర్గంధం వ్యాపించి ఉన్నాయి. అయినా అతని చేయి గట్టిగా పట్టుకుని ధైర్యంగా నిలబడి ఉంది వాటన్నిటినీ లెక్కచేయకుండా.

ఇంతలో ఎక్కడినుంచి వచ్చాడో సుందరం—భాస్కరంచేతిలో నున్న తనచేతిని బలవంతంగా విడిపించి తను పుచ్చుకుని తనతో ఆకాశంలోకి లాక్కుపోసాగాడు. తనేమీ మాట్లాడకుండా అలానే ఉండిపోయింది. తనతో ఏవేవో చెబుతున్నాడు సుందరం. ఆకాశంలో మిలమిల్లాడుతున్న తారలు, సగం మాత్రం ప్రకాశిస్తున్న చంద్రుడు—ఏవేవో చూపించుతున్నాడు. "ఇలా వెళ్లగా వెళ్లగా అవన్నీ మనకి అందుతాయి" అంటున్నాడు. తను నిజమేననుకుని ఆశపడింది.

అంతలో ఎవరో అప్సరస — చాలా అందంగా ఉంది — మెల్లిగా పైనుంచి దిగిరాసాగింది. ఆమెని చూడగానే సుందరంముఖంలో ఆనందం కమ్ముకోవడం చూసింది తను. తన చేతిని గట్టిగా పట్టుకున్న అతనిచేయి పట్టు విడిపోతోంది. తనకి భయంవేసింది. కిందికి చూస్తే ఎక్కడోదిగా కనబడుతోంది భూమి. కళ్లు తిరిగి అతనిచేయి గట్టిగా పట్టుకోబోయింది. కాని—

అప్సరస వచ్చి తన చేయి అలా అందంగా చాచింది సుందరంకేసి. అంతే—తనచేతిని విదిలించుకుని రెండుచేతులూ ఆమెవైపు చాపాడతను.

తనకి కళ్లుతిరిగి మూతలు పడిపోయాయి. పడిపోతోంది తను. ఏ భూమిమీదనయితే ముళ్ళు, దుర్గంధం చూసి అసహ్యించుకుందో వాటి మీదికి పడిపోతోంది. ఒళ్ళంతా ముళ్ళు గుచ్చుకుంటాయి. నరకయాతనతో మరణిస్తుంది. అంతే ఆలోచనలుకూడా ఆగిపోయాయి.

కళ్ళుతెరిచి చూసేసరికి భాస్కరం తన్ని చేతుల్లో ఎత్తుకుని పొదివి పట్టుకుని ఉన్నాడు!

# తెల్లవారింది

"నేను చావలేదూ?" అంది ఆశ్చర్యంగా!

"నేనుండగానే!" అని నవ్వి "నిన్ను అతను క్రిందపడేస్తాడని తెలిసే పట్టుకునేందుకు కాసుకుని ఉన్నాను" అన్నాడు భాస్కరం.

తను ఏడుస్తూ "నన్ను క్షమించండి. మిమ్మల్ని అర్థంచేసుకోలేకపోయాను. ఎండమావుల్ని చూసి భ్రమించాను" అంటూ అతని మెడకి చుట్టుకుపోయింది.

ఉలిక్కిపడి నిద్ర లేచింది మీనాక్షి. కళ్ళు తెరిచి చూసింది—

ఎర్రటి కళ్లతో తనమీదికి వంగి తన ముఖంలోకి చూస్తున్నాడు సుందరం!

కలవరపడిపోయింది మీనాక్షి. గబుక్కున లేచి కూర్చుని "ఆయన్నిగురించి పీడకల వచ్చింది బావా! ఆయన నిజంగా మంచివారు! నాలో ఎన్ని లోపాలున్నా క్షమించగల విశాలహృదయం ఆయనది. పసిపిల్లడంత అమాయకుడు. నా కాల్లో ముల్లుగుచ్చుకున్నా సహించలేరు. పాపం ఆఫీసులో రాత్రింబవళ్ళు చాకిరీచేసినా ఎవరికోసం —

---

"ఆ వెధవచూడు పనీ పాటా లేకుండా రోడ్డు ప్రక్కన ఎలా పడుకున్నాడో" కిటికిలోంచి చూస్తూ అన్నాడు తాతారావు తన తోటి గుమాస్తాతో.

"నిజమే కాని, ముందు నువ్వు బల్లమీాదనుంచి నీ కాళ్లు తీసి ఆ మాట అను!" అతడు చల్లగా అంటించాడు.

యం. సత్యనారాయణ (అనంతపురం)

---

నాకోసం! నా సుఖంకోసం! ఆయనకి వచ్చేది తక్కువజీతమే అయినా అదే చాలు మా సంసారం ఆనందంగా గడవటానికి. ఆయనలో ఇంకో మంచి గుణం తెలుసా— తను లోపల ఎంత బాధపడుతున్నా బయటకుమాత్రం చిరునవ్వు నవ్వుతుంటారు! .... నువ్వొచ్చినప్పటినుంచి చూస్తున్నాను—ఆయన్ని, ఆయన ఉద్యోగాన్ని హేళన చేస్తున్నావు. అది నాకు చాలా కష్టం కలిగించింది. నేను అటువంటిది సహించను కూడా" అంటూ మంగళసూత్రం పమిటచాటునుంచి తీసి కళ్ల కద్దుకుంది.

తెల్లబోయాడు సుందరం ఊహించని ఈ పరిణామానికి! గిరుక్కున వెనక్కి తిరిగాడు.

"ఇంతకీ గదిలోకి ఎందుకు వచ్చిందీ అడగలేదు నేను. నీగదిలో మంచినీళ్లు పెట్టాను — నీకు కనబడలేదు గావును. నేను వచ్చి ఇవ్వమంటావా?" అంటూ లేచింది.

కాని ఆమెమాట వినిపించుకోకుండా గదిలోంచి బయటికి వెళ్లిపోయాడు సుందరం.

నిట్టూర్చి తలుపు గడియవేసి దేముడికి మనస్ఫూర్తిగా మనస్సులోనే చేతులు జోడించింది. తరువాత తృప్తిగా నిద్రపోయింది.

లోపలికి అడుగుపెట్టిన భాస్కరం ఇల్లంతా కడిగి ముగ్గులుపెట్టి ఉండటం చూసి ఆశ్చర్యపోయాడు. హాల్లో చుట్టూ చూశాడు—కాని ఎవరూ కనబడలేదు. టేబుల్‌మీద మాత్రం ఒక కాగితం గాలికి రెపరెపలాడుతూ పైన పెట్టిన బరువుకి తలఒగ్గి ఉంది. తీసుకుని చదివాడు.

మీనాక్షికి,

నాకుగల అహంకారం ఈనాటితో పోయింది. ఒకసారి మనసిచ్చాక స్త్రీ జీవితాంతం మనసా అతనిదే అన్న భ్రాంతితో ఇక్కడికి వచ్చాను. వీలైతే నిన్ను నావెంట తీసుకుపోవాలని కూడా నా ఉద్దేశ్యమేమో నాకే తెలియదు. కాని ఒక నగ్నసత్యాన్ని తెలియజేశావు. నీ హృదయంలో భర్తకి తప్ప మరొకరికి స్థానం ఉండదని, ఎన్ని లోపాలున్నా అతనే నీకు సర్వస్వమనీనూ.

జీవితంతో విసిగిపోయాను. నా గమ్యమేదో నాకే తెలియదు. భాస్కరం చాలా అదృష్టవంతుడు. అతనిమీద ఈర్ష్యవలన అతన్ని హేళనగా మాట్లాడాను. క్షమించగలడని తెలుసు.

నిన్ను నా సోదరిగా భావించి ఈ కాగితంమీద ఎత్తిపెట్టిన వాచి నీకు వివాహ కానుకగా ఇస్తున్నాను. నా కోరిక కాదనకు. మళ్లీ మీ ఇంటికి వస్తాను శలవు.

సుందరం.

నిట్టూర్చి తలెత్తి ఎదురుగా చూశాడు భాస్కరం.

పెద్దబొట్టు పెట్టుకుని పట్టుచీర కట్టుకుని వచ్చింది మీనాక్షి.

ముగ్ధుడయిపోయాడు భాస్కరం "ఈ ఉత్తరం చదివావా?" అన్నాడు నవ్వుతూ.

"చదవనక్కరలేదు. చించి అవతల పారేయండి" అంటూ అతనికి దగ్గరగా వచ్చింది.

ఆమెను హృదయానికి హత్తుకుని తలంటుకున్న ఆమె జుట్టులోకి చేయి పోనిచ్చి "నిజంగా నేను అదృష్టవంతుడ్ని మీనా! నిన్ను చేసుకుందామనుకున్నప్పుడు కొంతమంది అన్నారు నాతో — "ఆ అమ్మాయి వాళ్ళబావతో ఎలా తిరిగిందో తెలుసా? అతన్ని తప్ప ఇంకొకరిని చేసుకోనని నిష్కర్షగా చెప్పిన ఆ పిల్లని చేసుకుంటానంటున్నావు ఆలోచించుకో" అని. కాని నాకు ఆడవాళ్ళమీద నమ్మకముంది. పశ్చాత్తాపపడవలసిన అవసరమూ రాలేదు" అన్నాడు ఆమె కళ్లలోకి చూస్తూ.

డ్రాయరుమీది పెట్టెలోంచి వాచి తీసి "నిన్ను చేసుకున్ననాడే నా జీవితంలో చీకటి పోయి తెల్లవారింది. మీ బావకి జీవితమే తెల్లవారింది. అతను వెతుక్కుంటున్న మనశ్శాంతి అతనికి కలిగించమని భగవంతుడ్ని ప్రార్థిద్దాం. మీ కొత్త న్నయ్య బహుమానం పెట్టుకోవూ?" అన్నాడు.

ఆమె ఎడంచేయి చూపింది. అతను ఆమె చేతికి వాచి పెట్టి దగ్గరకు తీసుకున్నాడు. మీనాక్షి అతని హృదయంమీదికి వాలిపోయింది.

తెరిచిఉన్న తలుపులగుండా అప్పుడే ఉదయిస్తున్న సూర్యుడి కిరణాలు దూసుకువచ్చి వాళ్లని వెలుగులో ముంచేశాయి.



"టార్చి! టార్చి ఏదీ!" అని కేకలు వేశాడు ప్రొఫెసర్‌గారు.

కొంచెం కష్టపడినా హాన్స్ దానిని ఎలాగో వెలిగించాడు. చిటపటలాడుతున్న దీపం వెలుగులో మా పరిసరాలు స్పష్టంగా కనిపించాయి.

"నే ననుకున్నదే" అన్నాడు ప్రొఫెసర్‌గారు. ఇరుకైన ఒక నూతిలో ఉన్నాం. దీని వ్యాసార్థం ఇరవై నాలుగు అడుగులు మించి లేదు. నీరు ఈ గొయ్యి నేల మట్టం చేరుకున్నది. ఇప్పుడు పైకి లేస్తున్నది. దానితోబాటు మనమూ పైకి లేస్తున్నాం."

"ఎక్కడిదాకా ?"

"ఏమో తెలీదు. కాని దేనికయినా సిద్ధంగా ఉండాలి. సెకండుకి పన్నెండు అడుగుల చొప్పున లేస్తున్నాం. అంటే నిముషానికి ఏడువందల ఇరవై అడుగులు — అంటే పదిమైళ్లకు పైగా నన్న మాట. ఈమాత్రం వేగంతో ఎక్కడికో చేరుకోక తప్పం."

"అవును, ఏదీ మనల్ని ఆపకపోతే—ఈ నూతికి ద్వారం ఉంటే, పైన మూసిఉంటే ఈ నీటి వల్ల అణుచుకుపోతున్న గాలి పీడనశక్తి మనల్ని నలిపి పారవేస్తుంది !"

"ఆక్సెల్" అన్నాడు ప్రొఫెసర్‌గారు నెమ్మదిగా. "పరిస్థితి ఇంత ప్రమాదంగా ఉన్నా ప్రాణంతో తప్పించుకొనటం ఎలాగా అని చూస్తున్నాను. ఏ క్షణంలోనైనా నాశనమయిపోగలం. కాని ఏ క్షణంలో నైనా బ్రతికిపోతామేమో ! ఏమాత్రం అవకాశం దొరికినా వదలకూడదు !"

"కాని ఏం చేద్దాం ?"

"ఆహారం పుచ్చుకుని బలం కొంత కోలుకొందాం."

ఈ మాటలు విన్న నేను ఆయన వంక విస్ఫ్రాంతో చూశాను. ఆయనకు నిజం చెప్ప వలసిన సమయం వచ్చినది.

"ఆహారమా ?" అన్నాను.

"అవును. ఏమయినా—"

మాటమధ్యలో ఆపివేసి డానిశ్‌లో ఏదో అన్నాడు. హాన్స్ తల అడ్డంగా ఆడించాడు.

"ఏమిటి !" అని అరిచాడు మా పెదనాన్న. "మన ఆహారపదార్థాలన్నీ పోయాయా ?"

"ఇంచుమించు అన్నీ. మన ముగ్గురికీ మిగిలింది ఈ ఎండుమాంసం ముక్కమాత్రమే !"

అర్థం చేసుకొనటానికి ఇష్టంలేనివానివలె మా పెదనాన్న నావంక చూశాడు.

"ఇప్పుడు తెలిసింది కదా" అన్నాను. "మన కేమన్నా ఆశించదగినది మిగిలిందా ?"

నా ప్రశ్నకు జవాబు రాలేదు.

ఒకగంట గడిచినది. నాకు విపరీతమయిన ఆకలి వేసినది. నా సహచరులు కూడా బాధ పడుతున్నారు. కాని ఒక్కరూ మాకు మిగిలిన ఆహారపు ముక్క ముట్టుకొనడానికి సాహసించ లేదు.

ఇంతలో పైకిలేస్తూనే ఉన్నాము. కొన్నెప్పుడు ఊపిరి సరిపేది కాదు. బెలూన్‌లలో మరి వేగంగా పైకి ఎగసిపోయేవారికి ఇది సుపరిచిత

# భూగర్భంలోనికి సాహసయాత్ర

24-వ పేజీ తరువాయి

మయిన విషయం. కాని వారు పైకి ప్రయాణం చేసినకొద్దీ వారి చుట్టూ ఉన్న వాతావరణం చల్లబడుతుంది. మా విషయంలోనో — వేడి అతి శీఘ్రంగా అధికం అవుతున్నది. కనీసం నలభై డిగ్రీలు వచ్చి ఉంటుంది.

ఈ మార్పు అర్థం ఏమిటి ? అంతవరకూ డేవీ, లిడెన్‌బ్రోక్‌ల సిద్ధాంతాలకు అనుగుణంగానే ఉన్నది మాకు ఎదురయిన సాక్ష్యం అంతా. నా అభిప్రాయంలో, ఇంతవరకూ కేంద్రంలో వేడి ఉన్నదనే సిద్ధాంతం స్థూలంగా నిజం అని రుజువు అయినది. ఇకమీద రాళ్ళు ద్రవంగా కరిగేవేడి ప్రదేశాలు చేరుకొన పోతున్నామా ? ఈ భయం ఎక్కువ అయి, ప్రొఫెసర్ గారితో చెప్పాను.

---

"పెళ్లి చేసుకున్నారు కనుక ఇహ మీరు పాలసీతీసుకోవటం అవసరం" భీమా ఏజెంటు అతణ్ణి ఏదోవిధంగా బుట్టలో వేసుకోవాలని చూస్తున్నాడు.

"ఓహ్! దానికేం. అయినా మా ఆవిడవల్ల అంత ప్రమాదమేమీ జరుగదులెండి!" అతడు తన తెలివికి నిజంగానే సంతోషించాడు.

కె. నీలకంఠం (బాపట్ల)

---

"నీటిలో మునగక, నలిగిపోక, ఆకలితో చావక ఇంకా బ్రతికిపోయామంటే చక్కగా వేపుడు అయి పూరుకుంటాం."

భుజాలు ఆడించి పూరుకున్నాడు. తన ఆలోచనలలో మునిగిపోయాడు.

ఒక గంటగడచినది. ఉష్ణోగ్రత స్థితి కొంచెం ఎక్కువ అవటం తప్ప పరిస్థితిలో వేరే మార్పులేదు.

హఠాత్తుగా మా పెదనాన్న నోరు విప్పాడు.

"సరే !" అన్నాడు. "మన ప్రయత్నం ప్రారంభించాలి."

"ప్రయత్నమా ?"

"అవును. మనబలం కోలుకొవాలి. ఈ మిగిలిన ఆహారం మన కెందుకూ పనికిరాదు. కొన్ని గంటలు ఎలాగో లాక్కువచ్చినా చివరికి బలహీనంగా అయిపోతాం."

"కాని పెదనాన్నా ! ఈ మాంసంముక్క తినేసిన తర్వాత మనకు మిగిలేదేమిటి ?"

"ఏమీలేదు ఆక్సెల్, ఏమీలేదు. అయినా కళ్లతో తింటూవుంటే మాత్రం ఏమి శక్తి నిస్తుంది ? అసలు సంకల్పంశక్తి లేనివానిలాగ మాట్లాడుతున్నావు—సాహసం చెయ్యకపోతే లాభం లేదు."

"అంటే నువ్వింకా ఆశ కోల్పోలేదా ?" అని విసుగుతో అరిచాను.

"లేదు !" అన్నాడు ప్రొఫెసర్‌గారు దృఢంగా.

"ఏమిటి ! ఇంకా ప్రాణాలతో తప్పించుకునేందుకు అవకాశం ఉందని నమ్ముతావా ?"

"అవును ! తప్పకుండా ! మనబుద్ధి పని చేస్తున్నంతకాలం, శరీరంలో ప్రాణం ఉన్నంత సేపు, గుండె కొట్టుకున్నంతవరకూ నిరాశకు తావులేదు."

ఏమి ఊహ ! ఈ పరిస్థితులలో దానిని బయటపెట్టిన వ్యక్తి సామాన్యుడు కాడు.

"అయితే సరే, ఇప్పుడేం చేద్దామంటావ్ ?" అన్నాను.

"మిగిలినది కాస్త తినేద్దాం. కొంత బలం వస్తుంది. ఈ భోజనం మన చివరిభోజనం అని ఒప్పుకుంటాను కాని, తిన్నతర్వాత ఈవిధంగా అలిసిపోయిన వారంకాకుండా కొంతసేపు తిరిగి మనుష్యుల మనిపించుకోవచ్చు!"

"మంచిది ! తిందాం !" అని అరిచాను.

మా పెదనాన్న మిగిలిన బిస్కత్తులు, మాంసం ముక్క, తీసుకుని మూడుభాగాలుగా పంచాడు. ఒక్కొక్కరికి సుమారు ఒక పవ్‌ను ఆహారం లభించినది. ప్రొఫెసర్‌గారు చాలా ఆవసరంగా తిన్నాడు. నాకు ఆకలిగా ఉన్నా, భోజనం రుచించ లేదు. హాన్స్ చిన్న చిన్న ముద్దలు నోట్లో వేసుకుని నిదానంగా భోజనంచేశాడు. భవిష్యత్తుకి భయపడనివానివలె తిన్నాడు. ఎక్కడనుంచో కాని సగంవరకూ నిండి ఉన్న ఒక 'జిన్' సీసా తీశాడు. అందరం పుచ్చుకున్నాము. ఈ మద్యం నాకు కొంచెం ప్రాణం పోసినది.

"ఫర్ ట్రిక్లిగ్ !" అన్నాడు హాన్స్ కొంచెం జిన్ త్రాగిన తర్వాత.

"చాలా బాగుంది !" అని తన అంగీకారం సూచించాడు మా పెదనాన్న.

నాలో క్రొత్త ఆశ అంకురించినది. కాని ఇది మా 'అంతిమ భోజనం' అనక తప్పదు. అప్పటికి ప్రొద్దున అయిదు గంట అయినది.

ఆరోగ్య మనేది అవసరంపట్టే గాని తెలియదు. కడుపు నిండినతర్వాత ఆకలిబాధ భయంకరం అనిపించదు. అనుభవించిన తర్వాత కాని తెలియదు. అందుచేతనే, మా దీర్ఘమయిన ఉపవాసంతర్వాత కొన్నిబిస్కత్తులు, మాంసం ముక్కలు తిని అంతకుముందుపడినకష్టాలు పూర్తిగా మరిచిపోయాము.

భోజనంతర్వాత ఎవరి ఆలోచనలలో వారు మునిగిపోయారు. హాన్స్ మనస్సులో ఏమున్నదో ఎవరికి తెలుసు ? దూర పశ్చిమప్రాంతవాసి అయిన ఈ మనిషిలో పూర్వదేశీయ సహజమయిన క్షమ అధికంగా కనిపిస్తుంది. ఇక నా సంగతి ? గతస్మృతులతో నిండిపోయాను. ఇవి నన్ను నేను అసలు వదలి రాకూడని ప్రదేశానికి

తీసుకువెళ్ళాయి. కీనిగ్‌స్ట్రీస్‌లో ఇల్లు, గ్రావ్‌బెన్, మార్టా—నా కళ్ళకు కట్టినట్లు అయినది. ఈ నూతిలో గుడగుడ శబ్దాలు విని మా ఊరిలోని సుపరిచిత శబ్దాలమీదకు మనస్సు పోయినది.

కాని మా పెదనాన్నకు ప్రస్తుత వ్యవహారం మీద ధ్యాసపోలేదు. చేతిలో 'టార్చి' పట్టుకొని మేము ఉన్న 'సొరంగం' పరిశీలిస్తున్నాడు. శాతిఫలకాలలోని మార్పులను బట్టి మేము ఎక్కడ ఉన్నదీ తెలుసుకుందామని ప్రయత్నిస్తున్నాడు. ఆయన అంచనా చాలాస్థూలంగా ఉండి తీరుతుంది; కాని నిజమయిన శాస్త్రజ్ఞుడంటే దొరికిన వివరాలతో నేసరిపెట్టుకోవాలి గదా? ప్రొఫెసర్ లిడెన్‌బ్రోక్‌లో ఈ నైపుణ్యానికి తక్కువలేదు.

నాకు పరిచితమైన భూగర్భశాస్త్ర పరిభాషలో గొణగటం విన్నాను. ఆయన జీవితంలో ( బహుశః ) చివరి పరిశోధనలో ఏమి కనిపెట్టాడో తెలుసుకోవాలనే కుతూహలం నాకు కలిగినది.

"ఈ గ్రానైట్ చూస్తే ఇంకా పురాతన యుగంలోనే ఉన్నామని తెలుస్తోంది. కాని పైకి లేస్తున్నాం! పైకే! ఏమో ఎవరు చెప్పగలరు?"

అవును, ఎవరు చెప్పగలరు? ఆయన మాత్రం ఆశిస్తున్నాడు. గోడని సున్నితంగా తడిమి, కొన్ని నిమిషాలతర్వాత మళ్ళీ అనేవాడు.

"ఇది గ్నైస్! ఇది మైకాషిస్ట్! మంచిది! ఇంకొంచెం పోతే .... ...."

ప్రొఫెసర్‌గారు చెబుదామనుకుంటున్నది. ఏమిటి? పైన వేళ్ళాడుతున్న భూగోళం పెచ్చు మందం కొలవగలడ? కొలిచే సాధన ఆయన వద్ద ఉన్నదా? లేదు. 'మానోమీటర్' ( Manometer ) కూడా లేదు. అంచనా అసలు వీలులేదు.

వేడిమాత్రం విపరీతంగా అధికం అవుతున్నది. వాతావరణం మమ్మల్ని మాడ్చివేస్తున్నది. కమ్మరి కొలిమిలో కరిగిన లోహం వేడితో పోల్చగలను, అంతే. మొదట హాన్స్, తర్వాత మా పెదనాన్న, ఆపైన నేను మా కోట్లు విప్పవలసివచ్చినది. ఏమాత్రం దుస్తులు ఉన్నా కష్ట మనిపించినది.

"అయితే మనం మండుతున్న కొలిమి ప్రవేశించబోతున్నామా?" అని అరిచాను. వేడి రెట్టింపు అవటం గమనించి.

"లేదు, అది అసాధ్యం! అసాధ్యం!" అని సమాధానం ఇచ్చాడు మా పెదనాన్న.

"కాని ఇది మండిపోతోంది!" అన్నాను గోడ ముట్టుకుంటూ

ఈ మాటలు పలుకుతూ ఉండగానే నీరు చిందినా చేతిమీద పడి వెనుకకు లాగివేసుకున్నాను.

"నీరు ఉడికిపోతోంది!" అని అరిచాను.

ఈసారి ప్రొఫెసర్‌గారు కోపంగా తల ఆడించాడు.

నన్ను విపరీత మయిన భయం ఆవరించినది ఏదో పెద్దప్రమాదం సంభవించబోతున్నదనిపించినది—ఊహకే అందని పెద్ద ప్రమాదం. ముందు అనుమానంగానే ఉండిపోయినది కాస్తా గట్టి నమ్మకంగా మారిపోయినది. ప్రక్కకు తోసివేద్దామన్నా వీలులేకపోయినది. దానిని బయట పెట్టటానికే ధైర్యం చాలలేదు. కాని దానిని బలపరిచే సాక్ష్యం ఎలా కాదనటం? మా టార్చి మసక వెలుగులో కూడా మాచుట్టూ ఉన్న గ్రానైట్ గోడలు అదురుతున్నా యనిపించినది. దీనికి విద్యుచ్ఛక్తి ఒక కారణం అయిఉండాలి. అత్యధికమయిన ఈ వేడి, మసలుతున్న ఈ నీరు ....! దిక్సూచి చూడాలని నిశ్చయించుకున్నాను.

దాని ముల్లుకి పిచ్చిపట్టుకున్నది!

## 43

అవును. దిక్సూచికి మంత్రం వేసినట్లున్నారు! ముల్లు ఒక ధ్రువంనుంచి మరొక దానికి పూరికే మారుతున్నది. దిక్సూచి 'ముఖం'మీద అంతా చుడుతున్నది. తల తిరిగుడు పట్టుకున్నదా అన్నట్లున్నది!

సాధారణంగా చలామణీ అవుతున్న సిద్ధాంతాల ప్రకారం భూమిమీద పై పెచ్చు నిశ్చలంగా ఉండదని నాకు తెలుసు. లోపల పదార్థాల మార్పులవల్ల, కదలికలవల్ల ఈ పెచ్చు కదలుతూనే ఉంటుందికాని దానిమీద జీవించే ప్రాణులకు ఈ విషయం తెలియదు. అందుచేతనే ఈ గ్రానైట్ గోడలు అదిరినంతమాత్రాన నేను భయపడిఉండనవసరంలేదు. ఇది ఒక్కటే అయితే నాకు ఇంత భయం వేసేది కాదు.

కాని ఇతరసంఘటనలు కొన్ని నా అనుమానాలను దృఢపరచాయి.

గర్జనలవంటిశబ్దాలు బాగా తీవ్రం అయిపోతున్నాయి. వీటిని గచ్చువేసిన బాటమీద పెద్ద బళ్ళు వెళ్ళిన శబ్దంతో పోల్చగలను, అంతే. ఎడతెరిపిలేని ఉరుము.

ఇప్పుడేమో ఈ పిచ్చెక్కిన దిక్సూచి చుట్టూ వ్యాపించిఉన్న విద్యుచ్ఛక్తులవల్ల చికాకుపడిపోతున్నది. భూమి పెచ్చు విరిగి ముక్కలు కాబోతున్నది! ఈ గ్రానైట్ రాళ్ళు తిరిగి కలిసిపోతాయి. చీలికలు మూసుకుంటాయి. మేము ఆక్రమించిఉన్న చోటు నిండిపోతుంది! ఇక మేమీ—ఉట్టి పరమాణువులం! ఈ భయంకర పరిష్వంగంలో నలిగిపోతాము.

"పెదనాన్నా! పెదనాన్నా!" అని అరిచాను. "మన పని అయిపోయింది!"

"ఇప్పుడేమి కొత్తగా వచ్చిపడింది?" అని అడిగాడు ఆయన, చాలా నెమ్మదిగా, "ఏమిటి అలా భయపడుతున్నావ్?"

"భయమా! గోడలు అదరటం చూడు. రాయి ఎలా కదిలిపోతోందో చూడు. వేడి, ఉడుకుతున్న నీరు, ఈ ఆవిరి, పిచ్చెక్కిన దిక్సూచి ముల్లు—భూకంపం రాబోతోందని స్పష్టంగా తెలుస్తోంది కదా!

మా పెదనాన్న తల అడ్డంగా ఆడించాడు.

"భూకంపమా?" అన్నాడు.

"అవును!"

"అబ్బాయ్, పొరబడుతున్నావనుకుంటాను."

"ఏమిటి! ఇవన్నీ దాని సూచనలు కావంటావా—"

"భూకంపం సూచనలా? కాదు! దానికన్నా మంచిదే ఒకటి జరుగుతుందని ఎదురుచూస్తున్నాను!"

"అంటే?"

"ఒక ఉద్భేదం!"

"ఉద్భేదమా?" అన్నాను. "అంటే ఒక అగ్ని పర్వతం పొగగొట్టంలో ఉన్నామా?"

"అనుకుంటాను. అయితే మన అదృష్టం బాగున్నట్లే" అన్నారు ప్రొఫెసర్‌గారు నవ్వుతూ

మా అదృష్టమా! పిచ్చెక్కటం మా పెదనాన్న వంతా? ఈ మాటల అర్థం ఏమిటి? ఈ నిదానం, చిరునవ్వు ఎందుకు?

"ఏమిటి!" అని అరిచాను"ఉద్భేదంలో ఇరుక్కున్నాం! మండుతున్న 'లావా' మసలుతున్న నీరు, వీటిమధ్య చిక్కుకున్నాం! వీటితోబాటు" గాలిలోకి ఎగిరిపోతాము! ఇది అదృష్టం అంటావ్!

"అవును" అన్నాడు మా పెదనాన్న కళ్ళజోడు మీదనుంచి నా వంక చూస్తూ, "భూతలంమీదకు వెళ్ళాలంటే ఇదొకటే మార్గం మనకి!"

నా మనస్సులో మెదిలిన వెయ్యి ఆలోచనలు పరిశీలించిచూశాను. మా పెదనాన్న చెప్పింది నిజం. అక్షరాలా నిజం—ఆయన ఇప్పు డున్నంత ధీమాగా ఉండటం ఎప్పుడూ చూడలేదు.

క్రమంగా పైకిలేచిపోతున్నాము. మా చుట్టూ కలవరం అధికం అవుతున్నది; నాకు అసలు ఊపిరి సలపటంలేదు. నా ఆఖరి ఘడియలు సమీపిస్తున్నా యనుకున్నాను. అయినా భావన విచిత్రమయినది మా పరిస్థితి పరిశీలించిచూశాను. చిన్నపిల్ల



దృక్పథంతో పరిశీలించి చూశాను. చిన్నపిల్లల దృక్పథం అని ఎందు కంటున్నానంటే, నా ఆలోచనలను అదుపులో ఉంచేబదులు వాటికి లొంగిపోయాను!

పైకి తోసుకుపోతున్నామనేది స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. మా తెప్ప క్రింద ఉడికే నీరు, ఆనీటి క్రింద లావా ప్రవాహం, ఇంకా క్రిందిరాళ్ళ ప్రవాహం ఇవన్నీ అగ్నిపర్వతం వెలుపలికి వచ్చినప్పుడు అన్ని దిక్కులకీ చిందర వందరగా పడిపోతాయి. మేము అగ్నిపర్వతంలోపల 'పొగ గొట్టం'లో ఉన్నామనటానికి సందేహంలేదు.

కాని ఈసారి 'స్నాఫెల్స్'వంటి ఆరిపోయిన అగ్ని పర్వతం కాక, మాకు బ్రద్దలవుతున్న అగ్ని పర్వతం ఒకటి దొరికినది. ఇది ఏ పర్వతం అయి ఉంటుందా, అని నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. భూమిమీద ఏ ప్రదేశంలో బయటకువచ్చి పడ్తామో, అనుకున్నాను.

సందేహం లేకుండా ఉత్తరప్రదేశాలలోనే. సాక్నుస్సెమ్ అంతరీపం వదలినప్పటినుంచీ దిక్సూచి ఒకే వైపు చూపిస్తున్నది—ప్రస్తుతపు ప్రవర్తన ఎలా ఉన్నా! ఉత్తరం వైపుకి కొన్ని వందల మైళ్ళు ప్రయాణం చేశాము. కాని తిరిగి ఐస్‌లాండ్ క్రిందకు వచ్చామా? హెక్లా పర్వతం ముఖద్వారం ద్వారా బయటకువచ్చి పడ్తామా? లేక మిగిలిన ఏడు అగ్ని పర్వతాలలో మరొకటి మమ్మల్ని వెడలగ్రక్కుతుందా వాటికి సమంగా, పడమరగా, పదిహేనువందల మైళ్లలోపుగాఉన్న అగ్ని పర్వతాలలో కొన్ని మాత్రమే అప్పుడు నాకు గుర్తుకు వచ్చాయి. ఇవి అమెరికా వాయువ్యదిక్కుగా ఉన్నాయి. తూర్పున ఒకటే ఒకటి ఉన్నది. ఇదే 'యాన్ మాయన్' ద్వీపంమీద ఉన్న 'ఎస్క్' పర్వతం. ఏమయినా అగ్ని పర్వతాల ముఖ ద్వారాలకు కొదువలేదు—సైన్యాలు పట్టేటంత పెద్దవిఉన్నాయి! కాని వీటిలో ఏది మాకు 'వెలుపలకు దారి' అవుతుంది? అదే వూహిద్దామని ప్రయత్నిస్తున్నాను.

వేకువజామునే మా వూర్ధ్వగమనం యొక్క వేగం ఎక్కువ అయినది. వేడి అధికం అయినా—భూతలం సమీపించినకొద్దీ తగ్గవలసినది—ఇది కేవలం అగ్నిపర్వతపు అంతరంగికమయిన మార్పులలో ఒకటిఅయి ఉంటుంది అనుకున్నాను. మాగమనానికి కారణం విషయమై నాకు సందేహంలేదు. భూగర్భాంతరాళాలలోని పదార్థాల పీడనశక్తి—భూతలంమీద వాయుపీడనశక్తికన్నా కొన్నివేల రెట్లు అధికమయినది—మమ్మల్ని పైకి నెట్టేస్తున్నది. దీనివల్ల సంభవించే ప్రమాదాలు ఎన్నో!

ఇంతలో మా సొరంగంలోనికి ఒక బంగారు రంగు వెలుగు ప్రవేశించినది. సొరంగం వెడల్పు కూడా అధికం అవుతున్నది. మాకు ఇరువైపులా లోతయిన గుహలు కనిపించాయి. వీటిలోనుంచి దట్టమయిన ఆవిరి బయటకు వస్తున్నది. చిటపటలాడుతున్న మంటలు గోడలమీద ప్రాకుతున్నాయి.

"పెదనాన్నా, చూడు!" అని అరిచాను.

"అవును! గంధకపు జ్వాలలు. అగ్ని పర్వతం బ్రద్దలయ్యేముందు ఇవి కనిపించటం సహజమే!"

"కాని మనల్ని చుట్టేస్తే?"

"చుట్టెయ్యవు!"

"కాని, వూపిరిసలపదే!"

# భూగర్భంలోనికి సాహసయాత్ర

"ఊపిరి సలపకపోదు. ఈ సొరంగం విశాలమయిపోతుంది చూడు. అవసరమయితే తెప్పవదిలి ఈ గుహలలో ఒక దానిలో దాక్కుందాం."

"మరి నీరు! మన వెంట వరదగా వచ్చి నింపెయ్యదూ—"

"నీరులేదు ఆక్సెల్. బంక లాగున్న లావామీద ప్రయాణం చేస్తున్నాం."

నిజంగానే ద్రవపదార్థం మాయమయిపోయినది. దాని బదులు, ఉడుకుతున్న పదార్థం ఉన్నది. వేడి మరీ దుర్భరమయిపోతున్నది. "థర్మామీటర్ కనుక ఉన్నట్లయితే డెబ్బది డిగ్రీల వేడి సూచించేది! అతివేగంగా పైకి లేస్తున్నాము కాబట్టి మా చుట్టూ గాలి కలుషితం కాకుండా పీల్చటానికి సరిగ్గా ఉన్నది. లేకపోతే ఎప్పుడో నశించిపోయిఉండేవారము.

అన్నారేకాని, ప్రొఫెసర్‌గారు తెప్ప వదిలే ప్రయత్నం ఏమీ చెయ్యటంలేదు. అదీ మంచిదే! దాని 'సర్బార్ (బాండర్)' పలకలక్రింద వేడి మాకు

"నీవు నా క్లాసులో నిద్రపోలేవ్!" ఉపాధ్యాయుడు రాముమీదమండిపడ్డాడు.

"మీరంత గట్టిగా అరవకుండా ఉంటే నిద్రపోగలనండీ!" రాము ఆవలిస్తూ సమాధానం చెప్పాడు.

కె. రాఘవరావు (గుంటూరు)

తగలకుండా కాపాడుతున్నాయి.

ఎనిమిది గంటలకు ఎదురు చూడనిది ఒకటి జరిగినది. పైకి కదలక హఠాత్తుగా ఆగిపోయినది. తెప్ప నిశ్చలంగా ఉండిపోయినది.

"ఇదేమిటి"? అని అడిగాను, ఈ ఆకస్మికమయిన నిలుపుదలకి కలవరపడిపోయి.

"ఇదొక మజిలీ" అన్నారు ప్రొఫెసర్‌గారు.

"ఉద్రేకం ఉపశమించిందా?"

"లేదని ఆశిస్తున్నాను."

లేచి నుంచున్నాను. తెప్ప ఏదైనా రాతికి చిక్కుకుని ఆగిపోయినదేమో వెంటనే విడిపించవచ్చునని చుట్టూ చూశాను.

అదేమీలేదు. మా క్రింది పదార్థం అచలంగా ఆగిపోయినది.

"ఈ ఉద్రేకం కూడా మనకి ద్రోహం చేస్తుందా" అని అరిచాను.

"భయపడకబ్బాయ్" అన్నాడు మా పెదనాన్న ధీమాగా. కాని ఆయన బిగబట్టుకుని మాట్లాడటం గమనించాను. "కంగారుపడకు. ఇంకా ఎంతో సేపు ఆగం. అయిదు నిముషాలుపైన అయింది, త్వరలో అగ్ని పర్వతముఖద్వారం వైపు ప్రయాణం కొనసాగిస్తాం."

మాట్లాడుతున్నంతసేపూ ప్రొఫెసర్‌గారు క్రోనోమీటర్‌మీదనుంచి చూపు మరల్చలేదు. ఆయన చెప్పినట్లే జరిగినది. బలమయిన కుదుపుతో తెప్ప పైకి కదలినది. రెండు నిముషాలు ఈవిధంగా కదలి తిరిగి ఆగిపోయినది.

"మంచిది" అన్నాడు మా పెదనాన్న గంట చూస్తూ.

"పది నిముషాలలో బయలు దేర్తాం."

"పది నిముషాలా?"

"అవును. ఈ అగ్నిపర్వతం ఆగి, ఆగి ప్రేలుతున్న దనుకుంటాను. అది ఆగినప్పుడు మనమూ ఆగాలి."

ఆయన చెప్పినది పూర్తిగా నిజం. అనుకున్నట్లే మళ్లీ కదలిపోవటం ప్రారంభించాము. తెప్పమీదనుంచి దొర్లిపడిపోకుండా ఉండటానికి దాని దూలాలను గట్టిగా పట్టుకుని కూర్చొనవలసి వచ్చినది. ఆ తర్వాత ఆగిపోయాము.

ఆలోచించి చూస్తే ఇప్పటికీ ఆ సంఘటనలకు సరియైన కారణం ఏమిటో నాకు తెలియటంలేదు. అయినా, మేము అగ్నిపర్వతంయొక్క ముఖ్యమయిన పొగగొట్టంలో లేమని ఇప్పుడు అనిపిస్తుంది. అందుచేతనే క్రమంగాకాక, మా క్రింది పదార్థాలు కుదుపులు కుదుపులు కుదపులుగా పైకి త్రోసుకుని వచ్చాయి.

ఈవిధంగా ఎన్ని తడవలు జరిగినదో చెప్పలేను. కాని, ఆగి కదలిన ప్రతిసారీ, మా వేగం అధికం అవుతూ వచ్చినదని మాత్రం చెప్పగలను. రాకెట్ మీద ప్రయాణం చేస్తున్నట్లు ఉన్నది. మా మజిలీలు దుర్భరంగా ఉన్నాయి. గమనంలో వేడిగాలి ఊపు ఊపిరి సలపకుండా చేసేది. ఒకసారి నాకు అనిపించినది, సున్నా డిగ్రీలకు ముప్పై డిగ్రీలక్రింద ఉష్ణోగ్రస్థితిఉన్న ధ్రువ ప్రదేశం ఏదయినా చేరుకుంటే బాగుండునని. ధ్రువ ప్రదేశాలలోని మంచు బయళ్లమీద షికారు చేస్తున్నట్లు వూహించుకున్నాను. అక్కడ మంచుగడ్డలమీదపడి దొర్లాలని కోరుకున్నాను! అక్కడినుంచి, ఈ కుదుపులతో క్రమంగా నా మతిపోయినది. హాన్స్ గనుక నన్ను పట్టుకొనకపోయినట్లయితే నాతల గ్రానైట్ గోడలను ఢీకొని ముక్కలయిపోయి ఉండేది.

అందువల్లనే, కొన్ని గంటలవరకూ జరిగినవాటి వివరాలు ఏవీ సరిగ్గా జ్ఞాపకంలేవు. ఏవేవో ప్రేలి పట్టు, మా చుట్టూఉన్న రాయి అదిరి, మా తెప్ప సుడిగుండంలోపలె పరిభ్రమించినట్లు గుర్తు. మామీద బూడిద వర్షం కురిసినది. భయంకరంగా గర్జిస్తున్న జ్వాలలు మమ్మల్ని చుట్టివేశాయి. ఏదో ఒక రాక్షస భస్త్రిక ఈ మంటలను వూదినట్లు గాలి వీచినది. ఈ మంటల వెలుగులో హాన్స్ ముఖం కనిపించటం నాకు జ్ఞాపకం. తర్వాత నాలో చైతన్యం నశించినది. ఫిరంగి ముఖానికి కట్టబడి మరణశిక్ష అనుభవించటానికి సిద్ధంగాఉన్న వాడిని తన దేహం తునాతునకలయిపోతుందని ఏ విధమయిన భయం ఆవహిస్తుందో నన్నూ అటువంటి భయం ఆవహించినది. (సశేషం)

చూశారు. కాని ఈ పరిస్థితి ఎప్పటికీ నిలబడింది. ఆమె

తామున్న సమాజంలో చదువుకొని, సాధారణ అందం కలిగి, మగవారితో పరిసమానంగా ఉద్యోగం చేయదల్చుకున్న ఏ యువతైనా ఈ అవస్థలన్నీ పడవలసిందేనని లీల గ్రహించింది. వాటికి తగి నట్లే ప్రవర్తించేది. చివరకు, ఈమె గురించి తాను శ్రమపడి లాభంలేదని వాళ్ళు తమ ప్రయత్నాలు విరమించుకొన్నారు. చాలావరకు ఆమె తానొక పురుషునివంటిదేననేలన్నట్లు ప్రవర్తించేది. తనకి తోచిన మాటస్పష్టంగా చెప్పేసేది.

లీల అంతరాళంలో ఒక విశేషోద్దేశం వుంది. తన తండ్రికి తాము ముగ్గురు ఆడపిల్లలే అవటం వల్ల, తామందరూ అందులో పెద్దదైన తాను ముఖ్యంగా పెళ్ళి చేసేసుకుంటే తండ్రికి సేవ చెయ్య లేమనీ, అందువల్ల పురుషునివలెనే తాను ఉద్యోగం చేసి తలి తండ్రులను సుఖపెట్టాలనీ, అందుకోరకు పెండ్లి మానెయ్యాలనీ వుంది. దానికితోడు ఆమెకు ఏ పురుషుడిలో చూసినా, స్వార్థం, స్త్రీ జాతిని నిర సనగా చూసే అహంభావం కన్పించడంవల్ల, తనకు నచ్చిన పురుషుడు దొరకడం దుర్లభమనీ, ఎవరినో ఒకరిని పెళ్ళి చేసుకొని, జీవితాంతం బాధపడేకన్నా, పెళ్ళి లేకుండా స్వేచ్ఛగా ఒంటరి జీవితం గడపాలని కూడా వుంది.

ఆమెను స్త్రీ అనే ప్రత్యేకతతోకాక, సహజ మైన స్నేహంతోనూ, ఆత్మీయతతోనూ పలక రించినవాడూ, సదా ఆమెతో ఆవిధంగా మెలిగే వాడూ ఒక్క రవీంద్రనాథ్ మాత్రమే ఆమెకు కన్పించాడు. అతను ఆమెవద్ద ఏ విధమైన దాపరికం లేకుండా మెలిగేవాడు. తన కష్ట సుఖాలన్నీ ఆమెతో చెప్పుకొనేవాడు. ప్రతి చిన్న విషయంలోనూ ఆమె సలహా అడిగేవాడు. ఆమె ఎదైనా సలహా ఇస్తే వెంటనే పాటించేవాడు.

ఇంటి దగ్గర్నుంచి, తన తల్లి దగ్గరనుంచిగాని, చెల్లెళ్ళనద్దనుంచిగాని, ఏవైనా ఉత్తరాలొస్తే అవన్నీ ఆమెకు చదివి విన్పించేవాడు. తను చేసే ఖర్చుల సంగతి కూడా ఆమెకు చెప్పేవాడు. లీల అప్పు డప్పుడు తనకీ విషయాలన్నీ ఇతను చెప్పడం తను వాటిని ఓపికగా విని సలహా లివ్వడం, ఇవన్నీ తనకు అనవసరమైన పనులేమో ననుకొనేది. తను అసలు అంత లోతుగా అతని వ్యవహారాల్లో కలగజేసుకోవడం అనవసరమనుకొనేది. మళ్ళీ అతను బిక్కమొహం వేసుకొని, "లీలగారూ! మా అమ్మ దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందండీ" అనేసరికి, అతని మొహంలో ఆ దిగులెందుకు వచ్చిందో, ఆ దిగుల్ని పోగొట్టడ మెలాగో ఆలోచించి కనుక్కొనేదాకా ఆమెకు తోచేది కాదు

"ఏమని వ్రాసారు?" అని అడిగేది.

"ఏముంది. ఇంటిదగ్గర చాలా అవస్థగా వుందిట. డబ్బేమైనా పంపమని వ్రాసింది. ఎంత జాగ్రత్తగా వాడుతున్నా, నేను వాళ్ళకు ఎక్కువ పంపలేకుండా వున్నానండీ" అని రవీంద్రనాథ్ తన అసమర్థతకు విచారించేవాడు.

"అవును పాపం మీరు మాత్రం ఏం జేస్తారు? ఇక్కడ ఖర్చులలాటివయ్యే. మీ జీతం తక్కువ.

# స్నేహం

16-వ పేజీ తరువాయి

అందులో మీ భోజనం ఖర్చూ, కాఫీ హోటలు ఖర్చు......"

"కాఫీ హోటలుకు వెళ్ళడం మానేసానండీ. మీరు చెప్పారుగా కాఫీ హోటలు ఖర్చు మానెయ్య మని. అప్పటినుంచీ రోజూ విపరీతమైన తలనొప్పి వస్తున్నా, అలాగే బాధపడుతున్నాను. ఒక్కొక్క ప్పుడు భరించలేనంతగా వుంటుంది.........ఆ! అదేమిటి? మీ కండ్లలో నీళ్ళు వస్తున్నాయేమ్?"

"అబ్బే! ఏంలేదులెండి" అని, మొహం ప్రక్కకి తిప్పేసి కళ్ళు తుడుచుకొంది లీల. తను నెలరోజులక్రితం గట్టిగా కాఫీ హోటలు ఖర్చు మానెయ్యరాదా? అని అడగడం, అతను, "అలాగే" అనడం తనకు గుర్తుంది. కాని రోజుకు అయిదారు సార్లు కాఫీ త్రాగందే వుండలేని రవీంద్రనాథ్, తన

రండి! రండి! ఈ పెట్టెలో ఎంత డబ్బు ఉందో లెక్కపెడదాం" దొంగలనాయకుడు తోటివారిని ఆహ్వానించాడు.

"పోనిద్దూ! ఇప్పుడు బాగా అల సటగా ఉంది. రేపుపొద్దున్న దిన పత్రిక చూస్తే పెట్టెలో ఎంత ఉందో తెలుస్తుందిగా" ఒకడు బద్ధకంగావళ్ళు విరుచుకుంటూ అన్నాడు.

ఎస్. కోటేశ్వరరావు (సామర్లకోట)

మాటమీద విలువకొద్దీ, కాఫీ హోటలుకు వెళ్ళడం మానెయ్యడం, విపరీతమైన నొప్పితో బాధపడడం, ఆమె నాశ్చర్య పరచడమేకాక, ఆమె హృదయాన్ని కరిగించివేసి, ఆమె కంటిలో నీరు తెప్పించింది. కాని, ఆమె పైకిమాత్రం "కంట్లో ఏదో నలక పడింది. ఇప్పుడే వస్తానుండండి" అని ఇంటిలోపలికి వెళ్ళింది. పది నిముషాలలో కాఫీ తయారుచేసి, ఇంట్లోంచి తీసు కొచ్చి ఇచ్చింది రవీంద్రనాథ్ కి. ఆమె మొహంలో ఒక విధమైన సిగ్గుతో, "నాది పొరపాటు. కాఫీ ఖర్చు తగ్గిస్తే మంచిదనే వుద్దేశంతో అన్నాను కాని, పూర్తిగా మానెయ్యమని నా అభిప్రాయం కాదు" అంది లీల.

"బ్రతికించారు. కాఫీ త్రాగితే మీ రసలు ఒప్పు కోరేమో ననుకున్నా. ఇకనుంచి రోజుకు రెండుసార్లు మాత్రమే తాగుతాను. ఏమంటారు?

లీల ఏమంటుంది? ఇంత అమాయకుడైన యువ కు డెక్కడైనా వుంటాడా? అని తనలో తను ప్రశ్నించుకొంటోంది. ఆమె పైకిమాత్రం "అలాగే చెయ్యండి" అంది.

ఆరునెలల కాలంలో ఇలాటి సంఘటనలెన్నో జరిగిపోయాయి. ముఖ్యంగా రవీంద్రనాథ్ ఆఫీసు పనిలోనూ, 'సేల్సు'లోనూ సరిగా శ్రద్ధ చూపిం చటంలేదని సత్యమూర్తి అన్నప్పుడల్లా రవీంద్ర నాథ్ తన రూముకువచ్చి దిగులుపడుతూ కూచోడం లీల అతన్ని ఓదార్చడం అనేకసార్లు జరిగింది.

రవీంద్రనాథ్ తన శక్తినంతా ఉపయోగించి పనిచేస్తూ, కూడా సత్యమూర్తిని మెప్పించలేక పోతున్నాడు. ఒక్కొక్కనెల గడుస్తుండగానే ఆ నెలలో రవీంద్రనాథ్ చేసిన సేల్సూ, అతను చేసిన ఆఫీసుపనీ, సత్యమూర్తి పరీక్షించి విమర్శి స్తుండేవాడు. అతనికి రవీంద్రనాథ్ పని ఎంత మాత్రమూ నచ్చేదికాదు.

"మిస్టర్ రవీంద్రనాథ్ ఈ 'లైను'కు మీరు పనికిరారని నా అభిప్రాయం. మీ సేల్సు చాలా 'పూర్'గా వున్నాయి. మీరు బుక్ చేస్తున్న ఆర్డరు వల్ల కంపెనీకి చాలా నష్టం వస్తోంది. మీ ఫాదర్ లాగే మీరు టీచింగ్ లైనుకువెళ్తే మంచిది. 'బిజినెస్'లో చాలా తెలివితేటలూ, చురుకుదనం వుండాలి. నేను మీ గురించి పార్థసారధిగారితో ఆయన వచ్చినప్పు డల్లా 'రికమెండ్' చేస్తున్నాను. ఆయనకు మిమ్మల్ని వుంచటం ఏమాత్రం ఇష్టంలేదు. నేను ఎంతో నచ్చ చెప్పి మీ ఉద్యోగం పోకుండా కాపాడుతున్నాను" అని సత్యమూర్తి చెప్తుండేవాడు. ఈ ఆరు నెలల లోనూ సుమారు అయిదారుసార్లు పార్థసారధిగారు బెజవాడవచ్చి వెళ్ళడం జరిగింది. కాని ఆయన వచ్చిన సమయాలలో సత్యమూర్తి ఆదేశంమీద రవీంద్ర నాథ్ కు కాంపులు తిరుగుతూ వుండటంవల్ల, ఆయన కంటబడే అవకాశం లభించలేదు.

ఆరోజు మధ్యాహ్నం రవీంద్రనాథ్ ఆఫీసులో పని చేసుకుంటూవుంటే సత్యమూర్తి అతనిని పిలి చాడు. "మిస్టర్ రవీంద్రనాథ్, హఠాత్తుగా పార్థసారధిగారు వస్తున్నారు. ఆయన నా కిదివరకే నిన్ను ఉద్యోగంలోంచి తీసెయ్యమని చెప్పారు. అయినా నేను ఆయనకు స్వయంగా నచ్చచెబుదామని, నిన్ను తీసెయ్యకుండా వుంచాను. నా శాయశక్తులా నీ ఉద్యోగం వుంచటానికి ప్రయత్నిస్తాను. నీ గురించి చెప్పవలసిందంతా చెబుతాను" అన్నాడు సత్యమూర్తి.

ఖిన్నవదనంతో, "మీకు చాలా కృతజ్ఞుణ్ణి" అన్నాడు రవీంద్రనాథ్, మనసులో నిరుత్సాహం వ్యాపిస్తూ.

"ఇంకో విషయం. ఆయనకు నిన్ను పరిచయం చేస్తాను. ఆ సమయంలో నువ్వేమీ మాట్లాడొద్దు. ఆయన అడిగిన వాటికి జవాబివ్వటం, ఆయన ఏదైనాచెప్తే విని బయటికి వచ్చెయ్యడం. అంతకు తప్ప నువ్వేమీ మాట్లాడవద్దు. మనమేమైనాఅంటే ఆయనకు చాలా కోపం వస్తుంది" అన్నాడు సత్య మూర్తి.

"సరే"నని తల యూచాడు రవీంద్రనాథ్. తన ఉద్యోగం నిలుస్తుందనే నమ్మకంలేక, మెల్లిగా అడు గులు వేసుకుంటూ వెళ్ళి తన సీటులో కూర్చున్నాడు.

మరొక అరగంటపోయాక పార్థసారధిగారు కారులో దిగివచ్చారు. ఆయన సరాసరి మేనేజరు సత్యమూర్తి వున్న గదిలోకి వెళ్ళిపోయారు. ఒక గంటసేపు ఆయన మేనేజరుగారితో మాట్లాడారు. లీలకు కొన్ని ఉత్తరాలు డిక్టేట్ చేశారు.

## స్నేహం

రవీంద్రనాథ్‌ని మేనేజరుగారు రమ్మంటున్నారని ప్యూన్ వచ్చి చెప్పాడు. రవీంద్రనాథ్ పిరికి గుండెలతో మేనేజరు గది ప్రవేశించాడు. అప్పటికప్పుడే పార్థసారధిగారు బయటకు వెళ్ళడానికి సిద్ధంగా వున్నారు. రవీంద్రనాథ్ ఆయనకు నమస్కరించాడు.

సత్యమూర్తి ఆంగ్లంలో పార్థసారధిగారితో, "ఇతనేసార్ నేను మీకు చెప్పిన వ్యక్తి. ఒకసారి మీ దర్శనం చెయ్యాలని కోరాడు."

పార్థసారధిగారు రవీంద్రనాథ్ వైపు చూసి, ఆంగ్లంలో, "నేను చాలా విచారిస్తున్నాను. విధిలేక మిమ్మల్ని వుద్యోగంలోంచి తీసివెయ్యవలసివస్తోంది" అని మర్యాదగా చెప్పాడు. రవీంద్రనాథ్ ఆశ్చర్యపోయి ఏమీ మాట్లాడలేదు. ఏదో మాట్లాడదామనుకొని, సత్యమూర్తి మొహంచూసి ఆగిపోయి తల వంచుకొన్నాడు.

"నేను వెళ్ళవలసిన టైము అయింది. వెళ్తాను" అని సత్యమూర్తితోచెప్పి పార్థసారధిగారు వెళ్ళిపోయారు.

ఆయన వెళ్ళిపోయిన తరువాత, సత్యమూర్తి రవీంద్రనాథ్ తో, "నేను నీ గురించి ఎంతో శ్రమపడి చెప్పాను. కాని లాభం లేకపోయింది. క్యాషియర్ వద్దకువెళ్ళి నీకు రావలసిన జీతం పుచ్చుకో" అన్నాడు.

"అది నా దురదృష్టం" అంటూ రవీంద్రనాథ్ మేనేజరు గదినుంచి బయటకు వచ్చాడు.

ఆఫీసు వదిలిపెట్టివచ్చి తన రూములో ఒక్కడూ విచారిస్తూ కూచున్నాడు రవీంద్రనాథ్. మళ్ళీ తన అసమర్థత తనకు రుజువైంది. సత్యమూర్తి తనకెంతో ఉపకారం చెయ్యదల్చుకొన్నాడు. అయినా తను దానిని నిలబెట్టుకోలేకపోయాడు. తను ఈ ఆరు నెలలనుంచీ ఎంతో శ్రమపడి 'సేల్సు' చేశాడు. ఆఫీసులో ఒక రిద్దరు గుమస్తాలు తన సేల్సునుచూసి మెచ్చుకున్నారు. కాని సత్యమూర్తి మెప్పును పొందలేకపోయాడు. అదే తన తండ్రయితే......? ఎంతో సమర్థత చూపించివుండేవాడు!

"మీరు నా కోసం ఆగకుండా తొందరగా వచ్చేశారేం?" అంటూ లీల అతని గదిలోకి ప్రవేశించింది.

రవీంద్రనాథ్ దీనంగా "నా ఉద్యోగం పోయిన సంగతి మీకు తెలుసుగా!" అన్నాడు. అతనిని చూస్తుంటే లీలకు నవ్వు వచ్చింది. జాలి కూడా వేసింది. చిన్న చిరునవ్వు నవ్వింది.

"దానికొరకు బెంగపెట్టుకుంటున్నారా? ఈ ఉద్యోగంపోతే మరో ఉద్యోగం సంపాదించచ్చు. సమర్థతవుంటే ఎన్ని ఉద్యోగాలైనా సంపాదించవచ్చు. దాని కింత ఆలోచన ఎందుకు?"

"మరి, నేను సమర్థుణ్ణికానేమో అని....."

"అలా అని ఎవరన్నారు? మీరు ఈ ఆరు నెలలలోనూ చేసిన 'సేల్సు' ఇంతవరకూ ఎవ్వరూ చెయ్యలేదు. ఈ ఊళ్ళో బోలెడు కంపెనీలున్నాయి. మీరు సంపాదించిన అనుభవంతో వేరొక కంపెనీలో సులభంగా ఉద్యోగం పొందగలరు. నేను కూడా వాకబు చేస్తున్నాను. నాకు కూడా ఈ కంపెనీలో మానేసి మరోచోట చేరాలని వుంది" అంది లీల,

రవీంద్రనాథ్‌కు పోయిన ఉత్సాహమంతా తిరిగి వచ్చినట్లైంది. ఈ ప్రపంచంలో తను చేసిన పనిని మెచ్చుకునే వాళ్ళొకరైనా వున్నారు. లీల అన్న మాటలు అతని కెంతో బలా నిచ్చాయి. అతని మొహంలో విచార రేఖలు నశించి, సంతోషరేఖలు విజృంభించాయి. లీల అది గమనించింది.

"ఇవాళ మనం సినిమాకి వెళ్ళాలి. పూర్ణా థియేటరులో మంచి పిక్చరు వచ్చింది. త్వరగా తయారవండి" అని చెప్పి, లీల తన యింట్లో కెళ్ళింది. రవీంద్రనాథ్ ఉత్సాహంగా బట్టలు వేసుకో నారంభించాడు. లీల చెప్పినట్లు, తను ఈ ఉద్యోగం పోయిందన్న దిగులు మర్చిపోవాలి. మరో ఉద్యోగం వెంటనే సంపాయించాలి.

లీలా, ఆమె చెల్లెలు వనజా, రవీంద్రనాథ్, ముగ్గురు సినిమా కెళ్ళారు. దారిలో ఏవేవో ఇతర విషయాలు అనేకం సరదాగా మాట్లాడారు. సినిమా సగం అయ్యేసరికి, రవీంద్రనా తన ఉద్యోగం పోవడంగురించి మర్చిపోయాడు. యదాలాపంగా, "పార్థసారధిగారు తిరిగి మద్రాసు వెళ్ళిపోయారా?" అని అడిగాడు లీలని.

"లేదు. ఎవరో స్నేహితులఇంట్లో వివాహానికి వచ్చారట. రేపు కూడా వుంటారు. రేపు పదింటికి ఆఫీసుకు వస్తారట" అంది లీల.

సినిమా పూర్తయ్యాక లీల సినిమాని చాలా విమర్శించింది. రవీంద్రనాథ్ ఆమె విమర్శను ఖండించాడు. ఉత్సాహంగా తనకు తెలిసిన విషయా లనేకం చెప్పాడు. లీలనూ, వనజనూ తెగ నవ్వించాడు. రోడ్డుమీదే కొన్నిపాటలు పాడాడు. కొంచెం య్యాక్షను కూడా చేశాడు. లీలకు అతను మరీ అందంగా కన్పించాడు.

మరునాడు ప్రొద్దున్న ఎనిమిది గంటలకే సూటు వేసుకొని రవీంద్రనాథ్ బయటకు వెళ్తూంటే, లీల, అతను ఇంత ప్రొద్దున్నే ఎక్కడికి వెళ్తున్నాడా? అని ఆశ్చర్యపోయింది. తరువాత అతనే చెప్తాడులే అని పూరుకుంది.

పార్థసారధిగారు బెజవాడ వచ్చినప్పుడు, సాధారణంగా ఒక స్నేహితుడు ఇంట్లో దిగుతారు. అతనిపేరు కృష్ణారెడ్డి. పెద్ద వ్యాపారస్తుడు. చాలా భాగ్యవంతుడు.

కృష్ణారెడ్డి మేడమీద తన కోసం ప్రత్యేకించబడిన గదిలో పేపరు చదువుకుంటున్న పార్థసారధిగారితో నౌకరువచ్చి, ఆయనను కలుసుకోవడంకోసం ఎవరో ఒక యువకుడు వచ్చాడని చెప్పాడు. అతన్ని పిలవమని ఆయన చెప్పారు.

రవీంద్రనాథ్ పార్థసారధిగారి గదిలోకి ప్రవేశిస్తూ, ఆయనకు నమస్కరించి, "నేను మీ పరిచయం చేసుకోవాలని వచ్చాను" అన్నాడు. పార్థసారధిగారు అతని మొహంవేపు చూస్తూ, "ఓ! మీరా! ఉద్యోగం విషయం మాట్లాడాలని వచ్చారా?" అన్నాడు.

"ఉద్యోగం సంగతలా వుండనీయండి. నేను తమకు గుర్తున్నానా?" అని అడిగాడు రవీంద్రనాథ్.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్లుంది. మీపేరు?"

"ఆ వివరాలేమీ సత్యమూర్తి చెప్పలేదా?"

"ఏదో చెప్పాడు. మర్చిపోయాను."

"పోనీ! నేను రామకృష్ణగారి అబ్బాయినని చెప్పాడా?"

పార్థసారధిగారు రామకృష్ణగారిపేరు వినగానే, ఆశ్చర్యంగా, "ఏమిటీ? రామకృష్ణ అంటే నా మిత్రుడు...."

"అవును. అనంతపురం ఆర్ట్సు కాలేజీ సైకాలజీ లెక్చరరు వై. రామకృష్ణగారు మా నాన్న."

పార్థసారధిగారు పెల్లుబికిన సంతోషంతో, నువ్వు రామకృష్ణగారబ్బాయివా! చాలా సంతోషం. ఇలారా! నా ప్రక్కన కూచో. అయితే చెప్పవుకావేం" అని రవీంద్రనాథ్‌ని తన మంచంమీద కూర్చోపెట్టుకొని, "నిన్ను చిన్నప్పుడు చూసాను. మీ నాన్న పోయిన సంగతి నాలుగు నెలల్క్రింద నాకు తెలిసింది. ఇంకా నేను అనంతపురంవచ్చి నిన్ను కలుద్దామనుకుంటున్నాను. నువ్వు, నా ఆఫీసులో ఎప్పుడు చేరావు? సత్యమూర్తి నా కీ సంగతేమీ చెప్పలేదే?" అన్నారు.

"అదే నాకూ ఆశ్చర్యంగావుంది. పదేళ్ళ క్రిందట మీరు మా యింటికి వచ్చారు. అప్పుడు నాకు మీ పేరు తెలియదు. నిన్న మిమ్మల్ని చూడగానే గుర్తుపట్టాను. మీరు మా యింటికి వచ్చినప్పుడు నేనంటే ఎంతో ప్రేమ చూపించారు. అందుకని ఆ చనువు తీసుకొని మిమ్మల్ని కలుసుకోడానికి వచ్చాను. నిన్న ఆఫీసునుంచి వెళ్ళిన తరువాత, నాకు,సత్యమూర్తి నా గురించి మీకేమీ చెప్పివుండడని అనుమానం వేసింది."

"అనలేమీ చెప్పలేదు. ఎవరో వాళ్ళవూరివాడు తన ప్రాణాలు తీసేస్తూ, ప్రాధేయపడుతూంటే జాలి దల్చి నాలుగునెలలు సేల్సుమాన్ పని ఇచ్చానని, అతన్ని తీసెయ్యదల్చుకున్నానని చెప్పాడు. అయితే ఇదంతా నాటకం అన్నమాట! సరే వాడి సంగతంతా తరువాత కనుక్కుంటాను. ముందు నీ సంగతి చెప్పు" అని అడిగారు పార్థసారధిగారు.

రవీంద్రనాథ్ తను, తండ్రిపోయిన దగ్గర్నుంచీ పడిన కష్టాలన్నీ వివరంగా చెప్పుకొచ్చాడు. బెజవాడ తను ఉద్యోగాన్వేషిస్తూ రావడం, సత్యమూర్తి అన్న మాటలూ, చివరకి తను పార్థసారధిగార్ని మద్రాసు వెళ్ళి కలుస్తానంటేవద్దని తనకి అతను ఈఉద్యోగమివ్వడం, అప్పటినుంచీ జరిగిన విషయాలూ—అన్నీ వివరంగా చెప్పాడు.

అతను చెప్పిందంతా విని పార్థసారధిగారు సత్యమూర్తిమీద మండిపడ్డారు." "ఇది వాడు ఆడిన 'డబుల్ గేమ్'! నావల్ల నీకేమీ సహాయం జరక్కుండా ఈ ఎత్తు ఎత్తాడు. నేను స్వయంగా నిన్ను ఉద్యోగంలోంచి తీసేసినట్లు నీకు అభిప్రాయం కలిగించాడు. నువ్వు నా దగ్గరకు రావడం మంచి పని చేశావు. ఇక నువ్వేమీ దిగులు పెట్టుకోకు. రేపు నాతో మద్రాసు వచ్చేసెయ్యి" అన్నారు పార్థసారధిగారు. టైము పదిగంటలు అవడంవల్ల ఆఫీసుకు వెళ్ళేందుకు లేస్తూ. రవీంద్రనాథ్ కూడా లేచి నిల్చున్నాడు. పార్థసారధిగారు కోటు తొడుక్కుంటూ,



# స్నేహం

"అసలు సత్యమూర్తి ఈ ప్లాను ఎందుకు వేశాడో తెలుసా?" అన్నారు.

"తెలియదు?" అన్నాడు రవీంద్రనాథ్.

"బెజవాడ ఆఫీసులో ఒక క్రొత్త మేనేజర్ని వేసు కొని సత్యమూర్తిని హెడ్డాఫీసుకు పిలుపిస్తానని చెప్పాను. ఆ కొత్త పోస్టుకు తన బావమరది నొకణ్ణి రికమెండు చేస్తున్నాడు. అందుకు నువ్వు పోటీ తగులుతావేమోనని ఈ ఎత్తు ఎత్తాడు."

"అలాగా!" అన్నాడు రవీంద్రనాథ్ తెల్లపోతూ.

"కాబట్టి నిన్నే ఈ ఆఫీసుకు మేనేజరు చేస్తాను" అన్నారు నవ్వుతూ ఆయన. రవీంద్రనాథ్ ఆయనకు తన కృతజ్ఞత తెల్పాడు. ఆయన బయట తనకొరకు వేచియున్న కారులో కూచొని రవీంద్రనాథ్‌ని సాయంకాలంవచ్చి తనని కలియమని చెప్పారు. ఆయనవద్ద సెలవు తీసుకొని తన రూమునైపు కదిలిపోయాడు రవీంద్రనాథ్.

అనాళ రాత్రి లీలతో మాట్లాడుతూ రవీంద్రనాథ్ జరిగినదంతా చెప్పాడు. లీల అతనితో పార్థసారధిగారు ఆఫీసుకువచ్చి సత్యమూర్తిని చాలా కేక లేశారని, అతను ఆయన కాళ్లమీదపడి క్షమాపణ వేడుకున్నాడని చెప్పింది.

"సత్యమూర్తి మిమ్మల్నిలా మోసం చేశాడని ఎలా తెలుసుకున్నారు" అని లీల అడిగింది. దానికి రవీంద్రనాథ్, "మొదట్లో పార్థసారధిగారే నన్ను నిరాదరించారని కృంగిపోయాను. కాని ఆ సాయంకాలం మీ మాటలు నాకెంతో ధైర్యాన్నిచ్చి, కొత్త ఆలోచనలు నాలో రేకెత్తించాయి. ఆ రాత్రి చాలాసేపు అనేక విధాల ఆలోచించాను. నాలోవున్న లోపమేమిటా అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను నాకేమీ కన్పించలేదు. చివరికి ఇది సత్యమూర్తి లోపం ఎందుకు కాకూడదు? అని ఆలోచించాను. అప్పుడు అతను నన్ను మోసంచేసి వుండచ్చునని తట్టింది. అయినా అతని పాపాన అతను పోతాడులే అని వూరుకుందా మనిపించింది. కాని అలా వూరుకోవడంవల్ల నా చేత కాని తనమే బయల్పడుతుంది. అతని కోరిక నెరవేరుతుంది. నాకు అలా వూరుకో బుద్ధి వెయ్యలేదు" అన్నాడు.

"మొత్తానికి మీరు చాలా తెలివైనవారు" అంది లీల.

"అదంతా మీ ప్రోత్సాహమేకాని, నా తెలివికాదు. నా అదృష్టంవల్ల మీ స్నేహం లభ్యమైంది. మిమ్మల్నెప్పటికీ మర్చిపోను" అన్నాడు రవీంద్రనాథ్. లీల, అతని ఉద్దేశమేమిటా? అని అతని కళ్లలోకి చూసింది. అతను కూడా తనవైపే ప్రేమగా చూస్తుండడం చూసి, సిగ్గుపడి తను యింట్లోకి వెళ్లిపోయింది.



# సినీ విహారం

10-వ పేజీ తరువాయి

బెట్టి ప్రయాణం చేస్తున్నారు. ఏ పరిస్థితుల్లో, ఎక్కడికో అనే వివరాలు చిత్రం చూస్తుండగా మీరు తెలుసుకోవడంలో ఒక మజా ఉంది.

అసూర్యంపశ్య అయిన సరోజ ఎండలో మాడుతూ కాలి నడకన ప్రయాణం చేయాల్సి వచ్చింది. అలసిపోయిన ఆ ప్రాణి అదృష్టమా అంటూ కొంత దూరంలో ఒక కొత్త కారు వెడి పరుగుకు సమ్మె చేసింది. ఆ కారు యజమాని ఎవరో సాయెబు. ఈ జంట వాలకం చూసి "భాయ్! థోడా గాడీ బీమార్‌పడీ! కొంచెం నెట్టింపించండి. మీకీ ఎక్కించుకుపోతాం" అని కోరాడు.

"ఏం? స్టార్టింగ్ ట్రబులా?" అని రాజా తన సందేహం తీర్చుకుని సహధర్మచారిణి అయిన సరోజ సలహాను "తోద్దామా!" అని అడిగాడు. ఆపద్బాంధవుడిలా వచ్చిన ఈ కారును కొత్త దంపతు లిద్దరూ తోశారు. నెమ్మగా, నెమ్మగా కారుకి కోపం వచ్చి కదుల్తానంది. రాజా సరోజలు కారులో ఎక్కారు. జై వీర హనుమాన్! అని ఆ కారు యజమాని సాయెబూ, చలో బ్రహ్మచారీ అని రాజా కేరింతలు కొట్టారు. ఆ కారు వీరి కేకల సంబరానికి కించపడి కొంత దూరం నడిచాక మళ్లీ కుంటడం ప్రారంభించింది.

"అరే! హేమిటే తోశావమ్మా! ఖుసు! ఖుసు!" అని సాయెబు వెక్కిరించాడు సరోజను. ఆమె ముఖం మూడు నయాపైసల కాసంత అయింది

"మళ్లీ ఆగిపోయిందే!" అని ఆశ్చర్యం ప్రకటించాడు రాజా.

"అరె కొంచెం వెయ్యి వెయ్యి భాయ్!" అని మళ్లీ కోరాడు సాయెబు.

'కారు చూస్తే కొత్తగా ఉంది. కదలనంటుందే' అని సందేహం వెలిబుచ్చాడు రాజా. "అహా! కొత్త వాటిల్లో ఉండే పేచీ ఇంతే భాయ్!" అని లోకం తీరును చెబుతూ సాయెబు మరో ప్రశ్న వేశాడు. "మీకీ పెళ్లి ఎప్పుడూ అయిందీ?" అని.

"ఈమధ్యే అయిందిలే" అని జవాబిచ్చాడు రాజా.

"అయితే నీకూ తెలిసే ఉండాలే! కొత్త పెళ్లాం, కొత్త కారూ కాస్త దారిలో పడేదాకా కష్టం భాయ్! .... తొయ్" అని సాయెబు చిన్న చురక అందించాడు రాజా—మీదుగా సరోజకు.

ఈ హాస్యరస సన్నివేశం విజయా చిత్రం "గుండమ్మ కథ" లోనిది. రాజాగా నాగేశ్వరరావు, సరోజగా జమున, సాయెబు రూపంలో ఎన్. టి. రామారావులు చాలా చక్కగా నటించారు; లొకేషన్ విజయాగార్డెన్స్; దర్శకుడు: కె. కామేశ్వరరావు, కామెరా: మార్కస్ బార్ట్లే, సౌండ్: శివరామ్, సహాయ దర్శకులు: సి. నాగేశ్వరరావు, కె. బాబూరావులు, రచన: డి. వి. నరసరాజు, కథ: చక్రపాణి, నిర్మాతలు: నాగిరెడ్డి, చక్రపాణి. ★



"మంచి మనసులు"లో వాసంతి.

చిత్రసమీక్ష

# టెక్నిరమా భారీ చిత్రం స్పార్టకస్

అహం చెడ్డది అహం దొడ్డది కూడా. సామ్రాజ్య వైభవాల వెనుక, వాటి పతనాలచాటున యిదే చిత్త వైకల్యంయొక్క విపరీత చేష్ట లగుపిస్తాయి. భారీ చిత్రాలు, బ్రహ్మాండమైన చిత్రాలు యివాళ తీయడానికి, వెనుకటి చరిత్రలలో వీటి కాధార భూతమైన కథలు జరగడానికి కూడా 'అహం' కారణా లుంటాయి 'స్పార్టకస్' చిత్రం కూడా వెనుకటికి హెచ్చింపు రేట్లతో ప్రేక్షకులు భరించిన 'సామ్సన్ డిలైలా' మొదలు 'బెన్‌హర్'వరకూగల చిత్రమా లలో మరో చిత్రంగాచేరి, చాలినంత భారీగావుంటుంది. 'భారీ అనే విశేషణం ఈ చిత్రానికి ఏ కోణంలోనించేనా అతుకుతుంది. 'మూడుంపావు' గంటలు నడిచే ఈ సూపర్ టెక్నిరమా టెక్ని కలర్ చిత్రంతో భారీ తారాగణం, బ్రహ్మాండమైన సెట్టింగులు వున్నాయి. దీనికితోడు యిది అప్పుడే నాలుగు అకాడెమీ అవార్డుల నందుకుని వచ్చింది. ఐతే ఈ నాలుగింట మూడు అవార్డులు, సాంకేతిక విలువలకు సంబంధించినవే గనుక దీని 'టెక్నికల్ వాల్యూ' ముందుగానే మనం వెయ్యొచ్చును. హొవార్డ్ ఫాస్ట్ రాసిన చరిత్రా అంచనా త్మక నవల ననుసరించి దీనికి "త్రి డాల్టన్ ట్రూంబో" స్క్రీన్‌ప్లే రాశాడు. క్రీ. పూర్వం (67—71) లో రోమను చరిత్రలో స్పార్టకస్ కనిపిస్తాడు. థ్రాసియన్ జాతీయుడైన ఈ "స్పార్ట కస్" యుద్ధ ఖైదీగా పట్టుబడి పిదప 'బానిస'గా అమ్మబడి తిరుగుబాటు చేసి "కాపువా" నుంచి 'బానిసల'ను తీసుకు పారిపోయి కొండలు పట్టిపోయి "గొరిల్లా మార్కు" యుద్ధా లనుచేసి, సుమారు తొంభై వేలమంది బానిస సైన్యం తో రోమను సామ్రాజ్యాన్నే కసిగా తుద ముట్టించా లని తలచి, తన బానిసపటాలలో చీలికలు సంభ వించిన కారణంగా 'క్రాస్సస్'సేనల చేతిలో హతమవడం ఆధారంగా ఈ చిత్ర కథ నడుస్తుంది. ఈ చిత్రం చివరికి స్పార్టకస్, మరి ఆరువేలమంది బానిసలతో సహా శిలువ వేయబడతాడు. కథ క్లుప్తంగా యిది: 'స్పార్టకస్' యజమానీ, 'కపువా'లోని గ్లాడియేటర్ స్కూలు(ఖడ్గ శిక్షణశాల) అధిపతిఅయిన "బెటాయి టస్" ఒకనాడు రోమ్‌కు వెడుతూ, తనను చూడ వచ్చిన జెనరల్ క్రాస్సస్ (పలుకుబడి అధికారంవున్న సెనెటరు)కు వినోదం కలిగించాలని, తన బానిసలలో నలుగుర్ని ఎన్నుకుంటాడు. వీరితో యిద్ద రేసివంతున ద్వంద్వయుద్ధం. అందులోని ఒకరు చచ్చేవరకూ కొనసాగించాలి. మనుషుల ప్రాణాలతో వినోదించే ఈ ప్రదర్శనలో 'స్పార్టకస్' అతనితోటి బానిస 'డ్రాబా' (నీగ్రో)లు తలపడవల్సివస్తుంది. 'డ్రాబా' త్రిశూలధారియై స్పార్టకస్‌ను ఎదుర్కొంటాడు. అయితే స్పార్టకస్‌ను ప్రేమిస్తున్న బానిస 'వెరె నియా' అనే చిన్నది భయభ్రాంతయై చూస్తున్నం దున జాలిపడి 'డ్రాబా' స్పార్టకస్‌ను చంప నిరాక రించి, "క్రాస్సస్" మీదకే ఆ త్రిశూలం విసిరి, ఉగ్రుడై, "గ్యాలరీలోకి లంఘిస్తాడు. కాని 'డ్రాబా'ను చంపేస్తారు. ఈ సంఘటన 'స్పార్టకస్'లో విప్ల వాన్ని తెస్తుంది.దీనికితోడు 'వెరినీయా'ను "క్రాస్సస్ కొనుక్కుని వెళ్ళిపోతూండటం ఉద్రేకాన్నిస్తుంది. ఇదే బానిసల తిరుగుబాటుకు కారణమవుతుంది. బాని

**లు 'కాపువా' నుంచి వెరేనియాతో సహా పారిపోతారు.** కొండలమీద, ఇటలీలోని బానిసల నందర్నీ చేరదీసి స్పార్టకస్ బానిస 'పటాలా'లనే తయారు చేస్తాడు స్వార్థచింతన తగ్గి, స్పార్టకస్‌కు బానిసలందర్నీ విముక్తి చేసి సముద్రాలమీదుగా 'విడుగర' కల్పించాలనే తీవ్రమైన కోర్కె కలుగుతుంది. బానిస పటాలాల జయపరంపర సమస్య రోమ్ సెనేటులో సంకటమయమవుతుంది. 'క్రాస్సస్' కూ రోం రాజకీయ నాయకుడైన గ్రాక్షస్‌కూ మధ్య కావేషీలు, కీర్తి కండూతి అదివరకే ప్రబలివుంటాయి. గ్రాక్షస్ 'క్రాస్సస్' సెనేటులోలేని సమయంలో రోమ్ సేనా నాయకుడైన గ్లాబ్రస్‌ను, బానిస సేనలను నిర్మూలించమని పంపుతాడు కాని 'గ్లాబ్రస్' అవమానం పాలైవస్తాడు. ఈలోగా వెరినీయా గర్భవతి అవుతుంది. 'స్పార్టకస్' దళాలు సముద్రపొడ్డు చేరుకుంటాయి.అక్కడనించి అరబ్ సముద్ర బందిపోటులకు "ధనరాశులు కుమ్మరించి పడవలు సంపాయించి, తమ తమ దేశాలకు పారిపోవాలని 'బానిస'ల పథకంగాని, 'అరబ్ దొంగలు' రోమన్ 'లంచాల''కు లొంగిపోతారు. ఈ దగా, భరించలేని స్పార్టకస్ 'రోమ్' నెదుర్కొన దాడి నడుపుతాడు. ఈలోగా 'క్రాస్సస్' ముస్పేట దాడిచేసి వీరి నెదుర్కొని, ఆరువేలమంది తప్ప తతిమ్మావారిని హతమారుస్తాడు. 'క్రాస్సస్' చేత వెరేనియా "పసిగుడ్డు" తో సహా పడుతుంది. 'క్రాస్సస్‌కి వెరేనీయా'ను గెల్చుకోవాలనే అహం మొదట్నుంచీ వున్నది. కాని, అతగాడు స్పార్టకస్ ఎవరో పోల్చుకోలేదు. 'వెరేనియా' అతనిని ఎందుకు ప్రేమించిందో కూడా పోల్చుకోలేకపోతాడు. ఈలోగా 'గ్రాక్షస్' తన 'రాజకీయ వోటమి' (క్రాస్సస్ గెలిచాడు కదా) ని సహించలేక, వెరినీయాను పసిబిడ్డతో సహా విడుదలకు "బటియాటిస్" సాయంతో ఏర్పాటుచేసి ఆత్మహత్య చేసుకుంటాడు. స్పార్టకస్ అంటానియస్‌లకు ద్వంద్వయుద్ధం జరిపి చావగా **మిగిలినవాణ్ణి 'శిలువ' వేయమని క్రాస్సస్ ఉత్తర్వు** వేస్తాడు. 'అంటోనియస్' స్పార్టకస్‌ను "కొరత" నుంచి రక్షించాలని చూస్తాడుకాని, స్పార్టకస్ 'కన్న కొడుకులాంటి' మిత్రుడైన అంటానియస్‌ను చంపేస్తాడు. ఈ విధంగా ఒక మహత్తర ధ్యేయం దారుణమైన బలిదానం కాగా, స్పార్టకస్ శిలువ వేయబడతాడు. ఐతే ఒక్క తృప్తితో అతను ప్రాణాలు విడుస్తాడు. శిలువమీది "తుది" గడియల్లో "వెరేనియా" వెళ్లి బిడ్డను చూపి, "వీడు నీ కొడుకు. వీడు స్వేచ్ఛాజీవి బానిసకాదు" అని చెబుతుంది.

"స్పార్టకస్"గా "కిర్క్ డగ్లస్, "అంటానియస్" "గాటోనీ కర్టిస్", "వెరేనియాగా" "జీన్ సిమ్మన్స్" "క్రాస్సస్‌గా" "లారెన్స్ ఆలివర్" గ్రాక్షస్‌గా "ఛార్లెస్ లాటన్"లు నటించారు.

'బెటాంయిటస్'గా నటించి, ఉపపాత్రలలో ఉత్తమ అవార్డు పొందిన 'యూస్టినోవ్' నటన, అంటానియస్‌గా 'టోనీ కర్టిస్' నటన, జూలియస్ సీజర్ (అప్పటి కింకా లేతవాడు)గా జార్జి గావిన్ విగ్రహం ప్రశంసనీయంగా వున్నాయి. 'డ్రాబా' (నీగ్రో) గా 'వుడీస్ట్రోడ్' నటన ప్రేక్షకుల హృదయ ఫలకాలమీద ముద్ర వేస్తుంది. వాతావరణాన్ని, సెట్లను, తదితర పాత్రలను 'ఎక్స్‌ప్లోయిట్'' చేయడంలో ప్రశంసనీయమైన కృషి చేసిన నిర్మాతలూ, దర్శకుడూ "శ్రీ స్టాన్లీ క్యూబ్రిక్"లు (సాంకేతికంగా సరేసరి) 'స్పార్టకస్' పాత్రను 'గ్లోరిఫై' చేయకపోడం మెచ్చదగిన విషయం. దృఢచిత్తుడు, దృఢకాయుడూఐన స్పార్టకస్'గా 'డగ్లస్' అతని 'ప్రేయసి'గా సిమ్మన్స్'లు పాత్రోచితంగా నటించారు. యుద్ధ భీభత్సం, రోమను సామ్రాజ్య స్నానశాలలూ సెక్సీ రమాలో "భారీ"గా చూపించే ఈ చిత్రాన్ని కూడా ప్రేక్షకులు హెచ్చింపు రేట్లతో భరించాలి.

—కృష్ణానంద్

# చిత్రజగతికి అపూర్వ కానుక
# "సర్కారామ": వాల్ట్ డిస్నీ సృష్టి

మిక్కీమౌస్, డొనాల్డ్ డక్ వంటి కార్టూను చిత్ర నిర్మాతగా జగద్విఖ్యాతిగాంచిన వాల్ట్ డిస్నీ కృషిఫలితంగా సర్కారామ ఉద్భవించింది. ఈ అద్భుత చలన చిత్రాన్ని మద్రాసులో ప్రత్యేకంగా నిర్మించిన డియోడసిక్ డేరాలో మార్చి 25 వ తేదీ నుంచి ప్రదర్శిస్తున్నారు.

శ్రీ వాల్ట్ డిస్నీ నిర్మించిన ప్రఖ్యాత కాలిఫోర్నియా వినోదారామం డిస్నీలాండ్‌లో దీనిని కూడా ప్రదర్శించాలని ఆయన తొలుదొల్త ప్రయత్నించారు. శ్రీ నెహ్రూ ఇటీవల అమెరికా సందర్శించినప్పుడు డిస్నీల్యాండ్‌కూడా చూచి వచ్చారు. అక్కడ 1956 లో ప్రారంభమైన సర్కారామ ప్రదర్శనలు ఇంకా జరుగుతూనే ఉన్నవి. అమెరికాలో వివిధప్రాంతాలను ఒక విలాసయాత్రలె చూపించే సర్కారామా అపూర్వ నిర్మాణ, ప్రదర్శన పద్ధతులతో ప్రేక్షకులకు వింత అనుభూతి కలిగిస్తుంది.

ఒకే కేంద్రంనుంచి వేర్వేరు దిశలు కనిపించేలా లెన్సులు ఏర్పాటు చేయబడిన 11 మూవీ కెమెరాలను ఒకే స్థానంలో ఏర్పాటుచేసి ఆ యాత్రా చిత్రం తయారుచేశారు. వివిధదృశ్యాలను చిత్రీకరించేటప్పుడు ఆ కెమేరాలను మోటారుకారు పైన ఒక పీఠానికి బిగించేవారు. లేదా విమానానికి వ్రేలాడదీస్తూండేవారు. ఆ చుట్టుప్రక్కల దృశ్యాలన్నీ ఒకేసారి ఫోటో తీయటానికి అలా వీలయింది.

ఆ రంగులచిత్రాన్ని విద్యుచ్ఛక్తి సహాయంతో ఒకేసారి నడిచే 11 ప్రొజెక్టర్లతో 11 తెరలపై ప్రసరింపజేస్తారు. 49 అడుగుల వ్యాసంగల స్తంభాకారం చుట్టూ పైభాగంలో ఒక్కొక్కటి 10 అడుగుల ఎత్తు 13 అడుగుల పొడవు గల తెరలపై ప్రసరింపచేస్తారు. ఇదే సర్కారామ థియేటరు. ఆ స్తంభాకారానికి చుట్టూ ఆ 11 ప్రొజెక్టర్లను ఏర్పాటుచేసి, ఒక్కొక్క ప్రొజె

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది.

# సర్కారామ

క్టరు ఒక్కొక్క తెరమీద చిత్రాన్ని ప్రసరించే టట్లు చేస్తారు.

ఆ స్తంభాకారం మధ్యభాగంలో అంటే దుట్టూ ఉన్న 11 తెరల మధ్య ప్రేక్షకులు ఉంటారు. నలుదిశలనుంచి ప్రసారమయ్యే చిత్రాన్ని చూస్తుంటే వారు వాస్తవంగా ఆ ప్రాంతంలో ఉంటున్న అనుభూతి కలుగుతుంది. అమెరికా తూర్పుకోస్తా అట్లాంటిక్ మహా సముద్రంనుంచి పశ్చిమకోస్తా పసిఫిక్ మహా సముద్రంవరకూ అమెరికాలో ఆకర్షణీయ ప్రాంతాలు చూసుకుంటూ యాత్ర చేస్తున్న ట్లుంటుంది వారికి

ప్రేక్షకుడు తాను నడుస్తున్నట్లు, మోటారు లోనూ, విమానంలోనూ ప్రయాణంచేస్తు న్నట్లు భావించుకోగలుగుతాడు. వివిధ దృశ్యాలు, ప్రజలు, పట్టణాలు ఎన్నో చూడగలుగుతాడు. మామూలుగా తనకు ఎదురుగా ఉండే తెరపై బొమ్మపడినప్పటి అనుభవానికీ, ఎటు చూసినా బొమ్మ కనిపించే ఈ అనుభవానికీ ఎంతో వ్యత్యాసం ఉండటంచేత సంభ్రమాశ్చర్యాలకు లోనవుతాడు. ఉదాహరణకు, ఎదురుగా చూస్తుంటే న్యూయార్కు నగరవీధుల్లో ఆకాశాన్ని అంటే హర్మ్యలమధ్య కారులో వెళ్తున్నట్లుంది ఇరు ప్రక్కలకు చూస్తే ఆ భవనాలు వగైరా ప్రక్కగా దూసుకుపోతున్నట్లు కనిపిస్తుంది వెనుకకు తిరిగి చూస్తే పైన చెప్పిన మేడలు వగైరా వెనుకకు పోతున్నట్లు, ఆ వీధిలో తాను ముందుకు పోతు న్నట్లు అనిపిస్తుంది ప్రస్తుతం ఇండియాలో ప్రదర్శింపబడుతున్న సర్కారామను డిస్నీ స్టూడియోస్‌లో 1957 లో నిర్మించారు మరు సంవత్సరం బ్రసెల్స్ ప్రపంచసంతలో తొలిసారి ప్రదర్శించారు. అప్పటినుంచి కాసబ్లాంకా, మాస్కో, జకార్తా, కాబూల్, కొలంబో, హెల్‌సింకీ నగరాల్లో ప్రదర్శించారు. ఇటీవల కొన్ని నెలలక్రిందట అమెరికా సమాచారకార్యాలయం వారి ఆధ్వర్యాన కలకత్తా, బొంబాయిలలో ప్రదర్శించారు. ఇంతవరకు 60 లక్షల మందికి పైగా చూచారు. మద్రాసు తర్వాత దానిని బెంగుళూరు, ఢిల్లీ నగరాల్లోకూడా ప్రదర్శిస్తారు.

మద్రాసులో కాంగ్రెసు ప్రదర్శన మైదానం (తేనాంపేట) లోని అల్యూమినమ్—ప్లాస్టిక్ డియోడెసిక్ డేరాలో సర్కారామ థియేటరు ఏర్పాటు చేశారు. ఏర్ కండిషను చేసిన ఆ థియేటరులో 600 మంది ప్రేక్షకులు 22 నిమిషాలసేపు ప్రదర్శింపబడే ఆ సర్కారామా చిత్రాన్ని చూడవచ్చును. ఆటకు ఆటకు మధ్య ఎక్కువ ఆలశ్యం కాకుండా ఉండేటందుకు ఆ 16 మిల్లిమీటర్ల ఫిల్మ్ 11 ప్రొజెక్టర్లలో కంటిన్యూస్—లూపుగా తిరుగుతుంది. 

### గమనిక

'యువప్రపంచం' శీర్షికకు వచ్చే వ్యాసాలూ, ఉత్తరాలూ కూడా చాలామట్టుకు 'కాంపోజిషన్' వ్యాసాలను పోలి ఉంటున్నాయి. యువప్రపంచానికి సంభవించే సమస్యలు చర్చించే బదులు చాలవరకూ అప్రస్తుతమయిన విషయాలు ఉద్బోధించే పద్ధతి కనిపిస్తున్నది! రాజకీయ నాయకుల ఉపన్యాసాలే పునశ్చరణ చేసి లాభంలేదు! యువ రచయితలు ఇది గమనించి నేటి యువప్రపంచం ఎదుర్కొనే సమస్యలను నిర్మొహమాటంగా చర్చించినట్లయితే ఈ శీర్షిక లక్ష్యం కొంతమట్టుకు నెరవేరుతుంది!

### రచయితలకు విజ్ఞప్తి

రచయితలు తమ రచనలతోను, రేఖా చిత్రములతోను, తగినన్ని తపాలా బిళ్ళలు అంటించి, చిరునామా వ్రాసిన కవర్లు జతచేసి పంపగోరుతాము అట్లా పంపితేనే నిరాకరించిన రచనలను మరి కొంత త్వరగా త్రిప్పి పంపటం సాధ్యమవుతుంది.

# సంక్షిప్త వార్తలు

## "భార్యాభర్తలు"కు రజిత పతకం

ప్రసాద్ ఆర్ట్స్‌వారు నిర్మించిన "భార్యాభర్తలు" చిత్రానికి తెలుగుభాషలో ఉత్తమచిత్రంగా రజిత పతకం లభించింది ఏటా భారతప్రభుత్వం నిర్వహిస్తున్న పోటీలో, ప్రాంతీయభాషలో ఉత్తమమని నిర్ణయించినవాటికి ఈ బహుమతి దక్కుతుంది "ధర్మపుత్ర (హిందీ), మానిని (మరాఠీ), సమాప్తి (బెంగాలీ), శకుంతల (అస్సామీ) కప్పలోట్టియ తమిళన్ (తమిళం), ముదియనాయపుత్రన్ (మళయాళం) అనే చిత్రాలు కూడా ఉత్తమ ప్రాంతీయ చలనచిత్రాలక్రింద రజితపతకాన్ని పొందుతాయి

ప్రేమంటే పైలావచ్చీసుగా తిరగటమే నను కునే ఓ యువకుణ్ణి విముఖతతోనే, పరిస్థితులకు బానిసగా తయారై వివాహంచేసుకుని, అనునయంద్వారాగాకుండా నిగ్రహ నిశ్చలతలతో భర్త జీవితపథాన్నే మార్చివేసిన యువతిగాథ, ఇతివృత్తంగా గల "భార్యాభర్తలు" (తెలుగు) నాయికీ నాయకులుగా కృష్ణకుమారి—నాగేశ్వరరావు, గుమ్మడి రేలంగి, సూర్యకాంతం ప్రభృతులు నటించారు దర్శకత్వం ప్రత్యగాత్మ, సంగీతం రాజేశ్వరరావు, నిర్మాత ఏ వి సుబ్బారావు చిత్రంలో పాల్గొన్న కళాకారులకు సాంకేతిక శాఖకు అభినందనలు

## "రాజాధిరాజు కథ"

యం జి రామచంద్రన్, పద్మిని, నంబియార్, వీరప్ప, నటించిన తమిళ జానపదచిత్రం "రాజ రాజన్"ను కావ్యశ్రీపిక్చర్స్‌వారుతెలుగులో పై పేరుతో తర్జుమాచేస్తున్నారు

"ములుకుట్ల" వ్రాస్తున్న పాటలకు సంగీత దర్శకుడు జె పురుషోత్తం బాణీలు సమకూరుస్తున్నారు

## వర్ణచిత్రం 'మురిపించే మువ్వలు'

దక్షిణాదిలో ప్రముఖ నాదస్వరవిద్వాంసులైన శ్రీ కరైకురిచి అరుణాచలం ఈ చిత్రంలో నాదస్వరం వాయించారు నాదస్వరంమీద పాడిన పాటలు ఈ చిత్రములో చాలా ప్రముఖపాత్ర వహించాయి

ప్రముఖ నాట్యతారలు కుమారి కమల, కుచల కుమారి, ప్రదర్శించిన పోటీనాట్యం ఈ చిత్రంలో మరొక ముఖ్యమైన ఆకర్షణ

ఈ చిత్రాన్ని త్వరలో విడుదలచేయడానికి నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు తగు సన్నాహాలు చేస్తున్నారు ★



బి. ఎ యస్ వారి "భీష్మ" లో
సూర్యకాంతం, ఎ. వి. సుబ్బారావు





ప్రతివారం ఆంధ్ర దేశమంతటా లక్షలమంది ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదివి ఆనందిస్తూ ఉంటారు. మీ స్థానిక ఏజెంటు ద్వారా చందాదారులయితే మీ కాపీ మీకు వారం వారం నిశ్చయంగా చేరగలదు.





# హరివంశం

14-వ పేజీ తరువాయి

చున్నదా! ఈమెకు నేను భర్తను శ్రీకృష్ణుడు భగవంతుడు మేము రెండు కత్తులము ఒక్క ఒరలో ఒదిగించవలయునని ఈమె చూచుచున్నది. అది యెట్లు కుదురును?

"సుదక్షిణ"

"స్వామి!"

"నేను నీకు భగవంతుడను"

"తమరు నాకు భర్తలు మాత్ర మగుదురు ఈ శరీరము మీది కాశికవలె మరి కాశికకు మీరు బాహ్యమున ప్రభువులు కాశిక ఆత్మకు పరమ శివుడు ప్రభువు శ్రీకృష్ణ వాసుదేవుడు నా ఆత్మకు ప్రభువు. ఇది మీకు తెలియనిది కాదు ఏల నాచేత చెప్పింతురు?"

పౌండ్రకుని ముఖములో కోపము కన్నులలో ఎర్రజీరలుగా సాగెను సంధ్యారాగ మలముకొనిన ఆకాశమువలె నతని ముఖ మెర్ర నయ్యెను ఆ కన్నులతో, ఆ ముఖముతో నాతడు సుదక్షిణను చూచెను సుదక్షిణలో మార్పు లేదు భయము లేదు ఆమె మందహాసము చేయుచు భర్తను తిలకించుచుండెను పౌండ్రకు డిట్లు లనెను.

"అవును నీవు పతివ్రతవు"

సుదక్షిణ మాటాడలేదు పౌండ్రకునకు కోపము మరియు నెక్కుడయ్యెను తాను వచ్చిన పని యేమి! ఇక్కడ జరిగినది యేమి! అదియే అతనికి విచిత్ర మనిపించినది అతడు గిరుక్కున వెనుకకు తిరిగి మరల మంత్రాలోచనా మందిరమునకు వచ్చివేసెను అతనిని అప్పటి ఆకారమును చూచి బ్రాహ్మణులు భయపడిరి రాజా ఏమనునో అనుకొనిరి రాజా ఏమియు ననలేదు. వారిని చూచి విచిత్రమందహాసము చేసెను. విరిగిన ధనస్సు వలె పిస్మములను విరచెను. అంతలో నకృద్ధానము చేసెను బ్రాహ్మణుల కిది యేమో అర్థము కాలేదు వారు రాజును చూచుచు విచిత్రమనస్కులై కూరుచుండిరి రాజా మరల అసకృద్ధానము చేసెను తనలో తానే ఏదో మాట్లాడుకొనుచున్నట్లు తలను పంకించుచు నటు నిటు తిరిగెను రాజా ఈ విచిత్ర స్థితిని చూచి బ్రాహ్మణులు ఆశ్చర్యపోయిరి అంతలో పౌండ్రకుడు వికటముగ నవ్వుచు బ్రాహ్మణులతో నిట్లు లనెను

"మేము ధర్మపరిషత్తు జరిపించెదము మేమ్మె యీ విషయము నేమని తేల్తుము. తేల్చినచో బాగుగ నుండదు ఇది పరిషత్తులో తేలవలసిన విషయము ఆచార్య మహానందులు వర్ణాశ్రమాచార ధర్మములకు విరుద్ధముగా ప్రవర్తించిరో, లేదో, పరిషత్తు చర్చించును అప్పుడు మేము మా అభిప్రాయమును చెప్పెదము"

అని పౌండ్రకుడు తన మందిరములలోనికి పోయెను

బ్రాహ్మణులు అతని ప్రవర్తనమునకు, అతని ఆడిన మాటలకు పొందిక కుదరక మరియు నాశ్చర్యమును చెందిరి (సశేషం)



శ్రీ జి. ఎల్. నందా

# న్యూఢిల్లీ లేఖ

11–వ పేజీ తరువాయి

నికి ఏడు టెండర్లు వచ్చాయి. వీటిలో బ్రిటన్ నుంచి వచ్చిన టెండరుకూడా ఒకటి ఉన్నది. ఇది ఎక్కువగా ఉన్నట్లు అధికారులు భావిస్తున్నారు. అంతేకాక కాలదోషంపట్టిపోయిన యంత్ర పరికరాలను ఈవిధంగా వదిలించుకోవాలని బ్రిటన్ ఎత్తువేస్తున్నదని కొందరు అంటున్నారు. ఈ సందర్భంలో బ్రిటన్‌కు సంబంధించినంత వరకు మరొక ఆటంకంకూడా ఉన్నది. విద్యుత్ కేంద్ర నిర్మాణానికి పెట్టే పెట్టుబడి, ఇంతకుమునుపు బ్రిటన్ ఇవ్వడానికి అంగీకరించిన సహాయంలో భాగంగా సరిపెట్టే వీలులేదు. అంటే అదనంగా పెట్టుబడిపెట్టాలన్నమాట. ఇందుకు బ్రిటిష్ ప్రభుత్వం ప్రజలకు సంజాయిషీ చెప్పుకోవలసి వస్తుంది.

ప్రపంచబ్యాంకు నివేదిక వచ్చిన తరువాత, ఒకదశలో అమెరికా ఈ పథకానికి పెట్టుబడి పెట్టేందుకు నిరాకరించింది. బహుశా ఆ తరువాత అభిప్రాయం మార్చుకుని ఉండవచ్చు. భారత పారిశ్రామిక ప్రగతిలో తమ చెయ్యికూడా ఉన్నదని అనిపించుకోవాలనే అభిలాషతో కాంట్రాక్టు కోం ఫ్రాన్స్ తాపత్రయపడుతున్నట్లు ఉన్నది.



బిహార్ గవర్నర్ పదవినుం

**విరమించుతున్న డా॥ జాకిర్ హుసేన్**

కైగా ఫ్రాన్సు ఇదివరలో ప్రకటించిన ఆర్థిక సహాయంతో, ఈ పథకంకోసం పెట్టే పెట్టుబడికి సంబంధం ఉండదు.

ఈ కాంట్రాక్టువిషయమై తుది నిర్ణయాలు చేసేందుకు ఈ నెలలో అమెరికా, ఫ్రాన్సులతో సంప్రదింపులు ప్రారంభంకాగలవని తెలుస్తున్నది.

* * *

గుజరాత్, మహారాష్ట్రలలోని పరిశ్రమలకు కొలిమినూనె (Furnace Oil) వాడకునేవిషయంలో ప్రభుత్వంతో వచ్చిన వివాదం ఇంకా కొనసాగుతూనే ఉన్నది. పరిశ్రమలలో బొగ్గుకు బదులు కొలిమినూనె వాడుకోనివ్వాలని వాటి యజమానులు కోరుతున్నారు. ప్రభుత్వం ఒకవంక ఇప్పటి ఎక్సయిజుసుంకాలు అలాగే ఉంచాలని యోచిస్తూ, వేరొకవంక విదేశీ మారకం పొదుపుచెయ్యడానికని కొలిమినూనె వాడకం పెరుగనివ్వరాదని అనుకుంటోంది. అయితే ఈ పరిమితులకు లోబడి బొగ్గుకు మారుగా కొలిమినూనె వాడుకోనిచ్చినట్లయితే పారిశ్రామిక ఉత్పత్తికి చేయూత ఇచ్చినట్లు అవుతుందని అంతా అంగీకరిస్తున్నారు.

* * *

"స్టాండర్డ్ వాక్యూమ్ సంస్థ అంతర్ధానం చెంది దాని స్థానంలో "ఎస్సో స్టాండర్డ్ ఈస్టరన్" సంస్థ ఉద్భవించింది. అయితే ఇదివరలో స్టాండర్డ్ వాక్యూమ్ కంపెనీలో భాగస్వామిగా ఉండిన సోకోనీ మోబిల్ ఆయిల్ కంపెనీ భారతదేశంలో వ్యాపారం చేయరాదనే ఆంక్ష ఏమీ లేదు. ప్రభుత్వ అనుమతి పొంది అది వ్యాపారం చేసుకోవచ్చు.

ఈ దేశంలో ఒక కందసత్తైలాల కర్మాగారం, పెట్రో—రసాయనిక ద్రవ్యాల కర్మాగారం నెలకొల్పేందుకు ఎస్సో స్టాండర్డ్ ఈస్టరన్ సంస్థ భారతప్రభుత్వంతో ఇప్పుడు సమాలోచనలు జరుపుతుంది. కందసత్తైలాల కర్మాగార్ని ప్రభుత్వమూ — ఎస్సో సమిష్టిగా ఏర్పాటుచేయాలనీ, ఇందుకు పెట్టే ఈక్విటీపెట్టుబడిలో ఆయిల్ ఇండియా లిమిటెడ్‌లోవలె ఉభయ పక్షాలకు సమానమైన వాటా ఉండాలనీ ఈ సంస్థ సూచించింది. పెట్రో—రసాయనిక ద్రవ్యాల కర్మాగారం కూడా మన డబ్బు (రూపాయలు) తోనే ఏర్పా



**డా॥ సుశీలా నయ్యర్**



శ్రీ సత్యనారాయణ సిన్హా

టవుతుంది. ఇందుకు కావలసివస్తే ఈక్విటీ పెట్టుబడిలో మన ప్రజలకు 40% వాటా ఉంటుంది. మిగతా 60% వాటాలు ఎస్సో సంస్థకు చెందిఉంటాయి. కర్మాగారానికి అవసరమయ్యే విదేశీ ద్రవ్యాన్ని, ఎస్సో సంస్థ ఈక్విటీ పెట్టుబడిలో భాగంగాగాని, లేక అమెరికాలోని మరేదైనా పెట్టుబడిసంస్థ నుంచి అప్పుగా గాని సమకూర్చవలసి ఉంటుంది.

ఈ కంపెనీ మొదట 1 లక్ష టన్నుల సరుకుల ఉత్పత్తిచేయగల కర్మాగారం నిర్మించేందుకు అనుమతి కోరింది. కాని, ఆ తరువాత రెండు లక్షల టన్నులు సరుకులు ఉత్పత్తి చేయడానికి వీలైన కర్మాగారానికి అనుమతి అడిగింది. లక్షలటన్నుల పథకానికి లైసెన్సు ఇచ్చేందుకు ప్రభుత్వం ఇది వరకే అంగీకరించింది. ఇప్పుడు దానిని రెండు లక్షల టన్నుల పథకంగా మార్చేందుకు సంప్రతింపులు జరుగుతున్నాయి. ఈ పథకానికి $1\frac{1}{4}$ కోట్ల డాలర్లు ఖర్చుకాగలవని అంచనా. రాజస్థానులో పరిశోధన సాగించేందుకు ఈ కంపెనీ గత సంవత్సరం జరిపిన సంప్రదింపులు విఫలమయ్యాయి. ఇతరప్రాంతాలలో పరిశోధనలు జరిపే నిమిత్తం మళ్లీ సమాలోచనలు సాగించవచ్చునని నూతనసంస్థ ఆశిస్తున్నది. ★



బీహార్ గవర్నర్‌గా నియమితులైన

**శ్రీ ఎం. అనంతశయనం అయ్యంగార్**

# చిరునవ్వు మెరిసింది


౩౩–వ పేజీ తరువాయి


కింకొకడూ ఇలా వరదాతో కొందరూ—తల్లికో ఇల్లాలికో ప్రాణమ్మీదికొచ్చిందని విచారంతో కొందరు వెళుతున్నారు. రైలు వీళ్లందర్నీ సమదృష్టితో మోసుకుపోతోంది. భూమాత దొంగల్ని దొరల్నీ అనుమానితుల్నీ అధికారుల్నీ గుండె బరువు లేకుండా అందర్నీ మోస్తోంది.

* * *

రంగపురం వెళ్లాలంటే తెల్లారుతుంది, రైలు బల్లమీద చోటుచేసుకుని కూర్చుని కునికి పాట్లు పాడుతూవుంటే ఏవేవో జ్ఞాపకాలొస్తున్నాయి.

'రావూ, రారా అన్నం పెడతాను—' కథలు చెబుతూ కలిపి తినిపించేది అక్క. చందమామా పాపి కథ, రాజకుమారి రాక్షసుడు కథ పేనుకథా దోమ కథా—ఇవన్నీ అమ్మనోట వినే అదృష్టం లేకపోయింది. అయినా అక్క ఆలోటుని భర్తీ చేసింది.

పిన్నిబాగానే చూసినా అమ్మ స్థానా న్నందుకో లేక పోయింది.

పిన్ని పట్టువల్లే అక్కని రంగపురం ఇచ్చారు. రంగపురం పల్లెటూరు చదువూ సంస్కారంలేని ఇంట్లో అక్క సుఖపడదేమో అని నాన్న వోవంక భయపడుతున్నా ఏదో ఇంతఉన్నవాళ్ళు, నలుగురి మధ్య నుంటుందిలే అని ఇచ్చేశారు

పెళ్లిలో అక్కతో పల్లకీ యెక్కాడుతను. బాజాలమోతకి వుబ్బి తబ్బిబ్బవడం, అక్కగారూరు తను వెళ్లడం—పెళ్లిలో అయిన గందరగోళాలూ దెబ్బలాట్లూ—

మరో ఏడాదికేగా, అక్క అత్తారింటి కెళ్లడం!

నిరాశగా నడిచేవి రోజులు చదువూ తాపత్రయం పెరగడం, పట్నం మకాంతో, మిత్రులసహవాసాలతో, అంతస్థు పెరగడం, అక్కకీ తనకీ అనుకోనిదూరం ఏర్పడ్డం.

ఇద్దరుపాపలు పుట్టేక తను అక్కగారింటికోసారి వెళ్లేడు. — పచ్చడి వరిపొలాల మధ్యలనించి తెల్లటి పైజామతో షికారుకెళ్లి, బావగారి సేరీ చూశాడు. చల్లటి కొబ్బరి నీళ్లూ తియ్యటి మామిడి పళ్లూ— వీట్లో ఆనందం చూడ్డమో ఇరుసూ చక్రమూ పట్టాలూ లేక గమ్యస్థానమూ తెలియక అక్క సాగించే జీవితయానంలో విషాదం చూడ్డమో తెలియ లేదు.

'ఒకరు చూసేది ఒకరుచేసేది యింకేముంది నాయనా, ఇదంతా నేనెరక్క చేయించిన పనిగాదూ' అనిపిన్ని కూడా అనేది. అప్పుడప్పుడు

అక్క అత్తగారు పక్షవాతంతో మూలపడింది. నోరుమాత్రం పడలేదు. ఒట్టి చాకిరీతో మనిషి సళాకులా అయిపోయి ఎముకా చెర్మం మిగలడం తన కళ్లతో తనెప్పుడూ చూళ్లేదు 'సరిగా తిండైనా తింటుందో లేదో — పురుళ్లకైనా పంపరుగదా. మనమేం చెయ్యగలం.'

బండెడు బలగంవున్నా అక్కంటే అందరికీ అలుసే. అమ్మా ఒదినచూడే—అనే మరిదొకడూ వాన్నా ఒదిన వాకు కోవా పెట్టనేలేదని యింకో

కూడ వీళ్లందరికీ ఎద్దులా చాకిరీ చేస్తున్నా అత్త మామల దృష్టిలో అక్క దోషిగానే మిగిలింది

ఎప్పుడేనా అక్క పుట్టింటి కంటూవస్తే కూడా ఈమరిదో మరదలో తయారు. అక్కదృష్టిలో పేవంగితి ఎలా వుంటుందని తెలుసుకోడానికే వీళ్లేదు.

సరిగ్గా పదేళ్ల క్రిందట: తను వేసంగి సెలవు లొస్తే అక్కయ్యగా రూరు వెళ్లడం. అదే ఆఖరి సారి అక్కని చూడ్డం—తనలో వెలపెరిగి విలువ తగ్గినరోజు — మానవత్వం మరుగుపడి రాక్షసత్వం తొంగి చూసినరోజు — అందరిలాగే— స్త్రీకి సంబంధించిన విషయంలో రెండోవేపుచూడ్డం మరిచిన రోజు.

సావిట్లో విజ్జీ జయలకు తను ఏదో కథచెబుతూ వున్నాడు. అక్క కొత్తగాపుట్టిన పసివాడి వేపు చూసుకుంటూ వాడి బలహీనానికి బాధ పడిపోతూ వాడి క్షేమానికి వెయ్యి దేముళ్లకి మొక్కుకుంటూ కూర్చుంది.

డాక్టర్ని తీసుకురమ్మని పెట్టిన కబురు అత్తగారి చెవినబడ్డాది.

'డాక్టరెందుకూ, యింతోటి దానికీనూ. కాస్త కర్పూరం పోస్తేసరి' అందావిడ, కర్పూరం విషమనీ పిల్లలకి పొయ్యరాదనీ వాదించాడు తను

'నీది మరీ విడ్డూర మబ్బాయీ నేవీ పిల్లల్నెలా పెంచేనంటావ్' అని ఎదురు వాదనకి దిగిందావిడ.

డాక్టర్ని తీసుకొచ్చి చూపించారు మందుకొనడాని కయితే మాత్రం ఆవిడ ససేమిరా ఒప్పలేదు 'పోనీ నేను కొనితెద్దునా' అని తను అనుకున్నా, వాళ్లేమనుకొని పోతారో అని సాహసించలేక పోయాడు అక్కడి ధైర్యం చెప్పాడు పొడిమాటల్తో.

ఆ మధ్యాన్నం అంతా నిద్రపోతున్నారు పుస్తకం చదువుతూ కూర్చున్నాడు తను—

పెరట్లోంచి పెద్దకేకలు వినిపించాయి

అత్తగారి కేకలు విని ఇరుగూ పొరుగూ అప్పటికే చేరారక్కడ.

'ఏమైందండీ'

'ఇంకా ఏమవ్వాల్నాయనా—నీఅక్క భాగోతం చూడూ.'

చూస్తే ఏమీ అర్థం కాలేదు

'.... .... ఎన్నాళ్లబట్టి సాగిందో, ఈతంతు— వీరిగా, నీకైనా బుద్ధిలేదురా? తిన్నింటి వాసాల్లెక్క పెడుతున్నావ్—'

పాలేరు వీర్రాజు ఎదురుగా నేరంచేసిన వాడిలా నిలబడ్డాడు.

'. ... పాపిష్టిదానా, మాపరువు తీశావు ధాన్యం అమ్మి వాడికి పెడతావుటే—? వాడేమౌతాడే నీకూ?— ఛీ ఇంతకంటే ఏనూతిలోనైనా పడి చావకూడదుటే?—'

అత్తగారే అన్నీ మాట్లాడింది

ఆవిడ మాట్లాడెయ్యడం ఒకెత్తూ అక్క కాదు, లేదు అనకుండా నిలబడిపోవడం వోఎత్తు భరించడం కష్టమై అసాధ్యమై పోయింది

బావగారొచ్చి వీర్రాజుని చావగొట్టాడు

'బాబూ నే నేపాపం ఎరగను బాబోయ్ అమ్మగార్నే పలకండయ్యా—అరి బిడ్డ లాటోణ్ణి—' అంటూ ఏమో చెప్పుకొని మొర్రో మన్నాడువీరయ్య వాడిమా టెవరైనా వింటేనా?

'ఎంత సంగనాచిలా వుందో—!'

'పెద్దింటి పిల్లకదా, ఇవేం బుద్ధులూ?'

'అమ్మాయమ్మగా రెంత మంచివారూ! నిప్పు లాటి మనిషి!—అలాంటి వాళ్ల యింట్లో—ఛీ ఛీ అయినా కాలం!'

ఇలా నలుగురూ ఆడే మాటలువిని తలెత్తలేక పోయాడు తను

పాలు విరిగినట్లు మనసు విరిగిపోయింది. ఈ గడప తొక్కకూడదనిపించింది. అంటే అంటని జ్ఞానంతో చేసి చెయ్యని నిర్ణయం అది.

కాలమూ పరిస్థితులూ అలావచ్చేయి కూడానూ పెద్దచదువులు చదవడానికి ఎక్కడికో వెళ్లిపోడం, —అనుకోని చోట అనుకోని విధంగా అనుకోని వాళ్లతో పెళ్లిరూపంతో బాంధవ్యం ఏర్పడ్డం—పెళ్లికి రమ్మని తప్పని సరిగా పంపిన శుభలేఖకి అత్తగారు పోయి నాలుగురోజులైంది. రా కూడదంటూ అక్క ఉత్తరం రాయడం—తరువాత ఈఆరేళ్లలోనూ అక్కా మాయింటికిరా అని తను రాయకనే పోవడం—అలా అయిపోయింది.

నాటికి నేడు — 'ప్రాణం మీదికొచ్చింది రమ్మని' ఈ టెలిగ్రాం

అంతర్యంలో అక్కకోసం ఏదోబాధ అణగి మణగి అలమటిస్తూనే ఉంది అయితే అభిజాత్యం అడ్డొచ్చి అనుబంధాన్నే సడలించింది

జీవితంలో తప్పుచెయ్యని వారుంటారా— ? తప్పని క్షమించే అవకాశం లేదా? ఎలాటి వెనక ఎలాటి కారణాలుంటాయి?—యివేవి ఆలోచించే టందుకు తనకిప్పుడూ తీరిక చిక్కలేదు

ఈ వాళరాత్రి—ఈరైలు బల్లమీద నిద్ర పట్టకపోతే తనకి మిగిలినరాత్రి—ఆలోచించటానికి తీరికచిక్కిందా?—సమయం మించిపోయిందేమో నని మనసు కీడు శంకించసాగింది— అయినా మనసు రాజీకి రావడంలేదు

చిన్నప్పుడు తనకాల్లో ముల్లు విరిగితే తీసేదాకా నొప్పి పొందినఅక్క, ఆడుకుంటూ ఆడుకుకటూ ఐదు నిముషాలాలిస్యం అయితే ఆకలేస్తుంది అబ్బిగాడికని పరుగెత్తుకొచ్చిన అక్క, పదేళ్లకిందట తను చూసిన అక్క—ఏతప్పు చేసిందో, ఏ పరిస్థితుల్లో చేసిందో ఎవరికి చెప్పుకోలేని అక్క—తనని రమ్మని కబురు చెయ్య మందంటే — ఎదోవేదన కలుగుతోంది అక్కని ఇన్నాళ్లు ఉపేక్షించడం చెయ్యరాని నేరమని మనసు అంగీకరిస్తోంది మనసు అంగీకరించిన నేరానికి శరీరం మీద వేసే శిక్షలేదు

*　　*　　*

పదేళ్లలో చాలా మార్పులొచ్చాయి పాత సత్రం ట్రావెలర్సు బంగళాగా మారింది. హైస్కూలూ, లైబ్రరీ ఒచ్చినట్టున్నాయి బ్రహ్మ జెముడు కంచెలుపోయి ప్రహారీగోడలూ పాతడాబాలు పోయి మేడలూ ఒచ్చాయి

లోపల అడుగు పెట్టాడు రామం. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది

బావగా రెదురొచ్చాడు 'ఒచ్చావా, రామమేనా?' అంటూ.

'అక్క కెల్లా వుంది?'

# చిరునవ్వు మెరిసింది

'లోపలి కెళ్ళిచూడు, ఇప్పుడేవస్తా'

విజ్జీ జయా పెద్దవాళ్ళయ్యారు కొత్త మనిషిని చూడగానే పక్కకి తప్పుకుంటున్నారు మౌనంగా సావిట్లోకి నడిచాడు రామం

మంచంమీద వో అస్తి పంజరం పడుంది ఆ ఆకారం అక్క అని పోల్చుకున్న క్షణంలో దుర్భరమైన వేదన కలిగింది

'ఒచ్చావా తమ్ముడూ'—నూతిలోం చొచ్చినట్టు అక్క గొంతుకలోంచి శబ్దం

రామం మాట్లాడలేకపోయాడు ఇన్నాళ్ళకొచ్చి ఏం మాట్లాడగలడు! "ఎలా వుందక్కా, ఏం కంప్లెంటు—" అన్నైనా అడగడానికి నోరురాలేదు

కన్నీళ్ళు కార్చింది అక్క

బావగారు మౌనాన్ని భేదించి వైద్యం గొడవలు చెప్పాడు

భోజనాలయ్యేయి అక్కకి బత్తాయి పండు ఒలుస్తూ కూచున్నాడు రామం అక్క మొదలెట్టింది తనగొడవ

'లోకాన్ని లెక్కచెయ్యను తమ్ముడూ లోకంతో బాటు నువ్వూ న న్నపార్థం చేసుకున్నావు ఉన్నది చూసింది ఎలావున్నా విన్నదీ ఊహించేది అనడం లోకంపనీ, లోతులు తెలుసుకొని యోచనచెయ్యడం బుద్ధి మంతులపనీ—ఒకపని వెనకఆపని ఎంతటి బలీయమైన కారణాలవల్ల జరిగిందో అనిఆలోచించే నిదానం లోకానికెందుకుంటుందీ, అది అప్పుల ధర్మమైనప్పుడు!

దేవుడనే వాడుండబట్టి మీబావ గుడ్డిగా లోకం మాట నమ్మక నిదానించేరు లేకుంటే ఇంత కాలం బ్రతుకుభారం మోయక్కర్లేకపోయేది, మొదట్లో మీఅందర్లా అనుమానించినా నిదానించి నిజం తెలుసుకున్నారు

'జీవితంలో ఒక్కతప్పుచెయ్యని మానవులుంటారా ఏబలీయమైన పరిస్థితులకో తలవొంచి ఏదో ఒక తప్పుచేస్తారు దానివల్ల జన్మంతా కళంకం పొందడమేనా?

'అసలు నేనే తప్పుచెయ్యందే నామీద అభాండాలు వేశారు బాబుకి మందు తెప్పించాలిగదా అని—డబ్బు అత్తగారికి తెలిసి తీసుకోలేక—ధాన్యం అమ్మించాను అది దొంగపనేంకాదు నాబిడ్డకోసం నాసొమ్ము నే వెచ్చించుకోబోతే దొంగతనంఅనీ—దాని కింకేదో జత చేసి—అందరూ తలో మాటా అన్నారు

'తప్పులేనివార్ని భగవంతుడైనా దండించలేడు అందుకని, నిజంనిలకడమీద తేల్తుందని అన్నిటికీ తలవొంచి—ఆపసివాడిమీద ప్రాణాలు పెట్టుకున్నాను

'ఎప్పుడైనా, నాతరవాతొచ్చిన కోడళ్ళు పొందిన గౌరవం నాకు దొరకలేదు అదేదో జన్మాంతర కర్మఅని సరిపెట్టుకున్నాను

'పుట్టిన బిడ్డల అచ్చట్లూ ముచ్చట్లూ చూడకపోగా నాకళ్ళెదురుగా వాళ్ళని హింసించడమూ చూసి ఏమనలేక వూరుకున్నాను—పిరాజా చేతవాటుగా పిల్లల కేదైనా తెప్పించేదాన్ని—పిరిబ్బను ముక్కో, రబ్బరు గాజులో—అంతకన్నా ఏదీ?

'లేక పోదామని గాకపోయినా, తెలుసుకుని తెచ్చే గడుసుతనం అప్పట్లో మీబావగారికి లేదనేచెప్పాలి వేళకింత భోంచెయ్యడం, పొలంలోనూ పెరట్లోనూ వోపినంత చాకిరీచెయ్యడం ఆయనపని వంటావార్పూ ఇంటిచాకిరీ అంతా నావొంతు—ఇలా జోడెద్దుల్లా యీ ఇంటికోసం పాటుపడ్డాం

'ఇంతాచేస్తే, ప్రాణంపోయేవరకూ మనసూ వయసూ ఎరిగి సేవచేస్తే అత్తగారు నన్ను నమ్మనే లేదు—

'పిన్నిలాంటి దేవత లెవరికో చెల్లిందది

'గాదెడు ధాన్యం అమ్మితే దొరతనం, కుంచెడు అమ్మితే దొంగతనమూనూ? అని నాలోనేనే బాధపడి వోర్చుకునేదాన్ని—బిడ్డ ప్రాణంకోసం—ఆ ఆపద ముందు నాకేదీ తోచలేదు

'తరుణంలో మందుపడక నాకళ్ళముందే నాబిడ్డ వెళ్ళిపోయాడు నాకు మాత్రం ఈ మచ్చమిగిలింది'

మౌనంగా, కళ్ళూ మనసూ వొప్పజెప్పి అంతా విన్నాడు రామం

'నీతో నిజం చెప్పేనని, నువ్వు నన్నిప్పుడపార్థం చేసుకోడం లేదని, ప్రాణానికెంతో హాయిగావుంది నువ్వు పెద్దవాడి వవడం, పిల్లాజెల్లా చూసుకుని ఆనందంగా వుండడం, నాకెంతో కులాసాగావుంది బాబూ

'ఒక్కసారి నీపెళ్ళాన్ని చూడాలనుంది కాని అవుతుందోలేదో—'

'అలా అనకక్కా ఎంతసేపు వారంరోజుల్లో మళ్ళీ మనిషివవుతావు' మనసారా రోదించాడు 'వైద్యం సరిగ్గా లేకపోతే పట్నం తీసుకెడతాను. నాపెళ్ళాంచేతనీకు సేవచేయించి నాతప్పుకి శిక్ష వేసుకోవాలక్కా'

'ఎంతమాటన్నావు బాబూ, నాకంత అదృష్టమా?—నువ్వా మాటఅంటే నాకెంతో హాయిగావుందిరా'

బావగారొచ్చారు 'ఇదిగో—నువ్వు విశ్రాంతిగా పడుకోడంలేదు—'

'నా కంతా విశ్రాంతే నండీఇంక'

అక్క శుష్కవదనంమీద చిన్నచిరునవ్వు మెరిసింది రెండు ఆనంద భాష్పాలు కనుకొనకులదాకా వచ్చి ఆరిపోయాయి ★

ఒక సినిమానటుడు అడిగినవాడికి లేదనకుండా కాస్తోకూస్తో డబ్బు అప్పిస్తున్నాడు ఇదిచూసి ఆశ్చర్యపోయిన మిత్రుడు అతని ప్రవర్తనకు కారణ మడిగాడు

"మరేం దిగులుపడకు! నాకు విశ్రాంతి కావలసివచ్చి అలా చేస్తున్నా" నటుడు అసలు రహస్యం చెప్పాడు.

జి బాలచందర్ (మద్రాసు)

# గళ్లనుడికట్టు - 98

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | | 2 | ■ | ■ | ■ | 3 | | 4 | ■ |
| 5 | | ■ | 6 | 7 | ■ | 8 | | ■ | 9 | 10 |
| | ■ | ■ | ■ | | ■ | | ■ | ■ | ■ | |
| 11 | 12 | ■ | 13 | | 14 | | 15 | ■ | 16 | |
| ■ | 17 | 18 | | ■ | | ■ | 19 | 20 | | ■ |
| ■ | ■ | | ■ | ■ | ■ | ■ | ■ | | ■ | ■ |
| ■ | 21 | | 22 | ■ | 23 | ■ | 24 | | 25 | ■ |
| 26 | | ■ | 27 | 28 | | 29 | | ■ | 30 | 31 |
| | ■ | ■ | ■ | | ■ | | ■ | ■ | ■ | |
| 32 | 33 | ■ | 34 | | ■ | 35 | 36 | ■ | 37 | |
| ■ | 38 | | | ■ | ■ | ■ | 39 | | | ■ |

## అడ్డం

1 కురుకుల వృద్ధునిలో మొదటే రాశి ఉన్నది
3 కమల చిందరవందర అయితే చిక్కే!
5 పిన్న
6 ఒక చిన్న గింజ
8 కోపము
9 క్షేత్రము తిరగబడింది!
11 తండ్రి పిడతలో దాక్కున్నాడు.
13 భయస్థుడు!
16 ఏకాకి మనిషికాడా? ఎక్కడ?
17 రైలు ప్రయాణానికి ఇది ఆగారం!
19 పోయిన సంవత్సరం
21 చిగురు కొద్దిగా మార్చినా మారదు
24 అధరము
26 నామము!
27 శుకవాన!
30 నీరు తిరగబడింది—రిగాణాకుందు అంతే మరి!
32 మీహిరగులుడిముందు శ్రేష్ఠము ఉందంటే నమ్మరుకాని నిజం
34 అతిగా మాట్లాడు నీటిప్రవాహం తయారవుతుంది
35 తిమింగలము ఈ చేపను మింగుతుందిట! మితి ఇంతే
37 నేరుగాలేని కత్తి
38 రామన్న నత్తిమధ్య సన్మానం కద్దు
39 మితుడు మొదట కొంచెం మారిస్తే శుక్రుడు!

## నిలువు

1 ఆకున్న కూన కావలెను!
2 పత్రము తిరగబడింది.
3 —బొగ్గు
4 కనుమలో నేత్రము.
5 పిడిచిన దానిలో అల్పము
7 నీటి పొంగు
8 హిమ్యము తలక్రిందు అయింది!
10 కరకపెట్టు చేతకి చేరిస్తే వస్తుంది
12 ఏటి ఒడ్డు, ప్రదేశము
13 గౌరవము!
14 కోపము తలక్రిందులు—పరుషము వెదకండి!
15 తునియలో అనకాపల్లి దగ్గరగాఉన్న ఒక ఊరు
16 అడవి అవడా?
18 రాకెట్టు అవుతే అనురాగం దాక్కొనిఉంటుంది
20 వరువుదక్కి మధ్య చూస్తే దొరికే తాళము ఇక్కడ చిందర వందర
21 చిన్న
22 పై మాటలోనే కాంతి, తిండికి సంబంధించినది
23 వాలము
24 ఎన్నో!
25 వికసించినది ఆవిరిలో వెతకండి!
26 పేరి నెయ్యి మిక్కిలి పరిశీలిస్తే గౌరవం తప్పదు!
28 ప్రేలుడు గుర్రం మధ్య ఎద్దు మెడకు కట్టే గంట
29 ముక్తి!
31 కాలితే పడేవి
33 మంచు మహిమా?
34 వర్షం
36 వనిమి చివర ఓమము తలక్రిందులు?
37 అతను ఉపయోగించు!

## 97-వ గళ్లనుడికట్టుకు జవాబు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1ఆ | 2రా | ■ | 3డ | గా | 4ధి | ■ | 5ప్ర | క్ష | 6పా | 7త్రం |
| 8చ | డు | వ | రి | ■ | 9వే | త | తి | ■ | 11ల | తు |
| త్ర | ■ | ■ | ■ | ■ | ■ | గ | ■ | ■ | వె | ■ |
| 12కొం | 13ప | ■ | ■ | 14మే | ■ | వ | ■ | ■ | ల్లి | 15డి |
| ■ | 17తి | క | మ | క | ■ | 18రి | [illegible] | ■ | ■ | డు |
| 19ద్రో | మ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | 20ఈశ | త |
| హి | ■ | ■ | 21వా | 22త | ■ | 23బు | ద్ధ | గ | య | ■ |
| 24కై | 25మే | ■ | ■ | రు | ■ | త్ర | ■ | ■ | 26ది | 27వె |
| ■ | ద | ■ | ■ | వా | ■ | ■ | ■ | ■ | ■ | ను |
| 28డ్డ | మ | ■ | 29చే | త | 30కి | ■ | 31ఆ | ము | 32సె | క |
| 33త్రు | డు | గు | లు | ■ | 34రి | పు | వు | ■ | 35లి | లు |

★

"మనం పెళ్ళిచేసుకున్నట్టు రాత్రికల వచ్చింది దాని అర్థం ఏమిటంటావ్ ?" అతడు తన ప్రియురాల్ని అడిగాడు

"ఏముందీ ! మేలుకుని ఉన్న ప్పటికంటే నిద్రలో మీ బుద్ధి సవ్యంగా పనిచేస్తుందన్నమాట" ఆమె సమాధానానికి వెతుకోన్న లేదు

టి బి ప్రసాద్ (విజయవాడ)

# మనము—మన రాష్ట్రం

8 వ పేజీ తరువాయి

చిక్కులవల్ల అనుకున్నటు అమలు అవుతాయని హామీ యేమిటి? ఒకవైపు పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి కొరతవుండే మరోవైపు గ్రామాలలో విద్యుద్దీపాలంకరణ ప్రారంభోత్సవాలు ఎక్కువవుతున్నాయి. వ్యవసాయానికి విద్యుత్తు అవసరమే; ఇవ్వవచ్చుకాని కొరత తీరేవరకైనా ఇళ్లకు సప్లై చేయడం తగ్గించడం మంచిదేమో ఆలోచించాలి.

ఇది ఇలా ఉండగా పరిశ్రమకు కావలసిన మరో ప్రధాన ద్రవ్యం బొగ్గు కూడా 45 శాతం కేంద్రం కోత పెట్టింది. దేశంలో బొగ్గు లేక గనులలో ఉత్పత్తికాక కాదు—తీసుకొనిపోయేనాథుడులేక గనుల వద్ద గుట్టలు గుట్టలు పడి ఉంది. రైళ్లలో రవాణా చిక్కులవల్లనే కృతకమైన ఈ కరవు ఏర్పడింది. ఇంతవరకూ నెలకు మన రాష్ట్రానికి 2 వేల వాగన్ల బొగ్గు సప్లై చేస్తుండగా ఇప్పుడది 1100 వాగన్లకు తగ్గించారు. ఈమధ్య రైల్వేమంత్రి పార్లమెంటులో మాట్లాడుతూ బొగ్గు సరఫరాకు కావలసినన్ని వాగన్లు సప్లై చేస్తున్నామని మూడవ ప్రణాళికలో రద్దీ తట్టుకోడానికికూడా తగిన ఏర్పాట్లు చేశామని హామీ ఇవ్వగా ఇంతలోనే ఈ కోత ఏమిటన్న ఆశ్చర్యం కలగక మానదు. అంటే మంత్రుల హామీలకు వాస్తవ పరిస్థితులకు పొంతన ఉండదనే తాత్పర్యం. ఎక్కడినుంచో బొగ్గు రావలసిన రాష్ట్రమైన గతైతే అర్థం చేసుకోవచ్చుకాని ఏటా 25 లక్షల టన్నుల బొగ్గు ఉత్పత్తి అవుతూ మూడవ ప్రణాళికలో మరో 20 కోట్లు పెట్టుబడితో 30 లక్షల టన్నులకుపైగా ఉత్పత్తి పెంచుకోబోతున్న సింగరేణి గనులుండి కూడా మన రాష్ట్రానికి ఈ కొరత ఏమిటో తెలియదు. బొగ్గు ఉత్పత్తిపైన వసతిపైనా—గనులు మనవే అయినా—మన రాష్ట్రప్రభుత్వానికి అధికారం అజమాయిషీ లేదు కనుక అది అంతే. విద్యుచ్ఛక్తి కోతకు గురియైన పరిశ్రమలు బొగ్గుతో నడిచేందుకు ప్రయత్నిస్తాయేమోనని ఇప్పుడు బొగ్గు సప్లై కూడా తగ్గించి తగిన శాస్తి చేశారు.

ఇలా పరిశ్రమకు కావలసిన ప్రధాన ద్రవ్యాలైన విద్యుత్తు, బొగ్గు కొరతకొని రవాణా సదుపాయాలు లేని పాదిపదికే కొత్త పరిశ్రమ ఏర్పడలేదని గగ్గోలుపెట్టి ప్రయోజనమేమిటి? పారిశ్రామిక దృక్పథం లేదని విదిలించి లాభమేమి? అసలీ పారిశ్రామిక దృక్పథం లేకపోవడమన్నది ప్రైవేటు పెట్టుబడిదారులకన్నా తమకే ఎక్కువని రాష్ట్రప్రభుత్వం ఏనాడో ఋజువు చేసుకున్నది. కాకపోతే 305 కోట్లు తృతీయ ప్రణాళికలో పరిశ్రమకు 19 కోట్లే కేటాయిస్తారు కనుకనా? పారిశ్రామికులను నిరుత్సాహపరచే ఈ చర్యలన్నీ అందుకు తగట్టుగానే ఉన్నాయి. ఏవేవో కొత్త పరిశ్రమలు వచ్చేస్తున్నాయని ఆర్థికమంత్రి ఏకరవు పెట్టారు. అవన్నీ కనీసం త్వరగా వచ్చినా ప్రధాన ద్రవ్యాల కొరతవల్ల పని చేయవని గ్యారంటీగా చెప్పవచ్చు. ఈ పరిస్థితి చూచి కొత్త పారిశ్రామికులు మన రాష్ట్రాన్ని కెక్కే ప్రమాదం కూడా ఉండదు. పారిశ్రామిక దృక్పథం లేదని ఎలాగూ మనమే ఒప్పుకుంటున్నాం గనుక ఉత్తరోత్తరా అయినా అటువంటి దృక్పథం ఏర్పడే ఆస్కారం లేకుండా కేంద్రం కూడా యథాశక్తి తోడ్పడుతుంది. ★



శ్రీరామనవమి ఉత్సవాల సందర్భంలో అశేషజన కోటిని ఆకర్షించే భద్రాద్రి రామాలయ దృశ్యం

# యువ ప్రపంచం

## విద్యావిధానాలు

నేటి మన విద్యావిధానాలు సరియైన పద్ధతిలో లేకపోవటానికి కారణం విశ్వవిద్యాలయాధికారులే అంటాను. పూర్వపు ఇంటర్మీడియేట్‌కు బదులుగా ప్రీ యూనివర్శిటీ ప్రవేశపెట్టారు. ఇంటర్మీడియేట్‌కు ఉన్నంత విలువ ప్రీ యూనివర్శిటీకి లేదని ప్రజల, విద్యార్థుల ఆదరణ మూలంగా తెలుస్తోంది. అంతే కాక మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సులో కూడా మెయిన్ సబ్జక్టు, సబ్సిడరీస్ తీసివేసి, ఆ స్థానంలో మూడు మెయిన్ సబ్జక్టులు ప్రవేశపెట్టారు. దానితో విద్యార్థులు ఒక మెయిను స్థానే మూడు మెయిన్ సబ్జక్టులు చదవవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇది విద్యార్థులకు ఎక్కువ శ్రమను కలుగజేస్తున్న కారణంగా దీనికి కూడా తగినంత ప్రోత్సాహం లభించడం లేదు. విద్యా విధానంలో మార్పు తెచ్చినప్పుడు అది విద్యార్థులకు, ప్రజలకు అనుగుణంగా వుండాలి కాని, విద్యార్థుల నెత్తిమీద ఇంకా ఎక్కువ బరువు వేసేటట్లు వుండరాదు. మైసూరు యూనివర్శిటీ మరల ప్రీ యూనివర్శిటీ స్థానే ఇంటర్మీడియేట్ ప్రవేశపెట్టబోతున్నారని తెలిసి చాలా మంది సంతోషించారు. అదే విధంగా మిగిలిన యూనివర్శిటీలు కూడా చేస్తే విద్యార్థులు సంతోషిస్తారు.

డి. యస్. రాఘవేంద్రరావు (విజయవాడ)

*   *   *

## కట్నాల బ్లాక్‌మార్కెట్

నేటి యువకులు విద్యావంతులైన కొద్దీ వివాహానునే మార్కెట్‌లో వారి విలువ మరీ హెచ్చిపోతున్నది. చదువుకున్న, చదువుతున్న అమ్మాయిలను పెండ్లి చేసికొనడం, అదీన్నీ హెచ్చు కట్నాలతో— మరీ ఘోరమైపోయిందీ రోజుల్లో అబ్బాయిలకు. వరకట్నం నిషేధబిల్లులు అమలులోనికి వస్తున్న కొద్దీ వరకట్నం బ్లాక్‌మార్కెట్ (అంటే ఇతరులకు తెలియకుండా) జరుగుతుంది.

వారి హిరణ్యాక్షవరాలకు తలొగ్గని, తలొగ్గలేని తల్లిదండ్రులు తమ కుమార్తెలను చదివిస్తారు. ఎంతవరకు చదివిస్తారు? తమ తాహతు ఉన్నంతవరకు. తరువాత అమ్మాయి ఉద్యోగానికి తయారు. అమ్మాయి ఉద్యోగం చేయడం ఘోరమైన యీ రోజుల్లో ప్రతిరంగం(ఆఫీసులోను)లోను అమ్మాయిలే. స్త్రీలు చదువుకోవచ్చు కాని మనం చదువుకోడం ఉద్యోగం చేయడానికే అంటే అంత కన్నా పొరబాటులేదు. అవసరం, అవకాశం ఉన్న వాళ్లు ఉద్యోగాలు చేయవచ్చు అంతేగాని ప్రతిఒక్కరు చదువుకొన్నాను కాబట్టి ఉద్యోగం చేయాలనుకోవడం మరీ పరిపాటైందీ రోజుల్లో. అందరూ అందలం ఎక్కేవాళ్లైతే ఏట్లా చెప్పండి?

యువకులకు యువతులతో అన్నిరంగాలలోను పోటీ. అబ్బాయి చదువైంది. పెండ్లి చేయాలి. ఉద్యోగంలేదు. ఉద్యోగం లేకపోతే పిల్లనెవరిస్తారు? ఇది కొందరి యువకుల కన్న తల్లిదండ్రుల సమస్య. ఇంకొక ప్రక్క అమ్మాయి చదువైంది. ఉద్యోగం చేస్తోంది తల్లిదండ్రులుగా మాబాధ్యత తీర్చాలి వరుడు కావాలి వరుడు దొరికినా నిరుద్యోగి దొరుకుతున్నాడే! ఎట్లా మరి? ఇది కొందరి యువతుల కన్న తల్లిదండ్రుల సమస్య. ఈ సమస్యల పరిష్కార మార్గమేది?

రోజులు మారాయి, మారుతున్నాయి, మారుతాయి. అట్లాగే కాలగమనాన్ని అనుసరించి యువతీ యువకులు (మనం) పరిస్థితుల నవగాహనం చేసికొని నడుచుకొంటే మన సంప్రదాయాన్ని మన భారతావని పేరూ నిలబెట్టినవార మౌతాము.

కొల్లి కస్తూరి (విశాఖపట్నం) ★



చిత్రకారుడు: ఎస్. జనార్దన్ (మద్రాసు)

### పొగత్రాగకపోతే !

"మీరు రోజుకు ఎన్నిచుట్టలు తగలేస్తారేవిటి?"

"సుమారు పది"

"వాటి ఖరీదు ఎంత"

"చుట్ట ఖరీదు 20 నయా పైసలు"

"బాబోయ్! రోజుకు రెండు రూపాయలు తగలేస్తున్నారన్న మాట! ఎంత కాలం నుంచి మీకీ అలవాటు"

"సుమారు 30 ఏళ్ళ నుంచీ"

"రోజుకు రెండు రూపాయలు చొప్పున 30 ఏళ్ళలో చాలా డబ్బు అయి ఉంటుందే!"



## పొట్టి కథలు

"నిజమేనండీ!"

"మీ ఎదురుగా ఉన్న భవనం చూశారా! "

"ఆఁ ఏమిటి సంగతి"

"మీకీ చుట్టల అలవాటు లేక పోతే ఈపాటికి ఆ భవనం కొని ఉందురు "

"మీరు చుట్టతాగరా?"

"ఎన్నడూ తాగలేదు"

"అయితే ఆ భవనం మీదా?"

"కాదు "

"సరేలెండి! ఆ భవనం నాదే!"

కాంతారావు (విజయవాడ)

* * *

### మిత్రుని సలహా

ఎన్ని సంబంధాలు వచ్చినా తన తల్లికి నచ్చటం లేదని ఒక 40 ఏళ్ళ యువకుడు మిత్రుడితో మొరపెట్టుకున్నాడు "అచ్చం మీ అమ్మలా ఉండే అమ్మాయిని ఎన్నుకో, ఆమెకు తప్పకుండా నచ్చుతుంది" మిత్రుడు సలహా చెప్పాడు

ఆరునెలలు గడిచిన తరువాత ఆ యువకుడు స్నేహితుణ్ణి కలుసుకుని "నీ సలహా ప్రకారమే చేశాను కట్టూ,బొట్టూ, మాట, ఒకటేమిటి అన్నివిధాల మా అమ్మలా ఉన్న అమ్మాయిని తీసుకువచ్చి ఆమెకు చూపించాను మా అమ్మకు ఆవిడ నచ్చిందికూడాను. .. " చెబుతున్నాడు

"మరింకేం బాగానే ఉంది. ఆ తరువాత ఏమైందేమిటి?" మిత్రుడు మధ్యలో ఆపి ఎదురు ప్రశ్న వేశాడు

"అదేమిటోరా! మా నాన్నకు ఆ అమ్మాయంటే బొత్తిగా గిట్టలేదు!" యువకుడు నిట్టూరుస్తూ సమాధానం చెప్పాడు

ఆర్ శ్రీనివాసరావు (కటక్)★

## రూ. 350 సాంఘిక నవలల పోటీ

2-8-61 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన పైపోటీకి వచ్చిన నవలలలో ఒక్కటయినా సంతృప్తికరంగా లేదు ! రూ 1000 ల పోటీ వేరే నిర్వహిస్తున్నాము కాబట్టి, రూ 350 మొదటి బహుమతిగా ఈ పోటీ నడపటం బాగుండదని పై పోటీకి రూ 350 ద్వితీయ బహుమతిగా ఇవ్వదలచాము రూ 1000 నవలలపోటీ నిబంధనలన్నీ ద్వితీయ బహుమతికి వర్తిస్తాయి రచయితలు ఎప్పటివలె సహకరించి ఈ పోటీ జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor : S. Sambhu Prasad.



దౌలతాబాద్ కోటలో చాంద్ మీనార్

ఫొటో వై. సావిత్రి (హనుమకొండ)